# 1857 పూర్వరంగములు



రచన:

దిగవల్లి వేంకట శివరావు, బి. ఏ., బి. యల్.



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

# పీ ఠి క

**"1857"** అనగానే భారతీయు లింగ్లీషువారి నీ దేశము నుండి వెళ్ళగొట్టుటకై చేసిన గొప్ప స్వాతంత్ర్య సమరము మనకు జ్ఞాపకము వచ్చును. అయితే మన దురదృష్టము వలనను, ఆంగ్లేయుల అదృష్టమువలనను ఆ యుద్ధమునందు మనవారు పరాజితులైరి. ఆ మహాప్రయత్నము విఫలమైనది. ఆంగ్లేయు లీ తిరుగుబాటును అతి క్రూరములైన పద్ధతులతో అణచివేసి భారతదేశమునందు నిరంకుశమైన ప్రభుత్వ విధానమును స్థాపించి 1947 వరకును పరిపాలింపగలిగిరి.

ఈ యుద్ధ మీ విశాల భారతదేశములోని అన్ని ప్రాంతములందును జరుగలేదనియు, ఈ యుద్యమమునందు పాల్గొనిన ప్రజలలో హిందువులు, మహమ్మదీయులును భిన్న మతధర్మములకు చెందినవారనియు, ఈ యుద్ధమునందు ప్రధానపాత్ర వహించినవారు ఇంగ్లీషు వర్తక కంపెనీవారి పట్ల అసంతృప్తిచెందిన సిపాయిలును, ఇతర అల్పసంఖ్యాక వర్గములవారు ననియు, అందువలన దీనిని జాతీయ స్వాతంత్ర్య సమర మనుటకు వీలులేదనియు ఇంగ్లీషు చరిత్రకారులును, వారి శిష్యగణము ననుచుందురు.

ఏ దేశమునగాని స్వాతంత్ర్యము కొరకు జరిగిన ఒక యుద్ధము లేక ఉద్యమము జాతీయమగునా కాదా అని నిర్ణయించుటలో అది దేశవ్యాప్తముగా అన్నిచోట్ల జరిగినదా? దేశప్రజలందరు నందులో పాల్గొనిరాయని యడుగుట సమంజసముకాదు. ఏ స్వాతంత్ర్యోద్యమమూ దేశములో

నన్ని మూలలకు వ్యాపింప జాలదు. దేశములోని ప్రజలందరు నందులో పాల్గొనుటయు జరుగదు. కొందరు మాత్రమే దాని కొరకై యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడుదురు. మిగిలిన వారు హర్షింతురు. తాత్కాలికముగా దేశము నేలు ప్రభుత్వము నాశ్రయంలో వారెప్పుడు నుందురు. అందువలన నా యుద్యమము దేశప్రజల క్షేమలాభముల కొరకు, స్వాతంత్ర్యముకొరకు జరిగినదా లేదా ? ప్రజలలో చెప్పతగినంత మంది దానిని హర్షించిరా లేదాయని మాత్రమే ఆలోచింప వలెను.

ఆ యుద్యమము జాతీయమైనదాయని నిర్ణయించుటలో మరియొక ముఖ్యవిషయము గమనింపవలెను. "జాతీయత" అనుపదమునకు అన్ని సందర్భములలోను అన్వయింపగల సర్వతోముఖమైన నిర్వచనమేదియు లేదు. ప్రజలనేకము చేయు సందర్భములలో జాతి, భాష, దేశము, మతము, ఆర్థిక క్షేమలాభములు లేదా ఒక సమిష్టి సంస్కృతి సంప్రదాయములు అనువానిలో నేవైనను ఉండవచ్చును.

"జాతీయత అనునది ప్రజల యంతరాత్మ వంటిది. అది యొక ఆధ్యాత్మిక ప్రకృతి. దీనికి దోహదముచేయు ముఖ్య ధర్మములు రెండు. అందులో నొకటి సమిష్టి సంస్కృతిని గూర్చిన పూర్వస్మృతి. రెండవది, ఏకముగానుండి యీ సమిష్టి సంస్కృతిని అనుభవింపవలెనను గాఢమైన వాంఛ" అని నేటి రాజ్యనీతిజ్ఞులు అంగీకరించుచున్నారు. ఈ లక్షణములనుబట్టి చూచినచో మనది జాతీయ స్వాతంత్ర్య సమరమే యనుటకు సందేహాము లేదు.

భారతదేశములోను హిందువులు, మహామ్మదీయులు భిన్నమతములకు చెందినవారైనను చిరకాల సహచర్యమువలన నొకే భారతీయ సంస్కృతి సంప్రదాయములకు వారసులైనారు. అదివఱకు వారెట్లుండినను యీ విజాతీయులైన ఆంగ్లేయులు 1757 నుండి దేశాక్రమణము చేయుచు రాజ్యాధిపత్యము వహించినప్పుడు మాత్రము హిందువులు, మహామ్మదీయులు నేకమై తమ మతధర్మములను, సంస్కృతీ సంప్రదాయములను సంరక్షించుకొనుటకై ఆంగ్లేయులను ప్రతిఘటించి వారి నీ దేశమునుండి పారదోలుటకై ప్రయత్నించిరి. అందుకొఱకై జరిగిన పోరాటములలో 1767–1775, 1781, 1806, 1884, 1832, 1838 నాటివి ముఖ్యమైనవి. 1857–59 లో జరిగినది చాలా గొప్పయుద్ధము.

మన దేశమునకు వచ్చిన పాశ్చాత్యజాతులలో పోర్చుగీసువారు మొదటివారు. వారి వేష భాషలు, మతధర్మములు. ఆచారవ్యవహారములు మన దేశములోని హిందువులకు, మహామ్మదీయులకు వింతగానుండుటయేగాక అసహ్యాకరములుగ నుండెను. వారు పందిమాంసమును, గొడ్డుమాంసమును తినుచు, నిప్పువలె దహించు సారాయిని త్రాగుచు శౌచవిధులను గాని, నీతినియమములను గాని పాటింపక క్రూరులైయుండిరి. మనవారు వారిని నీచముగా చూచుచు పరంగివారని పేరుపెట్టిరి. తరువాత మన దేశమునకు వచ్చిన ఆంగ్లేయులు మొదలైన పాశ్చాత్యజాతివా రందఱను పరంగీలనియే వ్యవహరించిరి. వారి మతమైన కిరస్తానీ మతమును కూడా నీచముగా చూచి దాని సంపర్కమువలన తామపవిత్రులమగుదు మనుకొనిరి.

తమ మతధర్మములు, సంస్కృతి సంప్రదాయములు నీ విజాతీయుల వానికన్న శ్రేష్ఠము లనుభావము మన దేశీయు లందు వ్యాపించియుండెను. ఇది జాతీయభావ మనుటకు సందియము లేదు.

ఈ విజాతీయులైన ఆంగ్లేయులు మన దేశము నాక్ర మించి పరిపాలించుటలో వా రవలంబించిన పద్ధతులవలన మన దేశముయొక్క రాజకీయార్థిక మతవ్యవస్థలును, సంస్కృతి సాంప్రదాయములును తారుమారైనవి. ప్రజల కనేక కష్ట ములు కలిగెను.

ఈ విజాతీయులు మన దేశ ప్రజల రాజకీయ స్వాతంత్ర్య ములను హరించి వీరిని అధోగతిలోనికి దింపిరి. దేశ సంపదను హరించి మన కర్షకులను, పారిశ్రామికులను దారిద్ర్యమున ముంచి జీవనాధారము లేకుండ చేసిరి.

ఆంగ్లేయు లీదేశమున ప్రవేశపెట్టిన విద్యావిధానమును, నాగరికతయు మన యువకుల మనస్సులను విరచి మన సంస్కృతి సంప్రదాయాలను పెల్లగించివేసినవి.

హిందూ.మహమ్మదీయ మతధర్మములను దూషించుచు ప్రజలను క్రైస్తవ మతమున గలుపుకొనుటకు ప్రయత్నించు క్రైస్తవ మత బోధకులకు ఆంగ్లేయ కుంపినీ ప్రభుత్వంవారు సర్వ విధముల తోడ్పడుచుండుటవలన ప్రభుత్వముచేసిన మార్పులెల్ల మనలను మత భ్రష్టులను చేయుటకే చేసినారని ప్రజలు తలంపసాగిరి.

అంతట దీనికంతకు కారకులైన ఆంగ్లేయులను నీదేశము నుండి వెళ్ళగొట్టి తమ మతధర్మములను, సంస్కృతిని రక్షించు

కొనవలెనని భారతదేశ ప్రజలలో అన్ని వర్గములవారు నేకమై స్వాతంత్ర్యముకొరకై 1857 లో పోరాడిరి.

భారతదేశ చరిత్రలోని 1857 పూర్వ రంగములను గూర్చి ఆంగ్ల చరిత్రకారులు తమ గ్రంథములందు సరిగా వివరింపలేదు. అందువలన దానికి సంబంధించిన కొన్ని ఘట్టములను వివరించుటయే ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము.

1857 కు పూర్వము జరిగిన భారత స్వాతంత్ర్య సమరము చరిత్ర ప్రత్యేకముగా వర్ణింపవలసిన గొప్పవిషయమైనందున ఆ చరిత్ర యిందు చేర్చలేదు.

ఈ గ్రంథములోని చాలా భాగములు 1941–'43 సంవత్సరములలో ఆంధ్రపత్రిక యందు వ్యాసరూపమున ప్రకటించి యున్నాను.

బెజవాడ,
హేవిళంబి.
భాద్రపదము.

దిగవల్లి వేంకట శివరావు.





# అంకితము

1857 పూర్వరంగమున దక్షిణ భారతదేశ రాజకీయములందు ప్రధాన పాత్ర వహించి, దేశ ప్రజలకు మత ధర్మములను, సంస్కృతి, సంప్రదాయములను, రాజకీయ స్వాతంత్ర్యములను, అర్థ సంపదను సంరక్షించుటకై ఇంగ్లీషు తూర్పు ఇండియా వర్తక కంపెనీవారి ప్రభుత్వముతో తీవ్రముగా పోరాడి, తన సర్వస్వమును దేశమున కర్పించిన ఆంధ్ర మహాపురుషుడు గాజుల లక్ష్మీనరుసు సెట్టిగారికి.



# విషయసూచిక



*

# సమీక్ష

ఇంగ్లీషు వర్తకసంఘంవారు ఈదేశాన్ని చేజిక్కించుకున్న తరువాత విశేషలాభాలు పొందడానికి చాలా అక్రమాలు చేసినా, చాలాకాలంవరకూ ప్రజల మతాచారాలకు మాత్రం ఏలాంటి యిబ్బందీ లేకుండా పరిపాలించేవారు. పైగా హిందువుల దేవాలయాలకూ మశీదులకూ ఈ క్రైస్తవ కుంపినీవారే ధర్మకర్తృత్వం వహించి ధర్మాలు సక్రమంగా నిర్వహించేవారు. క్రైస్తవ ప్రభుత్వం ఇలాగ హిందూ మహమ్మదీయ మతాలను పోషించడం బాగాలేదని ఇంగ్లాండులో ఆందోళనకూడా జరిగింది. తరువాత ఈ దేశంలో క్రైస్తవ మతప్రచారం చేయడానికివచ్చిన మిషనరీ క్రైస్తవ మత బోధకుల పలుకుబడి హెచ్చింది. ఇక్కడ కుంపినీవారికింద పనిచేసే వుద్యోగులు మిషనరీలతో ఏకమై ప్రజలను క్రైస్తవ మతంలో కలపడానికి అనేక మాయోపాయాలు పన్నేవారు. పాఠశాలలు స్థాపించి విద్యాభివృద్ధి చేయడమనే మిషపైన ముక్కుపచ్చలారని పిల్లల మనస్సులు విరిచి మతంలో కలపడం ప్రారంభించారు. తల్లిదండ్రులు తమ పిల్లలను తమ వశం చేయమని కోర్టులలో పిటిషనులు పెట్టుకుంటే ఇంగ్లీషు న్యాయాధిపతులు క్రైస్తవ మతపక్షపాతంతో మిషనరీల

పక్షంగా తీర్మానించేవారు. తమ మతధర్మాలు నాశనం అయ్యేరోజులు వచ్చాయని భయపడి ప్రజలు మేలుకుని స్వధర్మ రక్షణకోసం పాటుపడడం ప్రారంభించారు. క్రైస్తవ మతానికీ హిందూమతానికీ పోరాటంజరిగింది. కుంపినీవారి వుద్యోగులు లంచగొండులై ప్రజలను పీడించి దుష్పరిపాలన చేస్తూవుండేవారు. పన్నులభారం ఎక్కువైంది. వ్యవసాయము పరిశ్రమలు అడుగంటినాయి. దారిద్ర్యం హెచ్చింది. ప్రభుత్వ విధానం మారితేనేగాని ఈ అన్యాయాలు మానవని ప్రజలు గ్రహించారు. అందుకోసం ఆందోళన ప్రారంభించారు. శాంతియుతంగా చేసిన ఆందోళనవలన ప్రయోజనము లేకపోయింది. అంతట 1857 లో భారతప్రజల స్వాతంత్ర్యము కొరకు యుద్ధమే జరిగినది.

# దేవాలయాలకు క్రైస్తవ ధర్మకర్తలు

"హిందూదేశంలో మన అధీనంలో వున్న రాజ్యాలలో వుండే వివిధ మతములవారిపట్ల సంపూర్ణమైన సహనము చూపడము, ఆ యా మతములవారి ఆచార వ్యవహారములకు ఏలాంటి యిబ్బందిన్నీ కలగకుండా వారిని సంరక్షించడమూ, వాటిలో మనము స్వయముగా ఏలాంటి జోక్యమూ కలిగించుకోకుండా వుండడమేగాక, ఇతరులు కూడా వారి కేలాంటి యిబ్బందీ కలిగించకుండా కనిపెట్టి వుండడమూ, మొదటినుండిన్నీ మన పరిపాలనలో మనం అవలంబిస్తూ వచ్చిన పద్ధతి అని అందరికీ తెలుసును" అని తూర్పు ఇండియా కంపెనీ డైరక్టరుల సభవారు చెన్నపట్నం సెంట్ జార్జికోట అధికారులకు 1807 వ సంవత్సరము మేనెల 29 వ తేదీన ఒక వుత్తరంలో వ్రాశారు. (Political History of India by Sir John Malcolm Vol II PP 267 )

1781 వ సం॥లోను, 1793 వ సం॥లోను, 1833 వ సం॥లోను పార్లిమెంటువారు శాసించిన చట్టాలలోకూడా ఈ రాజనీతి సూత్రాన్ని స్పష్టంగా వుదాహరించారు.

వంగరాష్ట్రంలో 1810 వ సంవత్సరంలో శాసింపబడిన ఒక రెగ్యులేషను అనే చట్టాన్ని బట్టిన్నీ, 1817 వ సం॥లో

చెన్నపట్నంలో శాసించబడిన చట్టాన్నిబట్టేన్నీ హిందువుల దేవాలయాలకు, తురకల మశీదులకు పూర్వులిచ్చిన మాన్యాలను, దేవాదాయాలను, ధర్మాదాయాలను కుంపినీ వారు స్వయంగా పరిపాలించడానికి పూనుకున్నారు. ఈ ధర్మ కార్యాలను ప్రతి జిల్లాలోనూ, ఆ జిల్లాకలెక్టరే సక్రమంగా నిర్వహించేటట్లు నిర్ణయించారు. ఈ కలెక్టర్లపైన రివిన్యూ బోర్డువారు పై తనిఖీచేస్తూ వుండేటట్లుగా కట్టుదిట్టముచేశారు.

దేవాలయాల భూములను కలెక్టరులు అమరకపరచి జిల్లారివిన్యూ శిస్తులతోపాటుగా దేవాదాయాన్ని కూడా తాశీల్దారుల ద్వారా వసూలు చేయించేవారు. దేవాలయాల నిత్యకృత్యములను గురించి కలెక్టరులు తాకీదులు జారీచేస్తూ 'దేవుడి పనులు' జాగ్రత్తగా చెయ్యాలని కిందివుద్యోగులను; నౌకరులను హెచ్చరించేవారు. కుంపినీ సర్కారువారు దేవాలయాలను, మశీదులను మరమ్మతు చేయించి కొత్త వాటిని కట్టించేవారు. అక్కడి నిత్య నైవేద్య ధూపదీపాలు, అర్చనలు కలెక్టర్ల ద్వారా సక్రమంగా జరిపించేవారు. విగ్రహాలకు అలంకారాలు చేయించడము, దేవుడి పెళ్లిచేయించడము, దేవదాసీలను నియమించడము, భోగము మేళములతో ఊరేగింపులు చేయించడము క్రైస్తవులైన కలెక్టర్లు స్వయంగా దగ్గరవుండి చేయించేవారు. ఈ కలెక్టర్లు తమ దొర టోపీలను తీసి విగ్రహాలకు గౌరవం చూపుతూ కుంఫినీ వారి తరఫున బట్టలు సమర్పించి జోహారులు చేసేవారు. కుంపినీ సైనికులు బారులుతీర్చి నిలువబడి గౌరవం చూపించేవారు. ప్రతియేటా వేలకొద్ది జనంచేత దేవుడి రథాన్ని

లాగించేవారు. వర్షాలు కురవకపోతే వానదేవుడికి పూజలు చేయించడానికి సర్కారు ఖజానాలోనుంచి సొమ్ము యిచ్చే వారు.

కంచిలో జరిగే గొప్ప ఉత్సవానికి దేవుడి ఊరేగింపు చూడడానికిన్నీ చుట్టుపక్కలనుంచి వేలకొద్ది మనుష్యులు అక్కడికి వస్తారు. వీరందరి సమక్షంలో చెంగల్పట్టు కలెక్టరు దేవుడి విగ్రహానికి చాలా భక్తిపురస్సరంగా జోహారుచేసి కుంపినీవారి తరఫున మంచి బుటేదారీపని చేసిన శాలువు సమర్పించేవాడు. తిరుచునాపల్లి కలెక్టరుకూడా ఇలాగే శ్రీరంగ దేవుడి ఉత్సవంలో ముందుగా విగ్రహానికి సలాముచేసి శాలువు సమర్పించేవాడు. ఈ వేడుక చూడడానికి స్త్రీ పురుషులను ఆహ్వానించేవారు. చెన్నపట్నంలోకూడా దేవుడి ఉత్సవాలలో ఇలాగ మర్యాద చూపేటందుకు కలెక్టరు హోదాగల దొరను నియమించేవారు. ఒక్క తంజావూరు జిల్లాలోనే ప్రతిసాలునా దేవుడి రథం లాగడానికి 20 లేక 30 మైళ్ల దూరంనుంచి సర్కారు ఉద్యోగులను మనుష్యులను లాక్కుని వచ్చేవారు. తిరువాన్కూర్ రాజ్యంలో తిరువనంత పురంలో అనంత పద్మనాభస్వామివారి రథోత్సవంలో రాజు గారు, రాణిగారు వెంట రాగా విగ్రహానికి రెండు ప్రక్కలా బ్రిటిష్ సైనికులు బారులుతీర్చి కోటదగ్గరనుంచి సముద్రతీరం వరకూ మూడుమైళ్ళు నడుస్తూ గౌరవించడం ఆచారముగా వుండేది.

ఈ సైనికులఅధికారులుకూడా వీరితోపాటునడిచేవారు. ఈ సంగతులను గురించి 1833 లో మద్రాసు సివిలియన్ అనే

పేరుతో సర్ చార్లెస్ గ్రాంట్‌గారి కొక బహిరంగలేఖ వ్రాయబడి అది లండన్‌లో ప్రకటించబడింది. (England and India B. W. Noel pp 11 to 23) జగన్నాథంలోను, తిరుపతిలోను కుంపినీవారు ఆ దేవస్థానాలను పరిపాలిస్తూ అక్కడి అర్చనలు వగైరాలు చేయిస్తూ మిగిలిన సొమ్ము లాభంకింద తీసుకుంటూ వుండిన సంగతినిగురించి ఏనుగుల వీరాస్వామయ్య గారు తమ కాశీయాత్ర చరిత్రలో 1830-31 మధ్య వ్రాసినారు. తిరుపతిలో సాలుకు లక్షరూపాయలు కుంపినీవారికి లాభం వచ్చేదనీ వ్రాశారు. క్రైస్తవమతపక్షపాతం చూపించారని హిందువులు అనుకొని పోతారేమోనని చాలాకాలం వరకూ కుంపినీవారు భయపడుతూ హిందువుల మనస్సుకు నొప్పికలగకుండా ప్రవర్తించేవారు. చర్చిమిషన్ సొసైటీ పంపిన క్రైస్తవ బోధకుడైన రెనియస్ అనే అతడు నేడు జార్జిటవును అనిన్నీ అప్పట్లో నల్లవారిబస్తీ అనిన్నీ పిలువబడే చోట 1817 లో ఒక చర్చి నిర్మించడానికి స్థలం కొన్నాడు. దీనిని గురించి అక్కడి హిందువులు గవర్నరుకు అర్జీ పెట్టుకోగా, పోలీసు సూపరెంటువచ్చి చర్చిపని ఆపించి, మిషనరీ సొసైటీవారికి నష్టపరిహారమిచ్చి బ్రాడ్వేలో ఇంకొకచర్చి కట్టించి యిచ్చారు !

క్రైస్తవులైన కుంపినీవారు ఇలాగ హిందువుల విగ్రహారాధనను, తురకలమతాన్ని ప్రోత్సహించడము కొంతమంది దొరలకు చాలా కష్టంగా వుండేది. కొందరు ఇది బాగా లేదని తమ అసమ్మతిని సూచిస్తూ ఆందోళనచేశారు గాని, కుంపినీవారు వినలేదు. చాలాకాలం వరకూ ఇలాగనే జరుగుతూ

వచ్చింది. చెన్నపట్నంలో బిషప్ కారీగారున్నూ 150 మంది సివిలు మిలిటరీ వుద్యోగులున్నూ 50 మంది క్రైస్తవ మత బోధకులు (మిషనరీలు)న్నూ 1838 వ సంవత్సరం డిసెంబరులో దీనిని గురించి తమ అసమ్మతిని తెల్పుతూ చెన్నపట్నం ప్రభుత్వంవారికి ఒక మహజరు పంపారు. యుక్తాయుక్తవివేచన లేక తొందరపడే మనుష్యులు, దేశశాంతికి భంగం కలిగించే విషయాలను గురించి ఆందోళన చేయడానికి ప్రయత్నించినప్పుడు అనుభవజ్ఞుడైన క్రైస్తవ మతాధికారి వారిని మందలించి తనపని తాను చూచుకోక వారికి మద్దతుచేయడం బాగా లేదని బిషప్ కారీగారిని చెన్నపట్నం గవర్నరుగారు మందలించారు. ఇంగ్లాండు కుంపిణీ డైరక్టర్లుకూడా దీనిని గురించి అందీ పొందకుండా ఒక తాకీదు పంపించారు. క్రైస్తవ మతాభిమాని అయిన చెన్నపట్నం సర్వసేనాని సర్ పెర్రిగ్రిన్ మెయిట్లాండుగారు కుంపిణీవారు విగ్రహారాధనను ప్రోత్సహిస్తున్నందుకు తన అసమ్మతిని సూచిస్తూ తమ వుద్యోగానికి రాజీనామా నిచ్చారు. అప్పట్లో గవర్నరు జనరలుగా నుండిన ఆక్లాండు ఏమీ చేయలేక వూరుకున్నాడు. ఈ విగ్రహారాధకుల ఉత్సవాలలోను, అర్చనలలోను క్రైస్తవులైన కుంపిణీ ఉద్యోగులను పాల్గొనమని నిర్బంధించడం ఎంత మాత్రమూ బాగా లేదని చాలా ఆందోళన జరిగినమీదట ఒక మార్పు జరిగింది హిందువుల దేవాలయాల నిర్వాకృత్యాలలో ఆయా వుద్యోగులు పాల్గొనవలెనని తమ అభిప్రాయం కాదనిన్ని ఆ విషయాలు హిందువులకు వదిలివేసి వారితో ఏలాంటి జోక్యమూ కలిగించుకోకుండా వుండమని మాత్రమే

తమ ఉద్దేశ్యమనిన్నీ 1833 వ సం॥ ఫిబ్రవరి నెలలో కుంపినీ డైరెక్టర్లు వ్రాశారు. అన్ని దేవాలయాలు, దేవాదాయాలూ హిందువులకు వదిలివేయడం తమ అభిమతమని కూడా డైరెక్టర్లు 1838 ఆగస్టు 8 వ తేదీన వ్రాశారు. ఈ ఉద్దేశ్యాను సారంగా కుంపినీ వుద్యోగులు దేవాదాయాలను, ధర్మాదాయాలను 1843 నాటికి ఎవరికో ఒకరికి వదిలిపెట్టి అవి పాడైపోతూవున్నా చూస్తూ వూరుకున్నారు. (England and India B. W. Neol pp to 152 to 164.)

హిందూదేశంలో క్రైస్తవమత ప్రచారంచేసి హిందువులను తమ మతంలో కలిపి వారిని ఉద్ధరించాలని కూడా ఇంగ్లాండులో కొందరు దొరలు గొప్ప ఆందోళన చేశారుగాని, ఇలాంటి ప్రయత్నంచేస్తే దేశప్రజలలో కల్లోలం కలుగుతుందని కుంపినీవారు భయపడి, చాలాకాలంవరకూ ఇంగ్లీషు మతబోధకులను హిందూదేశంలోనికి రానివ్వలేదు.

హిందూదేశంలో క్రైస్తవ మతప్రచారం చెయ్యాలనే అభిప్రాయం 1790 ఆ ప్రాంతములలో ఇంగ్లాండు దేశంలో ప్రబలి అనేక మిషనరీ సొసైటీలు (క్రైస్తవ మతప్రచారక సంఘాలు) బయలుదేరినవి. లండన్ మిషనరీ సొసైటీ 1795 లోనూ, చర్చి మిషనరీసొసైటీ 1799 లోనూ, బ్రిటిష్ అండ్ ఫారిన్ బైబిల్ సొసైటీ 1805 లోనూ స్థాపింపబడినవి. ఆ సంఘాలవారు హిందూదేశానికి క్రైస్తవ మతబోధకులను పంపారు. కుంపినీవారు వీరికి లైసెన్సు నివ్వకనున్నా స్వేచ్ఛగా ప్రచారం చేయనివ్వకనున్నా చాలా ఆటంకాలు కలిగించారు.

ఇతర ఐరోపారాజ్యాల క్రైస్తవ మత ప్రచారకులు కొందరు యీ దేశంలోకి వచ్చి ఆయా రాజ్యాలవారి బస్తీలలో కాపురం వుండి దేశప్రజలలో మతప్రచారం చేయడం ప్రారంభించారు. ఇంగ్లాండు సామ్రాజ్యంనుంచి వచ్చిన మిషనరీలుకూడా కొందరు కలకత్తాదగ్గర డచ్చివారి బస్తీ అయిన శ్రీరామపురంలో వుండి హిందూమతాన్ని ఖండిస్తూ మతప్రచారం సాగించారు. ఈ మిషనరీలు హిందువులను వారి మతాన్ని దూషిస్తూ ప్రజలలో అలజడి కలిగించడం చూసి 1807-1814 సంవత్సరములమధ్య గవర్నరుజనరలుగా వుండిన మింటో ప్రభువు పైవారికి వ్రాశాడు. హిందూదేశంలో క్రైస్తవ మతప్రచారం చెయ్యడానికి చాలాసొమ్ము ఖర్చుపెట్టి ఎంతమందినో మిషనరీలను పంపి ఎంతో కృషి చేసినా ఫలితం చాలా స్వల్పంగా వుండేది. ఎన్నడో ఒకప్పుడు ఎవడో ఒకడు మతలో కలిసేదే దుర్లభంగా వుండేది. అలాగ కలిసినవాళ్ళయినా మాల మాదిగలో దిక్కులేనివారో గాని ఇతర హిందువులుగాని తురకలుగాని మతంలో కలియడం లేదు. ఇది చూడగా ఇంగ్లీషువారికి చాలా ఆశ్చర్యం కలిగింది.

ఈ హిందూదేశంలోవున్న హిందువులకూ తురకలకూ కూడా కొన్ని స్థిరమైన మతాభిప్రాయాలు, ఆచారాలూ వున్నందువల్ల ముందుగా వీరిమనస్సు మార్చడానికి కొంతకృషి చేస్తేనేగాని వీరిమతం మార్చడానికి సాధ్యపడదని గ్రహించారు.

1828- 1835 మధ్య గవర్నరు జనరలుగా వుండిన విలియం బెంటింకు ప్రభువును, అతనికిముందు గవర్నరు జనరల్‌గావుండిన హేస్టింగ్సు, అమహారెస్టు ప్రభువును, పైఅభిప్రా

యానుసారంగా హిందువులను క్రైస్తవ మతమున కలిపే ప్రయత్నానికి ప్రథమ సోపానంగా వారికి ఇంగ్లీషు విద్యను బోధించేపనికి పూనుకున్నారు. హేస్టింగ్సు కాలం (1813-23) లోనే క్రైస్తవమత ప్రచారకులు పాఠశాలలు స్థాపించి విద్య నేర్పే మిషతో క్రొత్తభావాలు ప్రజలలో వ్యాపింపజేయ సాగినారు. ముందుగా దేశభాషలలో కొన్ని పాఠాలు బోధించడం మొదలుపెట్టి తరువాత ఇంగ్లీషు పాఠశాలలో బైబిలుకథలు క్రైస్తవమత సిద్ధాంతాలూ బోధించడము ప్రారంభించేవారు.

హిందూదేశప్రజలకు ఉపయుక్తమైన విజ్ఞానంకలిగించి నీతిలోను మతంలోనువారికి అభివృద్ధికలిగించడము హిందూ దేశాన్ని పరిపాలిస్తున్న కుంపినీప్రభుత్వంయొక్క పరమధర్మమని ఇంగ్లాండుపార్లమెంటుయొక్క కామన్సుసభలోకొందరుదొరలు 1813 లో ఒక తీర్మానం ప్రవేశ పెట్టారు. పైకి ఇదిచాలా సదుద్దేశ్యంతోనూ పరమార్థ చింతతోనూ చేస్తూవున్నట్లు కనబడినా, వారి అసలు వుద్దేశం, దీనిని పురస్కరించుకుని ఈ మిషపైన హిందూ దేశంలోకి మిషనరీలను పంపించి క్రైస్తవమత ప్రచారంచేయించి ప్రజలను క్రైస్తవులుగా చెయ్యాలనే. (Memories of Madras. Sir C. Lawson p 1-5) పైన చెప్పినట్లు పార్లిమెంటువారు తీర్మానించిన తరవాత, విద్యాభివృద్ధి చేయడంకోసమని మిషనరీలు హిందూదేశంలోకి స్వేచ్ఛగావచ్చి మత ప్రచారం చెయ్యడానికి అవకాశం కలిగింది.

లండన్ మిషను సొసైటీవారు చెన్నపట్నంలో 1813 లో క్రైస్తవ దేవాలయాలను నిర్మించారు. చర్చి

మిషను సొసైటీవారి దక్షిణ హిందూదేశ మిషను చెన్న పట్నంలో 1814 సం॥లో స్థాపించారు. క్రైస్తవ విజ్ఞాన అభివృద్ధి సంఘంవారి మద్రాసు డయోసీసన్ జిల్లా కమిటీ 1815 లో స్థాపించబడింది. దానికింద తొమ్మిది పాఠశాలలు స్థాపించారు. అందులో 283 మంది పిల్లలు చేరారు.

కలకత్తాదగ్గర చిన్సురాలనుండే 'మే' అనే మిషనరీ 1814 లో మొదటి వర్నాక్యులరు బడిని స్థాపించారు. 1815 నాటికి 16 పాఠశాలలు స్థాపించారు. అందులో 951 పిల్లలు చేరారు. అతడు 1818 లో చనిపొయ్యేనాటికి 36 పాఠశాలలు స్థాపించారు. చర్చి మిషనరీ సొసైటీవారు బర్ద్వానులో 1816 లో కొన్ని పాఠశాలలు స్థాపించారు.

ఈ మిషను సొసైటీవారి క్రైస్తవ మత ప్రచారకుడు కెప్టెన్ స్టీవార్టు అనే ఆయన చాలా ఉత్సాహవంతుడు. ఇతడు చేస్తూవున్న కృషిచూసి ప్రజలు అనుమానపడ్డారు. పిల్లలనందరినీ సీమకు పంపించాలని ఇతడు పాటుపడు తున్నాడని కొందరన్నారు. ఇదంతా వర్ణాశ్రమ ధర్మాన్ని నాశనం చెయ్యడానికి చేస్తూవున్న కుతంత్ర మని మరికొందరన్నారు. క్రొత్తగా అచ్చుపుస్తకాలు వుపయోగించడంచూసి ఇది యేదో మాయ అన్నారు. పాఠాలు పరీక్షించడంలో పిల్లలు, ఒకరి నొకరు ప్రశ్నించడము, గెలిచిన తరగతివారు ఉత్తీర్ణులైనట్లు నిర్ణయించే పద్ధతిని ఇతడు ప్రారంభించాడు. ఇది చాలా బాగావుందని తరవాత క్రైస్తవ పాఠశాల లన్నింటిలోనూ మొదలు పెట్టారు. ఓడిపోయినవారు గెల్చినవారిని ఇంకొక విషయాన్ని గురించి సవాలుచేయడం జరుగుతూ

పరీక్షలలో క్రైస్తవమత విషయాలకు, ప్రాముఖ్యత రావడం ప్రారంభించింది. 1818 లో కలకత్తా స్కూలు సొసైటీ స్థాపించ బడినప్పుడు ఆ సభవారు బర్ద్వానులో స్టీవార్డ్ చేస్తూవున్న పద్ధతులను 5 నెలలపాటు నేర్చుకోవడానికి తమ పాఠశాలల అధికారిని పంపారు. ఈ బర్ద్వాను పాఠశాలలను గురించి 1818 లో ఈ క్రింది నివేదిక ప్రకటింపబడింది.

"మా పాఠశాలలో తెలివి తేటలలో గల ఆధిక్యాన్ని తప్ప జాతిమతముల కులముల తారతమ్యాలు గమనింపము. బ్రాహ్మణ పిల్లవాడు కులహీనుల సరసను కూచోవలసిందే. ఒక్కొక్కప్పుడు తరగతిలో వాడికి కిందుగా నిలుచుండి యుండ వలసినదే. భూమిమీద ఒకే విధమైన రక్తముతో పుట్టిన మనుష్యులందరూ సమానులుగా సృజింపబడ్డారు గాని, భగవంతుడు హెచ్చుతగ్గులు గల కులభేదములను నిర్మించలేదని పాఠములో వ్రాయబడిన అంశము నిజమనే సంగతి తెలివి తేటలుగలిగి, బ్రాహ్మణ పిల్లలను తలదన్నగల తక్కువ కులముల పిల్లవారు బాగా గ్రహించగలరు (Vernacular Education in Bengal and Behar. The Madras Journal of Education October 1868) విలియంబెంటింకు ప్రభువు (1828-35) ఈ విద్యాపద్ధతిని బాగా ప్రోత్సహించాడు. దేశమంతటా అనేకపాఠశాలలు, బోధనతరగతులు బయలుదేరదీశాడు. ఇంగ్లీషుభాష, ఇంగ్లీషు వాఙ్మయముల ద్వారా ప్రజల మనస్సును మార్చడానికి నిశ్చయించాడు. మెకాలే అనే అతడు ఇతనికి తోడ్పడ్డాడు. హిందూదేశ ప్రజలలో పాశ్చాత్య విజ్ఞానమును, శాస్త్ర జ్ఞానమును వ్యాపింపజేయడమే ఈ దేశంలో ఉన్నత విద్యాభి

వృద్ధి ప్రయత్నముయొక్క ప్రధానోద్దేశ్యమని 1835 లో హిందూదేశముయొక్క కేంద్రప్రభుత్వమువారు ప్రకటించారు. "మనము ప్రారంభించదలచిన విద్యాపద్ధతి సక్రమంగా అమలు జరిగినట్లయితే, వంగరాష్ట్రంలో 30 సంవత్సరాలలో ఒక్క విగ్రహారాధకుడైనా వుండడం నాఅభిప్రాయ"మని మెకాలే 1836 లో వ్రాశాడు. ఇంతేకాదు. పుట్టుకవల్లను, రంగు లోనూ భారతీయులుగా కనబడుతున్నప్పటికిన్నీ రుచుల లోనూ, అభిప్రాయాలలోనూ, నీతి నియమాలలోనూ, బుద్ధి లోనూ కేవలము ఆంగ్లేయులుగా నుండే 'ఆంగ్ల మానస పుత్రుల' జాతిని తయారు చేయడమే ఈ విద్యావిధానం యొక్క ప్రధానోద్దేశ మనిన్నీ మెకాలే స్పష్టంగా చెప్పాడు. కాని, వెంటనే ఇలాంటి పాఠశాలలను సర్కారువారు స్థాపించ డానికి ధైర్యం లేకపోయింది. ఇలాంటి ఉద్దేశ్యాలతోనే క్రైస్తవ మతబోధకులు దేశమంతటా పాఠశాలలు స్థాపించగా వాటిని కుంపినీ సర్కారువారు పోషించారు.

క్రైస్తవ మతబోధకులు మన దేశంలో పాఠశాలలు ఏ వుద్దేశ్యంతో స్థాపించినదీ వారే చాలా చోట్ల చెప్పి వున్నారు. దీనిలో దాపరికం ఏమీ లేదు. "కేవలం నాగరి కతను వ్యాపింపచేయడానికీ, విజ్ఞానం వెదజల్లడానికీ క్రైస్తవ మతబోధకులు పాఠశాలలు స్థాపించరు. ప్రజలలో క్రైస్తవ మత బోధచేసి వారిని తమ మతంలో కలుపుకోవడానికి సాధనా లుగా వుండడానికే వారు ఈ పాఠశాలలు స్థాపిస్తారు. విద్య నేర్చుకోవాలనే ఆసక్తి కలవారికి విద్యాబోధ చేసి ముందుగా వారిని ఆకర్షిస్తారు. తరువాత క్రైస్తవ మతబోధ చేస్తారు.

ఈ విద్య - మతబోధ - కలిసి యువకుల మనస్సులను మారుస్తాయి. వారు క్రైస్తవ మతంలో కలిసినా కలవకపోయినా, వారికి హిందూ వర్ణాశ్రమధర్మాలయందున్నూ, వేదశాస్త్రము లందున్నూ అపనమ్మకం మాత్రం కలిగితీరుతుంది. ఉపయోగించకపోయినా చెరపడానికి చాలును" అని 1854 లో ఒక మిషనరీల సభలో 'ఈవార్టు' అనే ఆయన స్పష్టంగా చెప్పినాడు (England and India . B. W Noel pp 30-41). ఆ కాలంలో మనదేశంలో ఇంగ్లీషు వచ్చినవారు చాలా తక్కువ. సర్కారు కచ్చేరీలలో నౌకరీ సంపాదించాలంటే కొద్దో గొప్పో ఇంగ్లీషురావాలి. ఇంగ్లీషు నేర్పే పాఠశాలలను కుంపెనీవారు స్థాపించలేదు. కొంతమందిక్రైస్తవమతబోధకులు పైనచెప్పినవిధంగాఅలాంటి పాఠశాలలు కొన్నిటినిస్థాపించారు. అందువల్ల మనవాళ్ళు తమపిల్లలను ఆ బడులలోకి పంపవలసి వచ్చేది. అక్కడ చదువుకోవడానికి వెళ్ళినపిల్లలలో ముక్కుపచ్చలారని వారిని, దిక్కులేనివారిని, బీదలను, అజ్ఞానులను మిషనరీలు మనస్సు విరిచి మతములో కలుపుకునేవారు. అప్పట్లో ప్రభుత్వంలో పెద్దపెద్ద వుద్యోగాలు చేసే వారలందరూ ఏదో ఒక మిషనరీ సంఘంతో సంబంధం కలిగివుండి క్రైస్తవమత ప్రచారానికి అనేక విధాలుగా తోడ్పడుతూవుండేవారు. ప్రజలను క్రైస్తవ మతంలో కలపడానికి అనేక వుపాయాలను పన్నేవారు. క్రైస్తవమతం పుచ్చుకున్నవారికి ఉద్యోగాలు యిస్తామనేవారు.

ప్రజల మతాచారాలతో తాము జోక్యం కలిగించుకొనమని ప్రభుత్వంవారు ఇదివరలోనే వాగ్దానం చేసి

వున్నందువల్ల 1839 లో చెన్నపట్నంలో సర్కారు పాఠశాల స్థాపించడానికి నిశ్చయించినప్పుడు అందులో క్రైస్తవమత బోధ లేకుండా సామాన్యమైన లౌకికవిద్య మాత్రమే బోధించేటట్లు తీర్మానించారు. అయితే క్రైస్తవ మతాభిమానులు ఒక వుపాయంచేత ఈ నిబంధనను ఉల్లంఘింపగలిగారు. ఈ పాఠశాలలో క్రైస్తవ మిషనరీలను పరీక్షకులుగా నియమించగా, వారు పిల్లలకు ప్రపంచ విజ్ఞానం వుండాలనే నెపంతో బైబిలు కథలనుగురించి, క్రైస్తవ మతసిద్ధాంతాలను గురించి పిల్లలను ప్రశ్నించి జవాబు చెప్పలేనివారు పరీక్షలందు తప్పినట్లు నిర్ణయించేవారు. పరీక్షలలో తప్పిన వారికి వుద్యోగాలు యివ్వరుగనక, ఈ బైబిలు విజ్ఞానాన్ని పిల్లలు తప్పకుండా నేర్చుకోవలసి వచ్చేది. ఇది పిల్లలకు చాలా కష్టంగావున్నదని తల్లిదండ్రులు మొరపెడితే బైబిలును పాఠశాలలలోఒక పాఠ్యపుస్తకంగా చదివితే ఈ కష్టంవుండదని సర్కారు అధికారులు జవాబు చెప్పేవారు.

కలకత్తాలో అలెగ్జాండర్ డఫ్అనే మిషనరీ స్థాపించిన పాఠశాలవంటి పాఠశాలలలో పరీక్షలిచ్చిన విద్యార్థులకే ఉద్యోగా లివ్వబడతాయని గవర్నరుజనరలైన హార్డింజి ప్రభువు 1844 లో శాసించడంతో మిషనరీపాఠశాలల ప్రాబల్యం వుచ్చింది.

బైబిలును చెన్నపట్నం పాఠశాలలో పాఠ్యపుస్తకంగా ప్రవేశపెట్టాలని మిషనరీలున్నూ, అధికారులున్నూ కలిసిన కమిటీవారు నిశ్చయించారు చెన్నపట్నం గవర్నరైన ట్వీడ్ డేలు ప్రభువు ఇందుకు హార్షిస్తూ 1846 లో ఒక హుకుము

జారీచేశాడు గాని, దీనివల్ల చిక్కులు వస్తాయని తూర్పు ఇండియా కంపెనీ డైరెక్టర్లు దీనికి ఒప్పుకోలేదు.

హిందూదేశ ప్రజల మతాచారాలతో జోక్యం కలిగించుకోవద్దని కుంపినీ డైరెక్టర్లు వ్రాస్తూవున్నా, ఇక్కడి అధికారులు క్రైస్తవ మత ప్రచారకులతో ఏకమై దేశప్రజలను ఏవిధంగానైనా క్రైస్తవమతంలో కలుపుకోవాలని ప్రయత్నిస్తూనే వున్నారు. తమ ఉద్యోగులు ఇలాగ క్రైస్తవ మత పక్షపాతం వహించి, తాము చేసిన వాగ్దానాలకు భంగం కలిగిస్తున్నారనే సంగతి డైరెక్టర్లకు తెలిసి, హిందూ దేశంలోని సివిలు మిలిటరీ శాఖలలో పనిచేసే వుద్యోగులెవ్వరూ ప్రజల మతాచార వ్యవహారాలతో ఏలాంటి జోక్యమూ కలిగించుకో కూడదని కుంపెనీ డైరెక్టర్ల సభ వారు 21-4-1847 వ తేదీన ఒక వుత్తర్వును జారీచేశారుగాని, అప్పట్లో యిక్కడ గవర్నరు జనరలుగా వుండిన హార్డింజి పభువు ఈ తాఖీదును అమలులో పెట్టకుండా వుపేక్షించాడు! అందువల్ల యిక్కడి ఉద్యోగులు ఎప్పటిలాగుననే అన్ని విషయాలలోనూ మిషనరీలకు సహాయభూతంగా ప్రవర్తిస్తూ వుండేవారు. తుదకు కోర్టులలో న్యాయపరిపాలన చేయవలసిన మేజస్ట్రేటులు న్యాయాధిపతులుకూడా మిషనరీల చెప్పు చేతలలో వుండి అన్యాయాలుచేయడం ప్రారంభించారు. క్రైస్తవ మత ప్రచారం అతి తీవ్రంగా విజృంభించి.ది. హిందూ వర్ణాశ్రమ ధర్మాలు, మతము విధ్వంసము అయిపోతున్నవనేటంత భీతి ప్రజలలో వ్యాపించింది. 1857 వ సంవత్సరములో దేశంలో కలిగిన సిపాయిల తిరుగుబాటు అనే విప్లవానికి ఇదికూడా ఒక ముఖ్యకారణమైనది.

# రామమోహన రాయల రాజకీయాలు

శ్రీ రాజా రామమోహన రాయలవారు క్రీ. శ. 1772 లో జన్మించి, 1833 లో స్వర్గస్తులైనారు. ఈయన భారతదేశోద్ధరణకోసం ఎంతో కృషిచేశారు. రామమోహన రాయలవారు గొప్ప సంఘ సంస్కర్త అనిన్నీ, ఉపనిషన్మతాన్ని పునరుద్ధరించడానికి ప్రయత్నించి బ్రహ్మసమాజాన్ని స్థాపించారనిన్నీ, స్త్రీల హక్కులకోసం పోరాడినారనిన్నీ సహగమనాన్ని నిషేధించడానికి చాలా పాటుపడ్డారనిన్నీ చాలామందికి తెలుసునుగాని, ఈ మహానుభావుడు కేవలం సంఘ సంస్కారం కోసమే గాక, భారతదేశ విద్యాభివృద్ధి కోసమూ, ఆర్థికరాజకీయాభివృద్ధికోసమూ తనయావజ్జీవమూ పాటుపడినారనే సంగతి మాత్రము చాలామందికి తెలియదు. భారత దేశోద్ధరణ విషయంలో ఈనాడు గాంధీమహాత్ముడి లాగనే ఆనాడు రామమోహన రాయలవారును పాటుపడిన యుగపురుషుడని చెప్పవచ్చును. ఈయన సంస్కృత, వంగ, పారశీ భాషలందు పండితుడై, అరబ్బీ, ఇంగ్లీషు భాషలలో కూడా పాండిత్యము సంపాదించి, దానిని దేశోద్ధరణకోసం వినియోగించాడు. ఆనాడు క్రైస్తవమిషనరీలు తమ మతమే ప్రపంచంలోనున్న మతాలన్నింటిలోకీ ఉత్కృష్టమైనదనిచెప్పి, అందరినీ క్రైస్తవమతంలో కలియవలసినదని బలవంతపెడుతూ

వుండడం చూచి, ఈయన స్వధర్మ రక్షణకోసం అఖండమైన ప్రచారం చేశాడు. ఇతర మతాలలోని గొప్ప సిద్ధాంతా లన్నీ మన ఉపనిషత్తులందే వున్నాయని చూపించడానికి అనేక ఉపన్యాసాలుచేసి, వ్యాసాలు వ్రాసి పుస్తకాలు ప్రకటించాడు. దేశ ప్రజలలో విజ్ఞానం వ్యాపింపజేయడానికి వంగభాషలో సంవాద కౌముది అనే వార్తా పత్రికను, పారశీ భాషలో 'మిరాత్ ఉల్ అక్బార్' అనే వార్తా పత్రికను నడిపి, దేశ భాషలో వార్తాపత్రికా నిర్వహణానికి దారి తీశాడు.

పాశ్చాత్య విజ్ఞానమును భారతీయులు తెలిసికోవడం అవసరమని తలచి ఇంగ్లీషు భాషలో విద్య వ్యాసింప చేయడాన్ని గురించి ప్రచారంచేశాడు. అనేక పాఠశాలలు స్థాపించడానికి తోడ్పడి, వంగభాషలో భూగోళ, రేఖాగణిత ములనుగురించి పఠనీయ గ్రంధాలు రచించాడు. స్వంతంగా ఒక ఆంగ్లోవర్నాక్యులరు పాఠశాలను నడిపేవాడు. డేవిడ్ హేర్ అనే దొర మొదలైనవారితో కలిసి కృషిచేసి కలకత్తాలో ఇంగ్లీషుభాషను, పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రము లను బోధించే హిందూ కాలేజీని స్థాపించడానికి తోడ్పడ్డాడు. రామమోహన రాయలవారికి మొదట ఆంగ్లేయులతో ఎక్కువగా పరిచయం లేదు కాని, చివర చివరకు చాలా మందితో పరిచయం కలగడంవల్లనూ, ఇంగ్లీషుభాషను అభ్యసించి ఇంగ్లీషు గ్రంధాలు చదవడంవల్లనూ బ్రిటీషువారి నాగరికతపైనను చాలా గౌరవము కలిగింది. ఆంగ్లేయులు విద్యావంతులనన్నీ, తెల్లనైనవారనన్నీ, నారిజాతిలో కొన్ని

మంచిగుణాలు ఉన్నాయనిన్నీ, పరదేశాన్ని ఆక్రమించి చేస్తూ వున్న పరిపాలనలో కొన్ని లోపాలు వున్నా, మొత్తంమీద దీనివల్ల చాలా లాభాలు కలుగుతాయనిన్నీ [illegible]చింది. ఆంగ్లేయులకు గల రాజకీయ స్వాతంత్ర్యము రామమోహన రాయలవారిని ఆకర్షించినది. వారి సాంగత్యమువల్ల మన దేశానికికూడా స్వేచ్ఛ, సౌఖ్యము కలుగుతాయనిన్నీ, మన విజ్ఞానము వర్ధిల్లుతుందనిన్నీ ఆయన ఆశపడ్డాడు. ఈ ఆశతోనే ఆయన అనేక సందర్భాలలో మన దేశ స్థితిగతుల గురించీ, కష్టసుఖాలను గురించీ గవర్నరు జనరలుకును, సీమలో కుంపినీడైరక్టర్లకును, పార్లమెంటు వారికిని, సభాయుతుడైన రాజుగారికిని అర్జీలు, విన్నపములు, మహజరులు పంపినాడు.

పత్రికా స్వాతంత్ర్యానికి భంగం కలిగించిన నిర్బంధ శాసనాన్ని గురించి ప్రీవీకౌన్సిలు సభాయుతుడైన ఆంగ్ల రాజుకు చేసిన అప్పీలు అర్జీలో రామమోహన రాయలవారు ఇలాగ వ్రాశారు.

"పూర్వపు మహమ్మదీయ పరిపాలనలో తురకలతో పాటు హిందువులు కూడా అన్నిలాభాలూ సమానంగా పొందేవారని తమరెరుగని విషయంకాదు. ప్రభుత్వంలోని గొప్ప వుద్యోగాలను పొందగలిగేవారు. సేనలను నడపడానికీ, రాష్ట్రాలను పరిపాలించడానికికూడా వినియోగింపబడేవాళ్లు. రాజులకు మంత్రులుగాకూడా వుండేవాళ్లు. తమ మతాన్ని బట్టిగాని, పుట్టుకనుబట్టిగాని వీళ్ళకు ఎలాంటి ఇబ్బందీ వుండేదికాదు. వీళ్ళకు పన్నులిచ్చుకోనక్కర లేకుండా

జాగీరులూ, ఈనాములూ యిచ్చేవారు. చాలా నమ్మకము, దర్జాలు గలిగి దేశంలో గొప్ప గొప్ప భాగానికి ఆధిపత్యం వహించేవారు. తెలివి తేటలూ, విద్యాగల దేశీయులకు మంచి గౌరవమూ, ఆదాయమూగల వుద్యోగా లివ్వబడేవి ఈ రాజకీయ సౌకర్యాలన్నీ బ్రిటిషు పరిపాలనలో పోయినాయి" అని రామమోహన రాయలవారు వగచినారు.

రామమోహనరాయలవారు స్వాతంత్ర్య ప్రియుడు. నిరంకుశుడైనరాజు కిందినుండి నేపిల్సుప్రజలు స్వేచ్ఛనుపొంది స్వతంత్రరాజ్యం స్థాపించినతరువాత మళ్ళీ రష్యా, ఆస్ట్రియాలవల్ల అణచివేయబడ్డారని విని చాలా దుఃఖించాడు. ఇలాగే స్పెయినులో బాధ్యతాయుత స్వపరిపాలన స్థాపింపబడినట్లు విని కలకత్తాపురమందిరంలో ఒక గొప్ప విందు చేశాడు. ఆనాడు ఫ్రాన్సుదేశంలో కలిగిన స్వాతంత్ర్య విప్లవానికి ఈయన సంతోషించి, రాత్రింబగళ్లు దానిని గురించే మాట్లాడుతూ వుండేవాడు.

రాజా రామమోహనరాయలవారి కృషినీ, వారు స్థాపించిన బ్రహ్మసమాజమున్నూ ఈ దేశంలో నూటయిరవై యేండ్ల యీమధ్య ప్రారంభమైన మతసాంఘిక రాజకీయ సంస్కరణోద్యమాల కన్నింటికీ పునాదులుగా వుండి, మన కాలంనాటి విజ్ఞానవికాసానికి దారితీసినవని చెప్పటంలో అతిశయోక్తి ఏమీ లేదు.

రామమోహనరాయలవారి కాలంనాటికి హిందూ దేశంలో వైదికమతము పాడైపోయి, అనేక మూఢవిశ్వాసాల లోకి దురాచారాలలోకి దిగిపోయినది. శ్రుతిస్మృతులన్నీ

సంస్కృతంలో వున్నందువల్లను, ఆ భాష జనసామాన్యానికి రానందువల్లను ప్రజలు కేవలమూ స్వార్థపరులు చెప్పే మాటలపైన, మోసగాండ్ర తంత్రాలపైన ఆధారపడినందు వల్ల ఆర్ష మతాచారాలకు బదులు దురాచారాలు ప్రబలి నాయి. వేదములందు, ఉపనిషత్తులందు ఆరాధింపబడే పరబ్రహ్మచైతన్యము త్రిమూర్తులుగానూ, అవతారాలు గానూ, చిల్లరదేవుళ్ళుగానూ, తుదకు గ్రామదేవతలుగానూ మార్పుచెంది అనేకవిధాలుగా ఆరాధింపబడుతూ లేనిపోని ఆరాధనలు, అర్చనలు బయలుదేరినాయి. వర్ణాశ్రమధర్మాలు తారుమారైనాయి. ఆచారమే ధర్మమైంది. కాళీశాక్తి పూజలపేరున నరబలులు, జంతువధలు, వామాచారము వృద్ధిఅయినది. కృష్ణభక్తి యనే పేరున స్త్రీ పురుషులు విచ్చలవిడిగా బూతుపాటలతో విహరించడము, వ్యభిచ రించడము ప్రబలింది. ఆ స్థితి కాజేయడంకోసం బలవంత సహాగమనాలు చేయించడము ఎక్కువ అయింది.

గంగా యమునాసంగమంలో ఆత్మహత్యలు, పిల్లలను గంగలో పారవేయడము, నిడులాడడము మొదలైన క్రూరా చారములు వృద్ధిఅయినాయి. మన దేశానికి వచ్చిన క్రైస్తవ మత బోధకులు వీటిని చూచి నవ్వి, నిరసించి, అసహ్యించు కొని ఇదే హిందూమతమని ప్రచారం చేయసాగినారు.

ప్రజలలో ప్రబలిన మూఢవిశ్వాసాలను, దురాచారా లను తొలగించి ఆర్ష మతాన్ని ఉద్ధరించాలని రామమోహన రాయలవారు పాటుబడ్డారు. ఇందుకోసం వేదాలు చదివి, ఉపనిషత్తులను దేశభాష అయిన బంగాళాభాషలోనికి అనువ

దించారు. క్రైస్తవమతాచార్యుల నోళ్లు కట్టడానికి ఇంగ్లీషు లోకిగూడా తర్జుమా చేశారు.

పరిశుద్ధాస్తికమతాన్ని గురించి పరిశోధించి, చర్చించి దానిని స్థాపించడానికని బ్రహ్మసభను స్థాపించారు. అనేక సభలుచేసి, ఉపన్యాసాలిచ్చి కరపత్రాలు, పుస్తకాలు ప్రకటించారు. వార్తాపత్రికలద్వారా క్రైస్తవమత బోధకులు చేస్తూవున్న దుష్ప్రచారాన్ని అరికట్టడానికి రామమోహనరాయలవారుకూడా బంగాళీభాషలోనూ, పారశీభాషలోనూ పత్రికలను స్థాపించి ప్రచారం ప్రారంభించారు. దీనిని గురించి అనేక వాగ్వాదాలు, చర్చలు జరిగినాయి.

రామమోహనరాయలవారు మత, సాంఘిక రాజకీయ సంస్కరణకోసం చాలా ప్రచారం చేశారు. ఇప్పటి రాజకీయ పోరాటంలాగనే సభలలో తీర్మానాలుచేసి మహజరు లంపి, ఇంకా అనేక విధాలుగా ఆందోళనచేశారు.

సహగమనమును మాన్పించడానికి రామమోహనరాయలవారు సభలు చేసి, మహజరులంపి ఆందోళన చేయడమేగాక ఇటీవల గాంధీమహాత్ముడు మద్యపాన నిషేధం విషయంలో ప్రారంభించినట్లుగానే శాంతియుతముగా పికెటింగు చేసేపద్ధతిని కూడా రామమోహనరాయలవారు ప్రయోగించారు. రామమోహనరాయలవారు తన స్నేహితులును కలిసి 1818 లో "ఆంటి సతీ విజిలెన్సు కమిటీ" అనే సంఘంగా వర్పడి అప్పుడు జరిగే సహగమనాలు ఏలాంటి బలవంతము లేకుండా జరుగుతున్నాయో లేదో కనిపెట్టటానికి గంగానదీ తీరానికి వెడుతూవుండేవారు. సహగమనాలను గురించి

కుంపినీప్రభుత్వంవారు చేసిన నిబంధనల ప్రకారము అవి జరుగుతున్నాయో లేదో పరిశీలించేవారు. సహగమనం చేయడానికి వచ్చిన స్త్రీలకు అది శాస్త్రసిద్ధం కాదనిన్ని, దానిని మానవలసినదనిన్నీ నెమ్మదిగా బోధించి దానిని నివారించేవారు. వీరి బోధవల్ల రెండు సహగమనాలు ఆ కాలంలో నివారింపబడియుండడాన్ని గురించి ఏషియాటిక్ జర్నల్ యొక్క 1818 సంవత్సరపు మార్చి నెల సంచికలో వివరింపబడి యున్నది. దీనివల్ల ప్రజలలో కొంత సంచలనం కలిగింది.

సహగమనం నిషేధించవలసినదని రామమోహన రాయలవారు అనేకసభలు చేశారు కరపత్రాలు ప్రకటించారు. మహాజరు లంపారు. దీనిఫలితంగా గవర్నరుజనరలైన విలియం బెంటింకుగారు సహగమనాన్ని 1829 లో నిషేధిస్తూ శాసనం చేశారు.

మన దేశంలో పత్రికలను ప్రకటించాలంటే వాటి ప్రూఫుకాపీలను ముందుగా ప్రభుత్వ కార్యదర్శికి పంపించాలని కుంపినీ ప్రభుత్వంవారు 1799 లో ఒక శాసనం చేశారు. మింటో ప్రభువు పత్రికా ప్రచురణను గురించిన నిర్బంధాలు ఇంకా కఠినంచేసి, వాటిని మీరినవారిని ప్రవాసం పంపేటట్లు శాసించాడు. హేస్టింగ్సు ప్రభువు గవర్నరు జనరలైనప్పుడు 1818 లో యీ కఠిన నిర్బంధాలను తగ్గించాడు గాని, ప్రభుత్వముయొక్క అధికారానికీ, ప్రజాక్షేమానికీ భంగకరమైన విషయాలను గురించి చర్చించకూడదని శాసించాడు. అప్పట్లో వంగభాషలో కొన్ని పత్రికలు

బయలు దేరినాయి. శ్రీరామపురంలోనున్న క్రైస్తవ మత ప్రచారకులు 1818 లో సమాచారదర్పణం అనే పత్రికను బంగాళీభాషలో స్థాపించారు. దీనిలో హిందూమతాన్ని గురించి ఖండిస్తూ వ్రాసేవారు. 1818 లోనే కలకత్తా జర్నల్ అనే ఇంగ్లీషు పత్రిక స్థాపింపబడింది. దీని సంపాదకుడు జేమ్సు సిల్కు బకింఘాము. ఇతడు సహృదయుడు. ఇతడు వ్రాసే విమర్శనలు ప్రభుత్వంవారికి కంటకంగా వుండేవి. పత్రికా ప్రచురణను గురించి కొన్ని నిబంధనలు చేయాలని హేస్టింగ్సు కుంపిణీ డైరెక్టర్లకు వ్రాశాడు. కాని అవి శాసించబడక పూర్వమే సీమకు వెళ్ళిపోయాడు. మిషనరీలు చేస్తూవున్న ప్రచారానికి జవాబుగా రామమోహనరాయలవారు సంవాద కౌముది అనే బంగాళీపత్రికను 1821 సం.రం డిసెంబరు నెలలో స్థాపించారు. 1822 ఏప్రిలులో పారశీభాషలోకూడా మిరాత్ ఉల్ అక్బార్ ' అని పత్రికను స్థాపించారు. వాటిలో రాజకీయాలు. చారిత్రకవ్యాసాలు, సాహిత్యవిషయాలు, ప్రకృతి శాస్త్ర విషయాలుకూడా వ్రాస్తూవుండేవారు. రామమోహన రాయలవారి పారశీవ్యాసాలను బక్కింఘాంగారు ఇంగ్లీషులోకి తర్జుమాచేసి కలకత్తా జర్నలులో ప్రకటించేవారు. శ్రీరామపురం క్రైస్తవ మతబోధకులు వ్రాసిన వ్యాసాలకు జవాబుగా రామమోహనరాయలవారు వ్రాసిన వ్యాసాలు కొన్ని ప్రభుత్వంవారికి కోపకారణాలైనాయి. రామమోహనరాయలు వారి బ్రహ్మసభకు వ్యతిరేకపక్షమైన ధర్మసభవారుకూడా 1822 సం॥ మార్చి నెలలో సమాచారచంద్రిక అనే బంగాళీ పత్రికను ప్రకటించడం ప్రారంభించారు. అంతట చర్చలు

చెలరేగినాయి. 1822 మార్చిలోనే 'జమీాజహాన్‌నుమా' అనే పత్రిక హిందూస్తానీలోనూ, పారశీభాషలోనూ ప్రకటింప బడేవి. ఇదంతా చూచి అదివరకు ప్రభుత్వ సభ్యుడుగా ఉండి హేస్టింగ్స్ ప్రభుస్త్ర తరువాత కొద్దికాలం గవర్నరు జనరలైన జాన్ ఆడం అనే ఆయన ఈ పత్రికలను అణచడానికి నిశ్చయించాడు. కలకత్తా జర్నల్ పత్రికా సంపాదకుడైన జేమ్సు సిల్కు బకింఘాముగారిని ముందుగా 1823 సం॥ ఫిబ్రవరి 12 వ తేదీన పట్టుకుని ప్రవాస మంపించాడు. కలకత్తా జర్నలును అణచివేసి, దాని సహాయ సంపాదకుని కూడా అరెస్టుచేసి ఇంగ్లాండుకు పోయే ఓడమీాద ఎక్కించాడు. అంతటితో తృప్తిచెందక, ఆడంగారు 1823 సం॥ మార్చి 14 వ తేదీన ఒక పత్రికా నిర్బంధకర శాసనాన్ని చేశాడు. వంగరాష్ట్రంలో వున్న పత్రికా సంపాదకులందరూ లైసెన్సులు పొందాలనిన్నీ, కొన్ని తబ్సీళ్లుగల ప్రమాణ పత్రాలను ప్రభుత్వ కార్యదర్శి గారి దగ్గర దాఖలు చెయ్యాలనిన్ని శాసించాడు. లైసెన్సులో వివరింపబడిన కొన్ని విషయాలను గురించి చర్చించకూడదని నిషేధిస్తూ, దానిని ఉల్లంఘించినట్లైతే లైసెన్సులు రద్దు చేసేటట్లుకూడా నిర్ణయించాడు. తక్కిన శాసనాలలాగానే దానిచిత్తునుకూడా కలకత్తా సుప్రీముకోర్టులో బోర్డుబల్లకు అంటించారు. 20 రోజులైన తరువాత వారు దానిని కోర్టువారు శాసనంగా చేస్తారు. ఎవరికైనా ఆక్షేపణ లుంటే ఈలోపుగా తెలియపరచుకోవచ్చును.

రామమోహనరాయలవారు ఈ అక్రమ శాసనానికి తమ ఆక్షేపణను తెలియపర్చుటకు నిశ్చయించారు. అప్పుడు

సుప్రీముకోర్టులో తాత్కాలికంగా న్యాయాధిపతిగా వున్న సర్ ఫ్రాన్సిస్ మెక్నాటిన్‌గారు 31 వ తేదీన ఆక్షేపణ వింటాననిన్నీ. దానిని గురించి ముందుగా ప్రభుత్వంవారికే ఒక మహాజరు పంపడం మంచిదనిన్నీ అన్నారు. ఆ ప్రకారం ఒక మహాజరును తయారుచేశారుగాని, వాయిదాలోపుగా దాని పైన 15 మంది సంతకాలు మాత్రమే అయినాయి అందువల్ల రామమోహనరాయలవారు ఇంకొక మహాజరును తొందరగా తయారుచేసి ద్వారకనాథ ఠాకూర్‌గారు, ప్రసన్నకుమార ఠాకూరుగారును, తానున్నూ అందులో సంతకాలుచేసి సుప్రీముకోర్టువారికి దాఖలుచేశారు. ఈ మహాజరు పత్రికా స్వాతంత్ర్యాన్ని గురించి వ్రాయబడిన ఒక అపూర్వమైన స్వాతంత్ర్య ప్రకటనయని రామమోహనరాయలవారి జీవిత చరిత్రను వ్రాసిన మిస్ కాలెటుగారు వ్రాశారు రామ మోహనరాయలవారు ఇద్దరు గొప్ప బారిస్టర్లను ఫీజులిచ్చి వారిచేత దీనిని గురించి వాదింపి చారు. న్యాయాధిపతిగారు ఈ అర్జీని త్రో వేస్తూ ఈ శాసనాన్ని చట్టంగా అంగీకరించ డానికి తాను ప్రభుత్వంవారికి అదివరకే మాట యిచ్చి యున్నాననే సంగతిని బయల్పరచారు!

ఈ అక్రమాన్ని గురించి తన అసమ్మతిని తెల్పుతూ రామమోహనరాయలవారు తన పారసీపత్రికను ప్రకటించడం ఆపివేశారు. ఆ పత్రిక ఆఖరు సంచికలో దానిని ఆపివేసి నందుకుగల కారణాలను స్పష్టంగా వివరించారు. తరవాత రామమోహనరాయలవారు సుప్రీముకోర్టువారి తీర్పుపైన సభాయుతుడైన యింగ్లీషు రాజుగారికి అప్పీలు చేశారు.

హిందూదేశంలో బ్రిటిషువారు స్థాపించిన ప్రభుత్వముయొక్క చరిత్రను వివరిస్తూ బ్రిటీషు పరిపాలనకూ, అంతకుపూర్వమీ దేశాన్ని పరిపాలించిన మహమ్మదీయుల ప్రభుత్వానికి గల తారతమ్యము ముఖ్యంగా ప్రజలకుగల సివిలుహక్కులు మత స్వాతంత్ర్యము అనీన్నీ ఇంతకుముందు కంపెనీ పరిపాలనలో పత్రికా ప్రకటనకుగల స్వాతంత్ర్యాన్ని ప్రజలు ఎంత మాత్రమూ దుర్వినియోగం చేయలేదనిన్నీ, మిషనరీలు దేశీయుల మతాన్ని దూషిస్తావుంటే కేవలమూ తమ మతాన్ని సమర్థించుకోవడానికే ఆ స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకున్నామనిన్నీ అందులో వ్రాశారు. పాలకులకూ, పాలితులకూ కూడా పత్రికాస్వాతంత్ర్య ముండడం అవసరమనిన్నీ, ఈ దేశాన్ని పరిపాలించే కుంపినీవారి తాబేదారుల చర్యలపైన పత్రిక లోక విధమైన అంకుశముగా వుపయోగిస్తాయనిన్నీ, హిందూదేశ స్థితిగతులనుగురించీ, ప్రజలకుగల యిబ్బందులను గురించీ సీమలోవున్న కుంపినీ డైరెక్టర్లకూ, ఇంగ్లాండులోని అధికారులకూ పత్రికల మూలంగాతప్ప ఇతర విధంగా సమాచారాలు తెలియవనిన్నీ రామమోహనరాయలవారు వ్రాశారు. తూర్పుఇండియా కుంపెనీవారి కిందగల హిందూదేశ పరిపాలనలోగల లోపాలనుగురించిన విమర్శనలు ఈ అప్పీలులో వివరించబడినందువల్ల ఇది మొదటి రాజకీయప్రకటన పత్రమని చెప్పవచ్చును. ఆరునెల లైనతరవాత ప్రీవీకౌన్సిలు సభవారు ఈ పిటీషనును 1825 వ సం॥ నవంబరులో త్రోసివేశారు.

రామమోహనరాయలవారి ప్రయత్నము అప్పటికి విఫలమైనది. కాని, అది వృథాపోలేదు. రామమోహన రాయలవారు 1831 లో ఇంగ్లాండుకు పోయి పార్లమెంటు సభ వారిమొదట ఇచ్చిన సాక్ష్యంలో హిందూదేశ స్థితిగతు లను గురించి చెపుతూ స్థానిక రాజకీయాలను గురించి చర్చించ డానికి పత్రికా స్వాతంత్ర్యము చాలా అవసరమనిన్నీ దేశంలో న్యాయస్థానాలలో జరుగుతూవున్న చర్యలను గురించి ప్రక టించే స్వతంత్రమైన పత్రికలు లేనందువల్ల న్యాయపరిపాలన చక్కగా జరగడానికి ఆటంకముగా వున్నదని మనవిచేశారు. పత్రికాస్వాతంత్ర్యంకోసం ఆయనపడిన శ్రమను ప్రజలు మరిచిపోలేదు. 1835 లో సర్ ఛార్లెస్ మెట్కాఫ్‌గారు తాత్కాలికంగా గవర్నరుజనరలైనప్పుడు పత్రికానిర్బంధ శాసనం రద్దుచేసి, ఈ దేశంలో పత్రికాప్రకటనకు గల ఆటంకాలను తొలగించారు. అంతట పత్రికాస్వాతంత్ర్య మిచ్చినందుకు మెట్కాఫుగారి గౌరవార్థం 1838 వ సంవ త్సరం ఫిబ్రవరి 9 వ తేదీన కలకత్తా పురమందిరంలో గొప్ప విందు జరిగింది. అప్పుడు లీత్ అనే బారిస్టరుగారు రామ మోహనరాయలగారి సేవను గురించి ప్రశంసిస్తూ ఒక చిన్న స్మారక ఉపన్యాసం యిచ్చారు. రామమోహనరాయలవారి స్నేహితుడైన ప్రసన్నకుమారఠాకూరుగారు దానిని బల పరుస్తూ జవాబు చెప్పారు.

న్యాయస్థానాలలో దావాలు, నేరాలు విచారించే టప్పుడు న్యాయాధిపతికి సహాయంగా నియమింపబడే పంచా యతీదార్లనుగురించినకొత్తచట్ట మొకటి 1827లో అమలులోకి

వచ్చింది. హిందువులు, మహమ్మదీయులు విచారించబడే టప్పుడు క్రైస్తవులు పంచాయితీదార్లుగా వుండవచ్చునుగాని, క్రైస్తవులను విచారించేటప్పుడు క్రైస్తవులే పంచాయితీ దార్లుగా వుండాలనే నిబంధనను యీ కొత్తచట్టంలో చేర్చడం వల్ల న్యాయపరిపాలనలో తమ విచక్షణను ప్రవేశపెట్టారనిన్ని ఇదెల్ల అక్రమమనిన్ని రామమోహనరాయలవారు విమర్శించారు. ఇంతేగాక, ఈ చట్టంవల్ల తమ జోడివారిని విచారించేటప్పుడు కూడా హిందువులను, మహమ్మదీయులను "గ్రాండుజూరీ"లో నియమించడానికి వీలు లేకపోవడము కూడా అక్రమమని వాదించారు. ఈ సంగతులతో పార్లమెంటులో అర్జీని దాఖలు చేయవలసినదని రామమోహనరాయలవారు క్రాన్‌ఫోర్డుగారికి 1823 వ సం॥ ఆగస్టు 18 వ తేదీన వ్రాశారు. 1831 లో తాను పార్లమెంటువారికి సాక్ష్యం యిచ్చేటప్పుడుకూడా దీనిని గురించి నొక్కి చెప్పారు. దీని ఫలితంగా 1832 లో ఈ విచక్షణను తీసివేస్తూ పార్లమెంటువారొక శాసనం చేశారు.

కుంపినీ ప్రభుత్వంవారు ఇంగ్లీషు విద్యావిధానం స్థాపించడానికి నిశ్చయించడానికి పూర్వం చాలా కాలంకిందటనే రామమోహనరాయలవారు దానికోసం ఆందోళన చేశారు.

1823 వ సం॥ డిశంబరు 11 వ తేదీన రామమోహన రాయలవారు ఇంగ్లీషు విద్యావిధానం స్థాపించవలసినదని కోరుతూ గవర్నరు జనరలైన అమహరెస్టు ప్రభువుగారి కొక ఇంగ్లీషు ఉత్తరం వ్రాసి దానిని కలకత్తాలో ప్రధాన క్రైస్తవ మతాచార్యుడైన బిషప్ హెంబరుగారిద్వారా పంపించారు. ఈ

ఉత్తరంలోని భాషనుగురించీ, భావాలనుగురించీ హెబరుగారు చాలా మెచ్చుకొన్నారు. అమహారెస్టు ప్రభువు ఈ ఉత్తరాన్ని ఎడ్యుకేషనుకమిటీ అనే విద్యాభివృద్ధి సంఘానికి పంపించారు. దాని ప్రతిని కుంపినీ డైరెక్టర్లకూ పంపాడు. హిందూ దేశంలోని విద్యాభివృద్ధిని గురించి ఆలోచించడం విషయంలో అప్పటి బోర్డు ఆఫ్ కంట్రోలువారి వుద్యోగియైన జేమ్సుమిల్లు గారు ఈ ఉత్తరంలోని అభిప్రాయాలను మన్నించినట్లు దాఖలాలున్నాయి. పాశ్చాత్యవిజ్ఞానము, ఇంగ్లీషుభాషనూ నేర్పవలెనా, లేక హిందూ మహమ్మదీయుల పూర్వవిజ్ఞానమును, దేశభాషలను బోధించుటద్వారానే విద్యనేర్పవలెనా అనే వాగ్వాదం ఆ కాలంలో జరుగుతూవుండేది. కేంద్రప్రభుత్వం వారు తుదకు పాశ్చాత్య విజ్ఞానమును, ఇంగ్లీషుభాషను బోధించేవిద్య నేర్పడానికి 1835 లో నిశ్చయించారు. రామమోహనరాయలవారి వుత్తరం ఈ నిర్ణయానికి తోడ్పడింది.

రామమోహనరాయలవారు తమ సంవాదకౌముదిలో అనేక సంగతులనుగురించి నిర్భయంగా వ్రాస్తూ ఉండేవారు. మర్యాదగల బీద హిందువులకు ఉచితంగా విద్య నేర్పడానికి ఒక పాఠశాల అవసరమనిన్నీ, రాష్ట్రీయ కోర్టులలోనూ, జిల్లా కోర్టులలోనూ జూరీవిచారణపద్ధతిని స్థాపించి పంచాయతీదార్ల అభిప్రాయంప్రకారం తీర్మానించడం అవసరమనిన్నీ, వంగ రాష్ట్రంనుంచి విదేశాలకు బియ్యం ఎగుమతి చేస్తూవున్నందువల్ల ప్రజలకు చాలా యిబ్బందికలుగుతూ ఉన్నదనిన్నీ, ఇంగ్లీషు వైద్యులచేత చికిత్స చేయించుకోవడానికి దేశీయులకుకూడా అవకాశం వుండాలనిన్ని వ్రాశారు. కలకత్తా వీధులలో దేవుని

వుత్సవాలు జరిగేటప్పుడు గుంపులుకూడి శాంతంగా ఆ వుత్స వాలు చూస్తూవున్న ప్రజలను స్త్రీపురుషులనిగాని, పిన్న పెద్దలనిగాని ఎలాంటి విచక్షణలేకుండా ఆ సమయాలలో గుర్రపుబళ్లు ఎక్కిపోయే క్రైస్తవులూ, దొరలూ అక్రమంగా కొరడాలతో కొడుతున్నారనిన్నీ, ప్రజలు చెల్లాచెదరై ఒకరి నొకరు తొక్కుకుని మురికికాలవలలో పడుతున్నారనిన్నీ కలకత్తా మేజస్ట్రేటుగారు దీనినిగురించి చర్యతీసుకోకపోతే, మాట దక్కదన్నీ వ్రాశారు. ఇలాగప్రజల ఆర్థికక్షేమాన్ని గురించీ, రాజకీయహక్కులను గురించిన్నీ నిర్భయంగా వ్రాస్తూవుండేవారు.

జూరీచట్టాన్ని గురించి ఇంగ్లాండుకు వ్రాసిన వుత్తరంలో రామమోహనరాయలవారు ఇలాగ అన్నారు :

"ఐరోపావారి సాంగత్యంవల్ల ఒక వంద సంవత్సరాలైన తరవాత భారతీయులు విద్యావంతులై, రాజకీయ విజ్ఞానము, శాస్త్రజ్ఞానము అభివృద్ధిచేసుకున్న తరవాత అప్పుడు తమకు అన్యాయంగానూ, బాధాకరంగానూ ఉండి తమ్ము సాంఘికంగా అధోగతిలోకి దింపే చట్టాలేవైనా చేయబడుతూవుంటే వానిపట్ల తమ అసమ్మతి తెలపగలశక్తి రాకుండా వుంటుందా! ఐర్లాండుకీ, భారత దేశానికీ చాలా తేడా వున్నది. ఐర్లాండుదేశప్రజలకు వున్న విజ్ఞానంలోనూ, శక్తిలోనూ నాలుగవవంతు అయినా ఈదేశప్రజలకు వుంటే, ఇంగ్లాండుకు చాలా దూరంగావున్న అవకాశంవల్లనూ, సకలసంపదలకూ నిలయమై వున్నందు వల్లనూ, గొప్పజనసంఖ్యవల్లనూ ఈ దేశము బ్రిటీషు

సామ్రాజ్యంలో స్నేహభావంతో వున్నట్లైతే గొప్ప సహాయకారిగానూ, విరోధభావంతో వున్నట్లైతే బలమైన శత్రువుగానూ పరిణమించక తప్పదు.

"బ్రిటిషు పరిపాలనవల్ల చాలా మేలు కలుగుతుందని తలచేవాళ్ళలో నేనొక్కడనై యున్నందువల్ల భారతీయులతో ఆలోచించనైనా ఆలోచించకుండానూ, వారి కష్టసుఖాలను గురించి, భావాలను గురించి తలంచనైనా తలవకుండానూ, మంచినాగరికత, స్వాతంత్ర్య భావాలు కలిగి, విజ్ఞానాభివృద్ధిని అభిలషించే ఆంగ్లజాతికింద అర్ధశతాబ్దంనుంచి ఈ ప్రజలు పరిపాలింపబడుతూ వున్నారనియైనా ఆలోచించకుండానూ ఈ ప్రభుత్వంవారు అనేక రెగ్యులేషనులూ, శాసనాలూ చేయడం చూస్తూవుంటే నాకు చాలా విచారంగా వున్నది."

అని ఆయన వ్రాసిన మాటలు చూస్తే అవి యెంత దూరదృష్టితో ఈయన వ్రాశారో తెలియగలవు. భారతీయులు స్వరాజ్యాన్ని అపేక్షించి, పాటుపడతారని ఈ మహానుభావుడు దివ్యదృష్టితో చూసే ఇలాగ పలికినాడా అనిపిస్తుంది.

1833 వ సంవత్సరంలో తూర్పు ఇండియా వర్తక కంపెనీవారికి మళ్ళీ ఈ హిందూదేశాన్ని పరిపాలించడానికి రాజ్యాధికారవుపట్టా ఇవ్వడాన్ని గురించి పార్లమెంటువారు 1831 లో ఆలోచిస్తూండగా రామమోహనరాయలవారు నామమాత్రావశిష్టుడుగావున్న ఢిల్లీ చక్రవర్తి తరఫున రాయబారిగా ఇంగ్లాండుకు వెళ్ళారు. 1831 వ సం. ఫిబ్రవరి, జూన్ నెలల్లో నియమింపబడిన కామన్సు సభవారి సెలక్టు కమిటీ యెదుట భారతదేశాన్ని గురించి సాక్ష్యం ఇవ్వవలసినదని

రామమోహనరాయలవారిని కోరారు. అంతట ఆయన తన సాక్ష్యాన్ని మౌఖికంగా గాక, లిఖితంగా బోర్డు ఆఫ్ కంట్రోలు వారికి పంపించాడు. అది పార్లమెంటువారికి సమర్పింపబడింది. ఆనాటి న్యాయవిచారణ, రివిన్యూ పరిపాలనలోని లోపాలను గురించి రామమోహనరాయలవారిచ్చిన సాక్ష్యము పార్లమెంటువారి రికార్డులలో అచ్చువేయబడింది. 1832 లో అది ఒక పుస్తకరూపంగాకూడా ప్రకటించబడింది.

భారతదేశ రైతుల దారిద్ర్యము, వాళ్లు పన్నులిచ్చుకోలేని స్థితిలోవుండి బాధపడుతూవుండడము, వారికి విద్య, ఆరోగ్యము లేకపోవడము, జమీందారులు క్రూరులై శిస్తులు హెచ్చించి పీడిస్తూవుండడము, పర్మనెంటు సెటిల్మెంటు అనే శాశ్వతభూమి పైసలావల్ల జమీందారులకే లాభము కలిగిందిగాని రైతులకు కలగకపోవడము మనవిచేసి శిస్తులు తగ్గించమని కోరారు. పంచాయితీ జూరీవిచారణ అవసరమన్నారు. ఆనాటి కోర్టులలో బీదవారికి న్యాయం సులభసాధ్యంగా లేదనిన్నీ, చాలా వ్యయప్రయాసలు కలుగుతున్నాయనిన్నీ చెప్పారు. పెద్ద జీతాల యిరోపా వుద్యోగులను తగ్గించి కొద్ది జీతాలపైన దేశీయులనే వుద్యోగులుగా నియమించమన్నారు. న్యాయవిచారణపద్ధతి మార్చాలన్నారు. కోర్టులలో యింతవరకూ వాడుతూవున్న పారశీభాష న్యాయాధిపతులకూ, కక్షిదారులకూకూడా పరభాష అయినందువల్ల దానిని తీసివేసి ఇంగ్లీషునే ఉపయోగించమని కోరారు. సివిలు కోర్టులలో భారతీయ ఉద్యోగులను, పంచాయితీదార్లను నియమించమని కోరారు. క్రిమినల్ కేసుల విచారణలో

జూరీలనే పంచాయితీ దార్లను నియమించ మన్నారు. న్యాయవిచారణ చేసే వుద్యోగికే రెవిన్యూ వసూలు పనికూడా యిచ్చినందువల్లనూ, జిల్లా జడ్జీయున్నూ, కలెక్టరున్నూ ఒకడే అయినందువల్లను ప్రజలకు అన్యాయాలు జరుగుతున్నాయనిన్నీ, వాటిని విడదీయవలసినదనిన్నీ కోరారు. భారతదేశ ప్రజల ధర్మశాస్త్రవిధులనూ నేరాల విచారణకు వర్తించే శిక్షాస్మృతినీ క్రోడీకరించి ప్రకటించవలసిన దన్నారు. శాసనాలు చేసేముందు భారతీయులతో ఆలోచించవలసిన దన్నారు. ఇదే నేటి శాసననిర్మాణసభల నిర్మాణానికి పునాది – అని చెప్పవచ్చును. రామమోహన రాయలవా రిచ్చిన సాక్ష్యములోని అంశాలలో కొన్ని 1833 లో పార్లమెంటువారు చేసిన రాజ్యాంగ చట్టంయొక్క విధులలో చేరినాయి.

# కిరస్తాని మతానికీ హిందూమతానికీ పోరాటం

క్రీ॥ శ. 1821 లో ప్రకటింపబడిన బ్రాహ్మానికల్ మాగ జీన్ యొక్క పీఠికలో రాజా రామమోహనరాయలవారు ఇట్లు వ్రాసిరి : “ఈ వంగదేశ మిప్పటి కేబదియేండ్ల పైకాలము నుండి ఇంగ్లీషుజాతివారి సంపూర్ణస్వాధీనమునం దుండి యున్నది. ఈ కాలములో మొదటి ముప్పదియేండ్లలోను, వారి మాటలనుబట్టియు, చర్యలనుబట్టియు వారు తమ పరి పాలనలో నున్న ప్రజల మతముతో నెట్టిజోక్యమును గలిగించు కొన రనియు, ఎవరి మత విశ్వాసములు వారు కలిగియుండ వచ్చు ననియు అందరును నమ్ముటకు అవకాశము కలిగెను. వారి రాజ్యము హిందుస్థానములో విస్తరించి, వారి బలమును క్రమక్రమముగా వర్ధిల్లినవి. ఇటీవల ఇరువది వత్స రములనుండి ‘మిషనరీ’ లని పేరుపెట్టుకొన్న ఐరోపాదేశపు పెద్దమనుష్యులు కొందఱు ఈ దేశములోని హిందువులను, ముస ల్మానులను క్రైస్తవమతమున గలుపుకొనుట కనేకవిధము లుగా ప్రయత్నించుచున్నారు. హిందూ మహమ్మదీయ మత ములను దూషించుచు, హిందువుల దైవములను, మహాపురు షులను తూలనాడుచు పరిహాసించుచు కొన్ని చిన్నపుస్తకము

లును, పెద్దగ్రంథములును ప్రకటించి ప్రజలకు పంచిపెట్టుట వారవలంబించు పద్ధతులలో మొదటిది. దేశీయుల యిండ్ల ముందుగాని, వీధులలోగాని నిలిచి తమమతము చాలా ప్రశస్త మైనదని ప్రశంసించుచు, హిందూ మహమ్మదీయ మతములు నీచమైనవని దూషించుచు దుష్ప్రచారము చేయుట రెండవ పద్ధతి. లాభము పొందగోరిగాని, ఇంక నేయుద్దేశముతోగాని దేశీయులలోని తక్కువకులమువా రెవరైనను క్రైస్తవమత మున జేరినచో నీ పెద్దమనుష్యులు వారికి నౌకరీల నిచ్చియు, వారిని పోషించియు, ఇతరులుకూడా వీరి ననుసరించునట్లు ప్రోత్సహించుచుండుట మూడవ పద్ధతి. ఇంగ్లీషువారే సర్వాధి కారులుగా నుండి, వారి పేరు విన్నంతమాత్రముననే ప్రజలు భయపడుచుండు నీ వంగరాష్ట్రములోని దీనజనుల హక్కుల కును మతమునకును ఈ విధముగా భంగము కలిగించుట చాలా అన్యాయము.”

ఇంగ్లీషు తూర్పుఇండియా సంఘమువారు మత విష యమున తటస్థభావము వహించి చాలా కాలము వరకును ఈ దేశములోనికి క్రైస్తవ మత బోధకులకును రానీయలేదు. ఫ్రెంచివారును, డచ్చివారును తమ రాజ్యములోనికి మిషన రీలను రానిచ్చుచుండిరి.

1813 లో తూర్పుఇండియా వర్తక సంఘమువారికి భారతదేశములో వ్యాపారము చేయుటకు క్రొత్తపట్టా యిచ్చు నప్పుడు క్రైస్తవ మతాభిమానుల ప్రోద్బలమువలన నీ దేశములో మతప్రచారము చేయుటకు ఆంగ్లేయులను రానిచ్చుటకు పార్లమెంటువా రంగీకరించిరి. దేశములోనున్న

ఆంగ్లేయ క్రైస్తవోద్యోగుల కొరకు క్రైస్తవ మతశాఖ స్థాపించిరి. అంతట క్రైస్తవ మత ప్రచారకులు విజృంభించి మతబోధ చేయసాగిరి.

డచ్చివారి రాజ్యములోని శ్రీరామపురములో బాప్టిస్టు మిషనరీలు క్రైస్తమతప్రచారము నిమిత్తము 23-5-1818 తేదీన సమాచారదర్పణ మను బంగాళీవారపత్రికను స్థాపించి హిందూమతమును దూషింపసాగిరి. అంతట రామమోహన రాయలవారు ఉపనిషత్తులలోని పరిశుద్ధాస్తికమతమునుగూర్చి ప్రచారము చేయుటకును, మిషనరీల దుష్ప్రచారమును అరికట్టుటకును 4-12-1821 తేదీన 'సంవాద కౌముది' అను బంగాళీ వారపత్రికను స్థాపించిరి. 12-4-21 తేదీన మిరాత్ ఉల్ అక్బర్ అని పారశీభాషలో నింకొక పత్రికను స్థాపించిరి. అంతట వాదోపవాదము లతి తీవ్రముగా జరుగ సాగెను.

2-10-1818 తేదీన స్థాపింపబడిన కలకత్తా జర్నల్ అను ఇంగ్లీషుపత్రికకు సంపాదకుడైన జేమ్సు సిల్కు బక్కింఘాము అనునతడు రామమోహన రాయలవారి వ్యాసముల నింగ్లీషులోని కనువదించి ఆ పత్రికలో ప్రకటింపసాగెను. ఇది హిందూదేశ ఆంగ్లప్రభుత్వముయొక్క సుప్రీము కౌన్సిలువారికి గిట్టకపోయెను. ఆడం అనునాయన గవర్నరు జనరల్ కాగానే చేసిన మొదటి కార్యము 12-2-1823 తేదీన బక్కింఘామును ప్రవాసమంపుట, రెండవకార్యము పత్రికా స్వాతంత్ర్యము నరికట్టుచు కొన్ని నిర్బంధములు కలిగించు శాసనమును 14-3-1823 వ తేదీన జారీచేయుట. ఈ అన్యాయమును

బాపుటకు రామమోహనరాయలువారు సుప్రీము కోర్టులో అర్జీ దాఖలుచేసియు, ఆంగ్లరాజునకు విన్నప మంపియు ఎంతో కష్టపడిరిగాని, లాభము లేకపోయెను. తుద కెంటింకు గవర్నరు జనరలు రామమోహనరాయలు చనిపోయిన పిదప 1835 లో నీ నిర్బంధములు తొలగించెను.

ఈ దేశములోని హిందువులు ముసల్మానులు క్రైస్తవ మతములో సులభముగా చేరకపోవుటకు కారణము వారికి గట్టిమతవిశ్వాసములు నైతికధర్మములు, కొన్ని యున్నందు వల్లనే సనియు, ముందుగా వారిమనస్సులందు స్థిరపడియున్న ఈ నమ్మకములను వారి మతాచార వ్యవహారములందు వారికి గల యాసక్తిని పోగొట్టినగాని క్రైస్తవమతముపట్ల వారు సుముఖులు కానేరరనియు, క్రైస్తమతము వ్యాపించుటకు దారి ఏర్పడదనియు బుద్ధిమంతులగు క్రైస్తవ మతప్రచారకులు గ్రహించి విద్యాబోధనము ద్వారా ప్రజల మనస్సులను విరిచి క్రైస్తవ మతప్రచారము చేయదలచిరి విలియం బెంటింకు, మెకాలే మొదలగు రాజ్యాంగవేత్తలు కూడా ఈ కొత్తపద్ధతిని హర్షించి దానికి తోడ్పడసాగిరి.

విద్యాబోధనము ద్వారా క్రైస్తవమత ప్రచారము చేయుటకు ఈ దేశమునకు వచ్చిన మిషనరీలలో అలెగ్జాండర్ డఫ్ చాలా తెలివైనవాడు. ఇతడు 1830 లో కలకత్తాకు వచ్చి కంపినీ అధికారులను, దేశీయులను మంచితనముచేసికొని తన పని ప్రారంభించినాడు. కొందరు తెలివితక్కువవారివలె హిందూ మహమ్మదీయ మతములను నిరసించుచు క్రైస్తవమత ప్రాశస్త్యమునుగూర్చి సర్వకాల సర్వావస్థలయందు చాటు

పురాతనపద్ధతిలో గాక భూగోళ, ఖగోళశాస్త్రములను, ప్రకృతిశాస్త్రములను బోధించుచు, అందుకు విరుద్ధముగా హిందూమహమ్మదీయులు విశ్వసించు సంగతులను ఖండించుచు వారియందు తమ సంప్రదాయములను గూర్చిన అపనమ్మకములను వ్యాపింపజేయు క్రొత్తపద్ధతిని ప్రారంభించినాడు. ఉదాహరణమునకు గ్రహణములు, రాహుకేతువులు సూర్యచంద్రులను మింగుటవలనగాక, భూమియొక్కయు చంద్రునియొక్కయు ఛాయలవలననే కలుగుచున్నవని ఋజువుపరచి గ్రహణసమయములందు మనవారు చేయు స్నానములను, మంత్రోపాసనలను పరిహసింప నారంభించినాడు. ఈ ప్రకారము మతధర్మములయందు, పూర్వాచారములయందు యువకుల విశ్వాసమును పెల్లగించివేసి బైబిలునందు, క్రైస్తవమతమునందు, పాశ్చాత్యవిజ్ఞానమునందు గౌరవమును కలిగించినాడు.

పాఠశాలలలో ఈ విధముగా హిందూమత విధ్వంసము చేయుటతో తృప్తిచెందక, క్రైస్తవమత సంబంధములైన ఉపన్యాసముల నిచ్చి విద్యార్థులగు వంగరాష్ట్రీయ యువకులలో ప్రచారము చేయ దలచినాడు. ఈ సభకు వచ్చుటకు హిందూయువకులు భయపడుట చూచి, ఆ కాలములో సర్వమతములను సమానములని నమ్మి, హిందూమతములోని దురాచారములను మాన్పి పరిశుద్ధాస్తికమతమును స్థాపించ దలచి బ్రహ్మసభను స్థాపించి, సంఘసంస్కారోద్యమము నడుపుచున్న రాజా రామమోహనరాయల నాశ్రయించి యిటువంటి ఉపన్యాసములు వినుటవలన మానసికవికాసము

కలుగునుగాని, నష్టము కలుగదని రామమోహనరాయలుగారి చేతనే విద్యార్థులకు బోధింపచేసినాడు.

1831 సం. ఆగష్టునెల మొదటివారములో యిరువది మంది హిందూకాలేజీ విద్యార్థులు అలెగ్జాండరు డఫ్‌గారి యింటికి వెళ్ళి ఆయన యిచ్చిన ఉపన్యాసములు వినిరి. హిందూబాలురు క్రైస్తవమతోపన్యాసములు వినుటకు పోయిరనిన వార్త ఆ మరునాడు కలకత్తాపట్టణ మంతట వ్యాపించి ప్రజలలో కలవరము కలిగించినది ఆ రోజున విద్యార్థులెవ్వరును కాలేజీకి హాజరుకాలేదు. అధికారులు ప్రజాభిప్రాయమునకు వెరచి పిల్ల లెవ్వరును రాజకీయ మతోపన్యాసములకు పోకూడదని నోటీసుబోర్డుపైన ప్రకటన కట్టిరి.

ఆ కాలములో దేశక్షేమమునకు భంగము కలిగింతురని కుంపినీప్రభుత్వమువారికి తోచు దొరలను దేశములోనుండి వెడలగొట్టు నధికార ముండెను. ఈ డఫ్‌దొరను ప్రవాసమంపుదు రేమోనని తోచగా, యితడు గవర్నరుజనరలైన విలియం బెంటింకు దర్శనమునకు వెళ్ళెను. అతడు జరిగిన సంగతి విని నీవు చేసినదానిలో నేర మేమియు లేదు గాని, ప్రస్తుతము గందరగోళము తగ్గుపరకును ఊరకుండుమని చెప్పి, తాను గవర్నరుజనరలుగా నున్నందువల్ల క్రైస్తవ మత ప్రచారమునకును సాహాయ్యము చేసినచో బాగుండ దనియు వ్యక్తిగతముగా చేయదగిన సాహాయ్య మెల్ల చేసెద ననియు అభయహస్త మిచ్చి సాగనంపినాడు.

ఆ కాలములో హిందూమతాచారమునందు గల మూఢవిశ్వాసమును తొలగించి పరిశుద్ధమైన ఉపనిషన్మత

మును స్థాపించుటకును సంఘములోనుండు దురాచారములను తొలగించి సంస్కారము చేయుటకును రాజారామమోహన రాయలువారు పాటుబడుచు బ్రహ్మసభయను ఒక సంఘమును స్థాపించిరి. దానిలో ద్వారకనాథఠాగూరు, ప్రసన్నకుమార ఠాగూరు మొదలైనవారు సభ్యులుగా నుండిరి. ఈ సభకు పోటీగా సనాతనవాదులు ధర్మసభ యను సంఘమును స్థాపించిరి. దానికి రాజారాధాకాంతదేవుగా రధ్యక్షుడు. ఈ రెండు సభలును తీవ్రముగా పోరాడుచున్నందువల్ల కలకత్తాలోగల హిందూసంఘము రెండు కక్షలుగా చీలినది.

ఆ సమయములో హిందూసంఘమును ఒక కొత్త సమస్య ఎదుర్కొన్నది. ఇంగ్లీషు చదువుల వలనను, క్రైస్తవ మతబోధకుల ప్రచారము వలనను హిందూయువకుల మనసులలో ఒక విచిత్రమైన మార్పు కలిగినది హిందూమతముపైన ధర్మముపైన వారికి నమ్మకము పోయినది. సరిఅయిన కారణము చూపినగాని, ఏ సిద్ధాంతమును నమ్మకూడదను భావము వ్యాపించినది. ఈ యువకులు మతధర్మములతోపాటు పుణ్యపాపములను కూడ తృణీకరించి ఆహారవిహారములలో స్వేచ్ఛావిహారు లైనారు. వీరు శుష్కవేదాంతులై క్రైస్తవ మతాచార్యులకన్న తీవ్రమైన విమర్శనలు చేయ ప్రారంభించినారు. ఇట్టిపరిస్థితులలో గొప్పయింటి యువకులలో కొందరిని మిషనరీలు క్రైస్తవమతములో కలుపుకొనుటకు అవకాశము కలిగినది. అలగ్జాండరు డఫ్‌గారి ప్రభావమువలన కులీన బ్రాహ్మణ కుటుంబమునకు చెందిన కృష్ణమోహన బెనర్జీగారు 1832 లో క్రయిస్తవమతము స్వీకరించినారు. ఇట్లే మరి

కొందరు యువకులు క్రయిస్తవమతములో చేరిరి ఈ యువకులకు మిషనరీలు ఆశ్రయమిచ్చి వారికి సహాయము చేయుటయేగాక, క్రయిస్తవులైన వారి భార్యలను వారి వశము చేయించుటకు న్యాయస్థానములందు దావాలు దాఖలు చేయించుచుండిరి. ఒకవంక క్రయిస్తవమతమున కలియుటకు పోయిన మైనరు పిల్లలను తమవశము చేయుడని హిందూ తల్లిదండ్రులు కోర్టులలో హెబియసు కార్పసు పిటిషనులు వ్యాజ్యములు దాఖలు చేయుచుండిరి. ఈ సందర్భములలో కొందరు న్యాయమూర్తులు క్రయిస్తవమత పక్షపాతులై యుండిరి.

1830-34 మధ్య మన హిందూమతము నిర్మూలమైపోవుచున్నదను భావము ప్రబలి కలకత్తా హిందువులందు భయము కలిగినది. అంతట ప్రజలలో ఒక విధమైన సంచలనము కలిగి, స్వధర్మరక్షణ కొరకు కొంత గట్టిప్రయత్నము చేయవలెనను భావము వ్యాపించినది. కొన్నిసభలు జరిగినవిగాని, పైనచెప్పిన సంఘసంస్కార సనాతన ధర్మపక్షముల వారిలోగల అభిప్రాయ భేదములవలన ప్రజాసంఘము బలహీనమైనది. క్రైస్తవ మతప్రచారము విజృంభించినది

1844-48 మధ్య క్రైస్తవ మతప్రచారము అతితీవ్రముగా జరుగుటయు మరల కొందరు ఉత్తమ కుటుంబములోని యువకులు క్రైస్తవు లగుటయు తటస్థించినది. క్రైస్తవపాఠశాలలో పరీక్షలయందు తీర్ణులైన యువకుల కుద్యోగము లిచ్చుటకూడ దీనికి తోడ్పడినది. అలగ్జాండర్ డఫ్ స్థాపించిన క్రైస్తవకళాశాలలో 1300 మంది హిందూవిద్యార్థులు చదువు

చుండిరి. హిందూధర్మమునకు ముప్పు కలుగబోవుచున్నదను భయము మరల ప్రజలలో వ్యాపించింది. స్వధర్మరక్షణకొరకు మరల కొంత ప్రయత్నము జరిగినది.

కలకత్తాలో 1830 - 34 మధ్య డఫ్‌గారు క్రొత్తగా వచ్చిననాటికి అతనిని ప్రతిఘటించినవారు కేవలము సనాతన ధర్మ వాదులే. ఇప్పుడన్ననో, వారితోపాటు ఈ యింగ్లీషు పరిపాలనలో బీరు, సారాయి సీసాలను ఇతర తుక్కును అమ్మి లక్షాధికారులైన బంగాళీ కుటుంబములవారు స్వధర్మ రక్షణకొరకు బావుటా నెత్తిరి. జమీందారులు, బాబూలు, బ్రాహ్మణులు నీవిపత్సమయములో ఏకమయి కర్తవ్య మాలోచించిరి. హిందూబాలురకు బైబిలు పాఠముల నేర్పు చున్నందువల్లనే యిలాటి విపరీతబుద్ధులు కలుగుచున్నవి గనక క్రైస్తవమతబోధలేని లౌకికపాఠశాలలు స్థాపించుట యుక్తమని నిశ్చయించిరి. వీరి కీ విషయములో కొంతమంది జెసూట్ క్రైస్తవదొరలును, ఐర్లాండు దేశపు దొరలును సాహాయ్యము చేయుట కంగీకరించిరి. ఈ క్రైస్తవ తెగలకును, డఫ్‌గారి క్రైస్తవ శాఖకును గల అభిప్రాయిభేదములే దీనికి కారణము. ఈ సందర్భములో సీలు కుటుంబమువారు ఒక కాలేజీని స్థాపించుటయు, గురుమోహన్ పాఠశాల స్థాపించబడుటయు జరిగినది ఇట్లు స్వధర్మరక్షణకొరకు ప్రయత్నించుచున్న దేశీయులుకూడా వైదికవిద్యనుకాక ఆంగ్లేయవిద్యనే అభివృద్ధి చేయదలచుట యింగ్లీషువిద్యయందానాటి వారికి గల యాసక్తిని సూచించుచున్నది. బైబిలుబోధలే గాక ఈ ఇంగ్లీషు

చదువులే యువకులందు విపరీతబుద్ధులు పుట్టించుచున్నవను సంగతి వీరు గమనింపలేదు.

హిందూ తల్లిదండ్రులు తమ పిల్లలను క్రైస్తవ పాఠశాలలో చదివించకూడదనియు, అలా చదివించుచున్న పిల్లలను వెంటనే మాన్పింపవలయుననియు ఒక యుద్యమము బయలుదేరెను. ఆ సమయములో కలకత్తాలో కాపురము వున్న కొందరు అలహాబాదువారుకూడా యీ యుద్యమములో చేరి తమ పట్నమున గల కొందరికి యీ విషయమునుగూర్చి ఉత్తరములు వ్రాసిరి. మిషనరీ పాఠశాలలనుండి కొందరు తమ పిల్లలను వెంటనే మాన్పించిరి. కొన్నివారములు క్రైస్తవపాఠశాలలలో హాజరు అగుట తగ్గినది. గాని ఈ గడబిడ మెల్లిగా తగ్గి, మానినబాలురుకూడా మరల రాసాగిరి. దీనికి కారణము ప్రజలలోగల చీలికలే. *

మహాఋషి దేవేంద్రనాథ ఠాగూరుగారు తమ స్వీయ స్వీయచరిత్రలో నిట్లు వ్రాసిరి :

"శక సంవత్సరము 1767 (క్రీ శ. 1845) లో వైశాఖ మాసములో నొకనాటి ఉదయమున నేను పత్రిక చదువుకొనుచుండగా మా బ్యాంకిగుమాస్తా రాజేంద్రనాథ సర్కారు కంట నీరిడికొని వచ్చి క్రిందటి ఆదివారము నా భార్య, నా తమ్ముని భార్య బండిలో పోవుచుండగా నా తమ్ముడు వచ్చి బలవంతముగా తన భార్యను బండిలోనుండి బయటకు తీసికొని డాక్టరు డఫ్‌గారింటికి క్రైస్తవమతమున గలియుటకు పోయి

---

* Life of Alexander Duff. — George Smith (1879) 2 Vols. P. 7

నాడు. అక్కడనుంచి వారి నీవలకు తీసికొని వచ్చుటకు నా తండ్రి చాలా ప్రయత్నము చేసి లాభము లేకపోగా, సుప్రీముకోర్టులో పిటిషను పెట్టినాడు గాని, కోర్టువారా పిటిషను కొట్టివేసినారు. అంతట నేను డఫ్‌గారిదగ్గరకు వెళ్ళి మేము మఱల కేసు దాఖలు చేయదలచితిమనియు ఈలోపుగా మా తమ్ముని, మరదలిని క్రైస్తవమతమున గలుప వద్దనియు బ్రతిమాలుకొంటిని గాని అతడు వినక, నిన్న సాయంకాలము వారిని మతములో కలుపుకొనినాడు. అని రాజేంద్రుడు దుఃఖింపజొచ్చెను. ఇందువలన నాకు చాలా విచారము, రోషము కలిగినవి. ఈ క్రైస్తవులు మా యంతః పుర స్త్రీలనుకూడా క్రైస్తవులుగ చేయుచున్నారే! ఇది అరికట్టవలెను. అనిఅనుకొని నా తత్త్వబోధిని పత్రికకుసంపాదకు డుగనుండిన అక్షయకు మారదత్తుని లేఖనిని పురికొల్పితిని.

"మన అంతఃపురస్త్రీలు కూడా తమ మతమును వదలి అన్యమతమును స్వీకరించుచున్నారు. ఇట్టిదుఃస్థితికూడా మనలను మేలుకొలుపవలదా? ఇంకా ఎంత కాల మీ నిద్రావస్థయందు మనము పడియుండుట చూడుడు! మన మతము పూర్తిగా ధ్వంసమై పోవుచున్నది. మన దేశము నాశనమగుచున్నది. 'హిందు' అను పేరే రూపుమాయగలదు. అందువలన మీరు మీ క్షేమమును కోరుదురేని, మీ దేశాభివృద్ధిని ఆశింతురేని, సత్యము ననుష్ఠింతురేని మీ పిల్లలకు (మిషనరీ) క్రైస్తవ మతబోధకుల సంపర్కము లేకుండా చేయుడు. వారి పాఠ శాలలకు పంపకుడు, వారికి జ్ఞానాభివృద్ధి కలిగించుటకు తగు చర్యలు తీసికొనవలెను. మిషనరీల పాఠశాలలో తప్ప

బీదవారిపిల్ల లెక్కడ చదువుకొనగలరని మీరందురేమో. క్రైస్తవులు తమ మతమును వ్యాపింపజేయుటకు సముద్రములు దాటి, హిందూదేశమునకు వచ్చి ప్రతి పట్టణములోను, పల్లెలోను పాఠశాలలు స్థాపించుచుండగా మనపిల్లలు చదువుకొనుటకు మన కొక్క పాఠశాలయైన లేకపోవుట సిగ్గుచేటుకాదా? మనముందరము ఏకమైనచో వారి పాఠశాలలకంటె పదిరెట్లు ఉత్తమము లైనవానిని, కనీసము వానితో సమానమైన వాని నైనను మనము స్థాపింపలేమా? ఐకమత్యమువలన సాధింపలేని కార్య మేమున్నది?" అని తీవ్రమైన వ్యాస మొకటి తత్వబోధిని పత్రికలో వెలువడినది. తరువాత నేను ప్రతిదినము ఉదయము సాయంకాలము కలకత్తాలోని ప్రముఖుల యిండ్లకు వెళ్ళి హిందూబాలబాలికలు మిషనరీల పాఠశాలలందు చేరనక్కరలేకుండా మనపాఠశాలలోనే చదువుకొనుటకు వలసిన ప్రయత్నములు చేయవలసినదని వారిని ప్రార్థింపదొడగితిని. ఒకపక్షమునకు నాయకులగు రాజా రాధాకాంతదేవు, రాజా సత్యచరణ ఘోసాలుగార్లను రెండవ పక్షమునకు నాయకులైన రామగోపాల ఘోసుగారిని ఒక్కొక్కరిని, అందరిని దర్శించి హెచ్చరించితిని. నాయుత్సాహమువలన వారియందుకూడా ఆవేశము కలిగినది. ఇందువలన ధర్మసభకును బ్రహ్మసభకు నుండిన వైషమ్యములు ఒండొరులకుగల భేదాభిప్రాయములును పోయినవి. క్రైస్తవ మతబోధకుల పాఠశాలలకు పిల్లలు పోకుండగను వారు వీరిని తమ మతమున గలుపకుండగను చేయుట కందరును ఏకమైరి.

జ్యేష్ఠమాస త్రయోదశినాడు, ఒకమహాసభ జరిగినది. రమారమి ఒక వేయిమంది సమావేశమైరి. పిల్లలకు ఉచిత ముగ విద్యను బోధించు పాఠశాలలు మిషనరీల కున్నట్లే మనకుగూడా నుండవలెనని తీర్మానించిరి. ఎవరెవరెంత చందా వేయుదురో యని విరాళముల జాబితా చేత నిడికొని వేచి యుండగా అశుతోషదేవు ప్రమథనాథదేవుగార్లు జాబితాను తీసుకొని ఒక్కొక్కరు పదివేలరూపాయల విరాళములు వేసిరి. రాజా సత్యచరణ ఘోసాలుగారు మూడువేలును, బ్రజనాథదాసుగారు రెండువేలును చందా వేసిరి. ఇట్లు అక్కడ నాక్షణముననే నలుబదివేల రూపాయలు వసూలయ్యెను. అంతట మా కృషి ఫలించినదని మేము గ్రహించితిమి. ఈసభ యొక్క ఫలితముగా హిందూ హితార్థి పాఠశాల స్థాపింపబడినది. దానిని నిర్వహించుటకు రాజా రాధాకాంతదేవు బహద్దరుగారు అధ్యక్షులుగా నియమింపబడిరి. హరిమోహన సేనుగారును నేనును కార్యదర్శులు మైతిమి. ఈ ఉచిత విద్యాదాన సంస్థలో బాబు భూదేవ ముఖోపాధ్యాయులు మొదటి యుపాధ్యాయులుగా నియమింపబడెను. అంతట క్రైస్తవమత ప్రచారమునకు పెద్ద దెబ్బతగిలి, క్రైస్తవ మతమున గలుపుకొనుట అరికట్టబడినది. *

1847లో కలకత్తాలో మరల నొక్కసారిగా నలుగురు హిందువులను క్రైస్తవమతములో గలిపిరి. అందులో ముఖ్యముగా డఫ్‌దొరగారి క్రైస్తవ కళాశాలలో చదువుచున్న విద్యార్థి యొకడు. ఆ బాలుని విడిపించుటకు హిందువులు

* The Autobiography of Maharshi Debendranath Tagore. Macmillian 1914. PP 98-101

కలకత్తా సుప్రీముకోర్టులో ఒక దావా దాఖలుచేసిరి. అయితే ఆ బాలునికి విచక్షణజ్ఞాన మున్నదని తీర్మానించి దావా త్రోసివేసిరి. అంతట ప్రజలలో తీవ్రమైన సంచలనము కలిగినది. కలకత్తాలోని దేశీయులందరు క్రైస్తవమతము పట్ల మిషనరీలపట్లను తమ అసమ్మతిని తెలుపుటకు గొప్ప మహా సభను జేసిరి. 1848 సెప్టెంబరు 19 తేదీన యీ దృశ్యమును గూర్చి కలకత్తా హర్కారు పత్రిక యిట్లు వ్రాసినది. "ఈ మహాసభలో అనేకమతములవారు కులములవారు సమావేశ మైరి. రాజా రాధాకాంతదేవుగా రధ్యక్షత వహించిరి. హిందూసొసయిటీ అనుపేరుతో నొకసంఘమును స్థాపించుటకు నిశ్చయించిరి. ప్రతికులము యొక్కయు మతశాఖయొక్కయు సనాతన సంస్కారపక్షముల యొక్కయు ప్రజలు ఈ సంఘ ములోచేరి తమతమ జాతిమత పక్షములలోని పిల్లలను ఏ మిషనరీ సంస్థలోను చదివించ కూడదనియు, అట్లు చదివించిన వారిని కులములోనుండి వెలివేయునట్లును ప్రూచీపడుచూ నొక ఒడంబడిక పత్రమునందరు ముందుగా వ్రాసి యిచ్చునట్లు తీర్మానించిరి.

అప్పటికి మాత్రము హిందువులలో కొంతఐకమత్యము కలిగి సంస్కారులును సనాతనులును కలిసిన సంయుక్తసభ యొకటి జరిగినది. దీనికి మూలకారకులు దేవేంద్రనాథ ఠాగూరు గారు. ఈ సంయుక్త సభలో క్రైస్తవ పాఠశాలలకు పిల్లల నంపు హిందూతలిదండ్రులు తమ పిల్లలను మాన్పించి హిందు వులు స్థాపించిన కొత్తపాఠశాలకు పంపునట్లు ఒక యొడంబడిక పత్రమును వ్రాయునట్లును అట్లు అంగీకరించని వారిని కులము

నుండి వెలివేయుటకును ఈ హిందూసభవారు తీర్మానించిరి. ఈ ఒడంబడిక పత్రమును బ్రహ్మసభ నాయకులలో నొకరైన దేవేంద్రనాథ ఠాగూరుగారు తయారుచేసిరి. ఈ సందర్భములలో మరల బ్రహ్మసభ పక్షమువారికిని ధర్మసభ పక్షమువారికిని కొంత అభిప్రాయ భేదముకలిగెను ఒకబహిరంగసభ చేసి కొంత చర్చ జరిగినమీదట రాజీ కుదిరెను.

అక్కడున్న కులపెద్దలు నాయకులు చాలమంది అట్టి ఒడంబడికలు వ్రాసియిచ్చిరి. కలకత్తా వెలుపల, దేశములోని యితర ప్రదేశములలోకూడా యీ ప్రకారమే జరుగుననియు తలచిరి. ఆసభలోనున్న ఒకానొక సనాతన ధర్మపక్షీయుడు అక్కడనున్న పిల్లలవైపుకు తిరిగి ఓబాబులలారా మీరందరూ ఏకేశ్వరుని ఆరాధింపుడు. అదియే వేదాంతము. మీ ఇష్టము వచ్చిన ఆహారమును భుజింపుడు. మీ యిష్టము వచ్చినట్లు చేయుడుగాని క్రైస్తవ మతమును మాత్రము స్వీకరింపకుడని హెచ్చరించెను.

ముక్కుపచ్చలారని పిల్లలను చదువుచెప్పే మిషతో మిషనరీలు క్రైస్తవ మతబోధచేసి క్రైస్తవమతంలో కలుపుకుంటూవుంటే హిందూ జనసంఘం తల్లడిల్లి న్యాయస్థానాలలో దావాలు దాఖలు చేసుకొని తమ పిల్లలను స్వాధీనం చేయమనికోరుతూ హెబియస్ కార్పసు పిటీషన్లు దాఖలు చేసుకోవడం ప్రారంభించారు. ఒక రిద్దరు ధర్మాత్ములైన న్యాయాధిపతులు తప్ప తక్కినవారందరూ మిషనరీల పక్షంగానే తీర్మానించేవారు.

1853 లో బొంబాయి సుప్రీముకోర్టు తీర్పులను ప్రకటిస్తూ సర్ ఎర్స్కిన్ పెర్రీగారు ఈ కేసులను గురించి ఇలా వ్రాశారు: ఈ విషయంలో బొంబాయి సుప్రీముకోర్టు తీర్పులకూ కలకత్తా సుప్రీముకోర్టు తీర్పులకూ అభిప్రాయభేదం వున్నది. ఇలాంటి వ్యవహారంలోనే కలకత్తా సుప్రీముకోర్టువారు ఇంకొకలాగ తీర్మానించారు. ఒక పిల్లవాడిని అక్రమ నిర్బంధంలో వుంచారనే కారణంపైననే హేబియసు కార్పసు పిటిషను దాఖలు అయినప్పుడు ఆపిల్లవాడిని కోర్టుకు హాజరు పరిచిన తరువాత ఆలోచించవలసిన సంగతి, ఆ పిల్లవాడు అక్రమ నిర్బంధంలోవున్నాడా లేడా అనేదే. అందువల్ల వాడు అక్రమనిర్బంధంలో లేడనిన్నీ తన యిష్టం వచ్చినచోట వుండడానికి నిశ్చయించుకోగల యుక్తాయుక్త వివేచన వాడికి వున్నదనిన్నీ కోర్టువారికి తోచేయడల వాడిని వాడి యిష్టం వచ్చినచోటికి పోనివ్వవచ్చును. శాస్త్రప్రకారం యుక్తవయస్సు రానివాడికి సంరక్షకుడు ఎవడో వాడికి వశపరచాలనే అగత్యంలేదు అని కలకత్తా కోర్టువారు నిశ్చయించారు. 1857 లో కలకత్తా సుప్రీముకోర్టులో విచారణకు వచ్చిన కేసులోని పిల్లవాడు అలెగ్జాండర్ డఫ్‌గారి క్రైస్తవపాఠశాలలో చదువుతూ క్రైస్తవమతంలో చేరాడు. వాడికి 14 సంవత్సరాల వయస్సు. డఫ్‌గారి దగ్గరికి పోయి క్రైస్తవమతంలో చేరడమే తన అభిమతమని ఆ కుర్రవాడు చెప్పినందువల్ల కోర్టువారు అతనిని వదిలివేశారు.*

---

* Cases illustrative of Oriental Life decided in the Supreme Court of Bombay (1853) p. 103 Life of Alexandor Duff – George Smith.

యుక్తవయస్సు రాని పిల్లలను మిషనరీలు అక్రమ నిర్బంధంలో వుంచారననీ, వారిని విడిపించవలసినదనీ 1843 లో రెండు హెబియస్ కార్పసు పిటిషన్లు విచారణకు వచ్చినాయి.

క్వీన్ Vs. రెవరెండ్ రాబర్టు నెస్బిటు అనే కేసు బొంబాయి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి అయిన రోపర్‌గారి యెదుటను, సహాయ న్యాయాధిపతియైన సర్ ఎర్స్కిన్ పెర్రీగారి యెదుటను విచారణకు వచ్చింది. ఆ తగాయిదా సంగతులు చాలా విచిత్రంగా వున్నాయి; రాబర్టు నెస్బిట్‌గారు బొంబాయిలో 1838 నుంచీ చర్చి ఆఫ్ స్కాట్లాండు మిషనరీ పాఠశాల నడుపుతున్నాడు. నారాయణ అనే యువకుడు ఆ బడిలో చదువుకుంటున్నాడు. 1841 లో అతని తమ్ముడు శ్రీపతి శేషాద్రిని కూడా తండ్రి యిష్టంమీద ఆ బడిలో చేర్చాడు. వీళ్ళిద్దరూ నెస్బిటుగారి యింట్లోనేవుండి చదువుకునేవారు. నారాయణ 1843 సంవత్సరం సెప్టెంబరు నెలలో క్రైస్తవమతంలో కలిశాడు. అతడి తమ్ముడుకూడా 15 నెలలనుంచి హిందూ ఆచారాలు మానేశాడు. బొట్టు మాత్రం యింకా పెట్టుకుంటున్నాడు గాని, దేవతార్చనలు, పూజలు, వ్రతాలు జరిగేటప్పుడు పాల్గొనడంలేదు. నెస్బిటు గారి యింట్లో వుండడం మొదలెట్టినప్పటినుంచీ యీ యిద్దరు అన్నదమ్ములూ హిందువులు తినకూడని పదార్థాలను తింటూ వున్నారు. ఈసంగతులన్నీ కేసు విచారణలో బయటపడ్డాయి.*

---

* Representative view of Southern India G.Parameswaran Pillai. pp. 148 - 149.

శ్రీపతి శేషాద్రి 12 సంవత్సరాల వయస్సు వాడనిన్నీ మిషనరీలు వాడిని అక్రమంగా నిర్బంధించి వుంచారనిన్నీ వాడిని కోర్టులో హాజరు పరిపించి తనకు స్వాధీనం చేయవలసిందనిన్నీ తండ్రిఅయిన గోవిందు సుప్రీము కోర్టులో హేబియసు కార్పసుపిటీషను దాఖలు చేశాడు. ప్రధాన న్యాయమూర్తిన్నీ, సహాయ న్యాయమూర్తిన్నీ ఈ తగాదాను విచారించి, హిందూ ధర్మశాస్త్ర ప్రకారము యుక్త వయస్సురాని పిల్లలకు తండ్రే సరియైన సంరక్షకుడని నిర్ధారణచేసి పిల్లవాడిని తండ్రికి వశపరిచారు. పిల్లవాడు చిన్నవాడే అయినా వాడికి యుక్తా యుక్త వివేచన వున్నదనిన్నీ (చెన్నపట్నం సుప్రీముకోర్టులో తరవాత న్యాయాధిపతియైన బర్టనుగారు చేసినట్లు) వాడిని పరీక్షించి చూడవలసిందనిన్నీ మిషనరీల పక్షపు న్యాయవాది ఆ న్యాయాధిపతులను కోరాడు. పిల్లవాడిని పరీక్షించడం అసమంజసమనిన్నీ అలాగ చేసేటట్టయితే న్యాయం పరిపాలించవలసిన తాము ఆ కుర్రవాడితో ఒక మతచర్చను జరపవలసి వస్తుందనిన్నీ, ఇది కేవలమూ హాస్యాస్పదమనిన్నీ ధర్మపరిపాలన చేయవలసిన న్యాయస్థానము వారు ఈ దేశంలో వున్న వివిధ మతాలన్నింటినీ సమానంగానే చూడాలిగాని, ఒక మతం మంచిదనిన్నీ ఒకమతం చెడ్డదనిన్నీ తారతమ్యాలు నిర్ణయించి పక్షపాతం చూపడానికి వీలు లేదనిన్నీ న్యాయాధిపతులు తీర్మానించారు. ఈ రెండు కేసుల సందర్భంలోను కూడా దేశీయ జన సంఘంలోను క్రైస్తవ మిషనరీలలోనూ కూడా తీవ్రమైన క్రోధము, ఉద్రేకమూ కలిగినయి. తమ మతంలో కలిగిన

హిందువుల హక్కులను సంరక్షించడానికని క్రైస్తవ మిష నరీలు చాలా పాటుపడ్డారు. ఈ సంగతిని సర్ ఎరిస్కిన్ పెర్రీ గారే ఈ కేసులు తరవాత ప్రకటించి నప్పుడు ఒక గమనిక (foot note) లో వ్రాశారు. *

క్రైస్తవులైన హిందూ ముసల్మానులకు వారి కుటుంబములలో గల ఆస్తిహక్కులుపోకుండా కట్టుదిట్టం చేస్తూ 1850లో కుంఫినీ ప్రభుత్వమువారొక శాసనాన్ని చేశారు. దీనినిగురించి గొప్ప ఆందోళన జరిగింది. దీని పూర్వకథ చాలా చిత్రమైనది. హిందూ ధర్మశాస్త్రప్రకారము మత భ్రష్టుడైన వానికి సమష్టికుటుంబముయొక్క ఆస్తిలో హక్కులు లేకుండా పోతాయి. అతనివంతు ఆస్తి తక్కినవారికి సంక్ర మిస్తుంది. మహమ్మదీయ మతప్రకారంకూడా మతాంతరు డైనవానికి వారసత్వ హక్కు లుండవు. కుంఫినీవారు హిందూ దేశంలోని ప్రజల మతాచారాలకు భంగం కలగకుండా పరి పాలిస్తామని అభయము ఇచ్చి వున్నందువల్ల ఈ ధర్మవిధులు అమలు జరుగుతూవుండేవి. వంగరాష్ట్రానికి పరిపాలకుడైన వారన్ హేస్టింగ్సు 1772 లో క్రోడీకరించిన ధర్మస్మృతిలో హిందూ మహమ్మదీయ ధర్మశాస్త్రాలను ప్రమాణంగా అంగీ కరించి అమలు జరిపాడు. ఈ స్మృతి ప్రకారం క్రైస్తమతం పుచ్చుకొన్నవారికి పిత్రార్జితపు ఆస్తిలో హక్కులు లేకుండా పోయినవి. క్రైస్తవమతంలో కలిసినవారికి ఉద్యోగాలు యివ్వబడవని కుంఫినీవారు శాసించారు. అందువల్ల క్రైస్తవ మతంలో కలసినవారికి ఆస్తిలోనూ హక్కులులేక, ఉద్యో

* Cases illustrative of Oriental Life-Perry p. 103.

గాలూ యివ్వకపోతే ఆ మతంలో ఎవరు చేరుతారు? గనక, ఇది చాలా అన్యాయమని క్రైస్తవ మతాభిమానులు గోల చేశారు. 1830వ సం॥ మొదలు హిందూదేశంలో నలుమూలలావున్న క్రైస్తవ మతబోధకులు దీనినిగురించి చాలా ఆందోళనచేశారు. కుంఫినీ డైరెక్టర్ల సభవారికి మహాజరులంపారు. దొరలకూ దేశీయులకూ పుట్టిన యూరేషియను సంకరజాతివారు క్రైస్తవులే గనక వారి కిది చాలా బాధగా వున్నందువల్ల వారు పార్లమెంటులో అర్జీ దాఖలుచేయడానికి 'రికెట్సు' అనే ఆయనను ఇంగ్లాండుకు పంపారు. గవర్నరు జనరలైన విలియం బెంటింకు క్రైస్తవులకు అనుకూలంగా సిఫారసు చేశాడు. దీనిఫలితంగా 1832 వ సంవత్సరపు 7 వ రెగ్యులేషను అనేచట్టం శాసింపబడింది.

వారన్ హేస్టింగ్సు క్రోడీకరించిన ధర్మస్మృతిలోని విధులు కోర్టుకు వచ్చిన పార్టీలలో ఉభయులూ ఒకేమతం వారైనప్పుడు వారి ధర్మశాస్త్రం వర్తిస్తుందనిన్నీ, వారిలో ఒకరు హిందువులూగాక, మహమ్మదీయులూగాక యింకొక మతంవారైనప్పుడు ఆ ధర్మశాస్త్రాలు రెండవ మతంవారి ఆస్తి హక్కులకు భంగం కలిగించేటట్లుగా అమలుజరుపగూడదనిన్నీ యీ చట్టంలో ఒక నిబంధనను చేర్చారు. దీనివల్ల క్రైస్తవులైనవారికి తమ పిత్రార్జితపు ఆస్తిలో హక్కులు పోకుండా బందోబస్తు చేయబడింది.

ఈలోపుగా గవర్నరు జనరలు క్రైస్తవులకు యింకొక వుపకారంకూడా చేశాడు. దేశీయులకు వుద్యోగాలు యివ్వడంలో జాతి మత వివక్షతవల్ల ఏలాంటి తారతమ్యమూ

వుండకూడదని వుత్తరువు చేశాడు. ఇందువల్ల హిందువులకూ తురకలకూ వుద్యోగాలు యిచ్చినా యివ్వకపోయినా, క్రైస్తవులకుమాత్రం వుద్యోగాలు యివ్వడానికి వీలుచిక్కింది. 1833 లో పార్లమెంటువారు కుంఫిణీవారికి మళ్ళీ సట్టా యిచ్చేటప్పుడు యీ సూత్రాన్ని అంగీకరించి శాసనంలో చేర్చారు.

1832 లో వంగరాష్ట్రంలో చేయబడిన 7 వ రెగ్యులేషనుయొక్క నిబంధనలను దేశమంతటికినీ వర్తింప చెయ్యాలని మిషనరీలు చాలా ప్రయత్నించారు. చెన్నపట్నంలో కూడా యిలాంటి శాసనం చేయవలసిందని మిషనరీలు చెన్నపట్నం అధికారులను ప్రోత్సహించగా, వారు కేంద్రప్రభుత్వమువారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. అంతట ఈ లోపుగా చెన్నపట్నం ప్రజలు మేలుకొని, ఇది అన్యాయమని 1845 లో బహిరంగసభలో తీర్మానించి పైవారికి మహజరు లంపి, గొప్ప ఆందోళనచేశారు. ఇందువల్ల ప్రభుత్వంవారు ఈ ప్రయత్నం అప్పటికి విరమించారు.

మళ్లీ కొన్నాళ్లకు ఈ శాసనాన్ని దేశమంతటికీ వ్యాపింప చేయవలసినదని మిషనరీలు ఆందోళన చేయగా 1850 లో ఇలాంటి శాసనాన్ని చేయడానికి కేంద్రప్రభుత్వం వారు నిశ్చయించారు. ఈ చిత్తుశాసనాన్ని యింకా మూడు వారాలకు ప్రచురిస్తారనగానే మిషనరీలు, గవర్నరు జనరలుకు ఒకవుత్తరం వ్రాశారు. "బలవంతంచేసి ప్రజలను క్రైస్తవ మతంలో కలపడానికి ప్రయత్నించడం మా అభిమతం కాదు. మేముచేయవలసినదని కోరేశాసనం ఎవరికీ ఎలాంటిలాభమూ

కలిగించునట్టిదికాదు. ఎవరికీ ఎలాంటి దండనము విధించునట్టి దిన్నీకాదు. క్రైస్తవమతంలో కలియడానికి సంసిద్ధులై వచ్చే వారికి తమ అంతరాత్మ బోధప్రకారం తాముచేస్తే తమ ఆస్తి పోతుందే అనే భయంలేకుండా చేస్తుంది. దీనివల్ల వారి బంధువులకు కూడా ఏలాంటి నష్టమూ వుండదు. అదివరకు వారికి ఎంతఆస్తివున్నదో ఇప్పుడుకూడా అంత ఆస్తివుంటుంది. గాని ఏ మాత్రమూ తక్కువకాదు. తమ మతంలో నుంచి పోయి క్రైస్తవులైనవారిని ఇదివరకటి వరకూ వేడిపిస్తూవున్న హిందూవులూ, మహమ్మదీయులు దీనివల్ల నష్టముపొందుతా రనే పిచ్చి అపోహలకు లోనుగాక, తమ కార్యాలోచన సంఘంవారు ఈ చిత్తుచట్టాన్ని వెంటనే శాసనము చేయవల సినదని కోరుతున్నాము" అని మిషనరీలు వ్రాశారు. *

ఈ చట్టంచేయడం చాలా అన్యాయమని దేశంలోని హిందువు లందరూ పార్లమెంటు వారికి అర్జీలు యిచ్చు కున్నారు. "ఇప్పుడు తమకు అర్జీ యిచ్చుకున్న మనవిదారుల మైన మేము వంగరాష్ట్రములోనూ, బీహారు ఒరిస్సా రాష్ట్రా లలోనూ నివసించే ప్రజలై యున్నాము. ఈచట్టము హిందూ సంఘానికి వేరుపురుగు వంటిదని మనవిచేస్తున్నాము. ఎలాంటి ప్రపంచ జ్ఞానమూ లేని చిన్నపిల్లలు క్రైస్తవమతంలో కలిసి నప్పుడు వారికి కలిగే కష్టములు మేము ఎరగనివారముకాము. కాని క్రైస్తవులైనంత మాత్రంచేత ఇలాంటి ప్రత్యేక శాసన విధియొక్క లాభాన్ని పొందడానికి వారికి అర్హతలేదు. తమ

---

* India as it ought to be. Major William Hough (1853)

దేశీయులమతాన్ని విసర్జించినందువల్ల వీరిలో చాలా మందికి ధనవంతులు కావడానికి ప్రత్యేక సదుపాయాలు కలుగుతున్నాయి. ఇలాంటి అవకాశాలు హిందువులుగా వున్న వారికి లేవు.

ఒక హిందువుయొక్క కుమారుడు క్రైస్తవుడైతేగాని, వర్ణభ్రష్టుడైతేగాని శాస్త్ర ప్రకారము ఆ హిందువు మళ్ళీ ఒక కొడుకుని దత్తు చేసుకొనవచ్చును. ఆ దత్తుడికి ఆ ఆస్తితో ఔరసుడికి వుండే అన్ని హక్కులూ వుంటాయి. ఈ కొత్త శాసనము ఆ ఆస్తిలో కొంత వర్ణభ్రష్టుడికి చెందజేస్తూ వున్నందువల్ల ధర్మశాస్త్ర ప్రకారము దత్తుడికి చెందవలసిన ఆదాయాన్ని లేకుండా చేస్తున్నది. హిందువులకు ఉత్తరగతుల కోసం ఏర్పడిన దత్తతాధికారానికి కూడా యిది భంగం కలిగిస్తూవున్నది" అని యింకా చాలా సంగతులు మనవిచేస్తూ పెద్ద అర్జీ యిచ్చుకున్నా లాభంలేకపోయింది.

ఇది నిజంగా హిందూమతంమీాద ప్రయోగించడానికి క్రైస్తవులకోసం ప్రత్యేకంగా నిర్మించబడిన అస్త్రమే అనడానికి ఎంతమాత్రమూ సందేహంలేదు. దేశప్రజలందరూ దీనిని ప్రతిఘటించారు. బ్రిటిషుపరిపాలనలో ఏకాలంలోనూ ఏ సందర్భంలోనూకూడా వంగరాష్ట్రంలోనూ, బీహారులోను, ఒరిస్సాలోను గల హిందువులు ఇంత ఏకగ్రీవంగానూ, ఇంత పట్టుదలతోనూ ముందుకువచ్చి శాసనం చేయవద్దని ఇంత తీవ్రంగా ప్రతిఘటించలేదు. వీరు కంఫినీ డైరెక్టర్లబోర్డు వారికి సమర్పించిన మహజరులలో ఇదివర కెప్పుడూ ఇంత కఠినమైన భాషను ఉపయోగించలేదు. కలకత్తాలో ఒక

మహాసభచేసి ఒక మహాజరును పంపడానికి తీర్మానించారు. దీనినిగురించి ఆందోళన చేయడానికి ఒక (కమిటీ) ఉప సంఘాన్ని నియమించారు. దీనికి హరిమోహనసేనుగారిని కార్యదర్శిగా నియమించారు. ఈయన మూడు సంవత్సరాలు ఈ విషయమై చాలా కష్టపడి పని చేశారు. *

త్వరలోనే ఈ శాసనాన్ని పురస్కరించుకొని కుంపినీ న్యాయాధిపతులు చాలామంది, క్రైస్తవులైనవారికి ఆస్తి హక్కులు స్థిరపరచడమేకాక క్రైస్తవులైనవారి మైనరు పిల్లలను, భార్యలను కూడా వారికి వశంచేయడం ప్రారంభించారు. వీరిలో ముఖ్యులు చెన్నపట్నం సుప్రీముకోర్టు న్యాయాధిపతి బర్టన్‌గారు. బొంబాయి సుప్రీముకోర్టు ప్రధాన న్యాయమూర్తి యయిన సర్ ఎర్‌స్కిన్ పెర్రీగారు ఇది చాలా అన్యాయమనిన్నీ, అనుశ్రుతమైన ధర్మానికి విరుద్ధమనిన్నీ కొన్ని పెద్దవ్యాజ్యముల సందర్భములో తీర్మానించారు. *

ఆ కాలంలో న్యాయపరిపాలనలో కూడా క్రైస్తవ మత పక్షపాతం ఎంతవరకు వ్యాపించిందో తెలియడానికి జార్జి కాంబెల్ అనే ఆయన 1852లో ప్రకటించిన పుస్తకంలో ఒక చిన్న ఉదాహరణం యిచ్చాడు. కొన్ని సంవత్సరాల క్రిందట కాశీలో ఒక తమాషా కేసు వచ్చింది. ఒక

---

* The Modern History of Indian Chiefs, Rajahs, Jamindars etc. by Lokenath Ghose. (Life of Hari Mohan Sen) 1881.

* Cases illustrative of Oriental Life. Sir Erskine Perry, pp 103; 516; 520;

సంకరజాతివాడు ఒక సంసారపు స్త్రీతో వ్యభిచరించినందుకు కొన్నాళ్ళు ఖైదు అనుభవించేటట్లు శిక్షపడ్డాడు. అంతట అతడు తాను క్రైస్తవుడననిన్నీ, కరుణించవలసిందనిన్నీ ప్రభుత్వానికి అర్జీ యిచ్చుకున్నాడు. అప్పుడు క్రైస్తవుడనే కారణంవల్లనే గవర్నమెంటువారు అతని శిక్ష మాఫు చేశారు! *

క్రైస్తవులైనవారి హక్కులచట్టం శాసనమైన తరవాత చెన్నపట్నం సుప్రీముకోర్టులో విచారణకువచ్చిన ఒక కేసులో న్యాయాధిపతి అయిన సర్ విలియంబర్టనుగారు ఒక పక్షవాతపు తీర్పు యిచ్చారు.

క్రైస్తవమతంలో కలిసిన శ్రీనివాసన్ అనే బ్రాహ్మణుడి భార్య లక్ష్మిఅమ్మాళ్ళు అనేఆమె తనభర్తతో కాపురం చెయ్యడానికి నిరాకరించింది. అప్పుడు భర్త తన భార్యను తనకు వశంచెయ్యవలసిందని చెన్నపట్నం సుప్రీంకోర్టులో హేబియసు కార్పసు పిటీషను దాఖలు చేశాడు. కోర్టువారి వుత్తరువు ప్రకారం ఆ పిల్లను 7-6-1851 వ తేదీన సుప్రీముకోర్టులో హాజరు పరిచారు. క్రైస్తవుడైనప్పటికీ భర్తను అనుసరించడం భార్యకు పరమధర్మమునుమీా అని న్యాయాధిపతి బర్టనుగారు ఆ పిల్లకు బుద్ధిచెప్పి భర్తదగ్గిరికి వెళ్ళమన్నారు. ఆ పిల్ల వెళ్ళనని నిరాకరించింది. అంతట బర్టనుగారు అక్కడవున్న తెల్ల కానిస్టేబిలును పిలిచి ఆపిల్లను తన గదిలోవున్న ఆమెభర్తదగ్గరికి బలవంతంగా పంపించారు. ఆ కానిస్టేబిలు ఆ పిల్లను పట్టుకుని

---

* Modern India- By (Sir) George campbell 1852; pp. 366.

తీసుకొని వెడుతూవుంటే ఆ పిల్ల మొర్రో అని గోలపెట్టింది. ఆ పిల్ల మేనత్త అరుస్తూ జుట్టు పీక్కుని ఏడుస్తూ ఆ పిల్ల దగ్గరకి వెళ్ళబోయింది. అంతట ఇద్దరు బంట్రోతులు ఆవిడను బలవంతంగా ఆపుచేశారు. ఇదంతా చూసి ఆ కోర్టు ఆవరణలో చేరిన కొంతమంది బ్రాహ్మలు గత్తరచెయ్యడం ప్రారంభించారు. అప్పుడు పోలీసువాళ్ళు వాళ్ళను చెదరగొట్టారు.

బొంబాయి సుప్రీముకోర్టులో ఎక్సపార్టీ బలరాం గణవత్ అనే కేసులో సరిగ్గా చెన్నపట్నం కేసులో లాంటి సందర్భములుగల వ్యవహారమే విచారణకురాగా అక్కడి న్యాయమూర్తి అయిన సర్ ఎరిస్కిన్ పెర్రీగారు చెన్నపట్నం సుప్రీం కోర్టులో బర్టనుగారిచ్చిన తీర్పు అన్యాయమని ఖండిస్తూ దాని ప్రకారం తాను తీర్మానించడానికి నిరాకరించారు. వారు తమ తీర్పులో ఇలాగ వ్రాశారు: "తురుష్క దేశంలో వుండే ఏ ఆంగ్లేయుడో మహమ్మదీయ మతం పుచ్చుకుని ఆ మతాచారాన్ని బట్టి నలుగురు భార్యలను సిక్కాకట్టుకో దలచినాడనుకోండి; అప్పుడతని క్రైస్తవభార్య దానికి అసహ్యపడి అతనితో కాపురం చెయ్యడానికి నిరాకరించిం దనుకోండి. అప్పుడు న్యాయస్థానంవారు ఆవిడను బలవంతంగా భర్త దగ్గిరికి పంపించవచ్చునా? తెల్లవారి లోకధర్మమూ, నల్లవారి లోకధర్మమూ వుండకూడదు" అని పెర్రీగారు నిష్పక్షపాతంగా ధర్మనిర్ణయం చేశారు. *

---

* Cases illustrative of Oriental Life, decided in the Supreme Court of Bombay. by Sir Erskine Perry (1859) pp. 516–520.

# దేశీయ ప్రజా సంఘాలు

పాత చెన్నరాజధానిలో లాగనే వంగరాష్ట్రంలో కూడా పూర్వపు రాజులూ, నవాబులూ యిచ్చిన అగ్రహారాలు, శ్రోత్రియాలు, మొఖాసాలు, జాగీరులు మొదలైన యీనాములను చిరకాలంనుంచి లఖిరాజు అనగా శిస్తులు లేకుండా అనుభవిస్తూవున్న ఈనాముదారులు వేలకొద్దీ వున్నారు. తూర్పు ఇండియా కుంపిణీవారి పరిపాలన వచ్చిన తరువాత ఈనాములను మన్నిస్తామనిన్నీ, ఏ ఈనాము అయినా చెల్లకూడదని అనుమానంతోస్తే న్యాయస్థానాలలో వారికి హక్కులులేవని స్థిరపరచిగాని, ఆ యీనాములకు పూరాశిస్తు కట్టమనిన్ని, 1793 లో 19 వ రెగ్యులేషనులో వాగ్దానం చేశారు. అయితే ఇప్పుడు 1828 సంవత్సరపు 3 వ రెగ్యులేషను అనే కొత్తశాసనం ప్రకారం కలెక్టర్లకు ఈనాముల విషయంలో నిరంకుశములైన అధికారాలిచ్చారు. దీనినిబట్టి ఒక యీనాముదారుడి హక్కులు సరిగాలేవని కలెక్టరు అభిప్రాయపడే యెడల న్యాయస్థానంలో దావావేయ నక్కర్లేకుండానే ఆ కలెక్టరే ఆ యీనామునుగురించి విచారణ జరిపి దానిని లాక్కొని ఆ భూమికి పూరాశిస్తు కట్టవచ్చును. ఈ కలెక్టరు తీర్పుకు కోర్టుడిక్రీవంటి అధికార బలమే వుంటుందనిన్నీ, దీనిని గురించి అతడు జరిపే చర్యలను రివిన్యూబోర్డు

వారికికూడా పంపించ నక్కరలేదనిన్నీ, యీనాముదారులు కావలిస్తే స్పెషల్ కమిషనర్లకు అప్పీలు చేసుకోవచ్చుననిన్నీ అలాగ అప్పీలు చేసుకొన్నా, చేసుకోకపోయినా దానితో నిమిత్తం లేకుండా కలెక్టర్లు తమ తీర్మానాన్ని అనుసరించి ఆ యీనాము భూములకు పూరాశిస్తు కట్టి ఆ భూములను జప్తుచేసి ఆ సొమ్ము వసూలు చేయవచ్చువనిన్నీ శాసించారు. ఈ రెగ్యులేషనువల్ల ప్రజలలో చాలా భయం కలిగింది. ఈ శాసనవిధులు చాలాకఠినమైనవిన్ని అక్రమమైన విన్ని అని ప్రజలు అర్జీ యిచ్చుకున్నారు. దీనిని గురించి రాజా రామమోహనరాయలుగారు, ద్వారకనాథ ఠాకూరుగారు, ప్రసన్నకుమార ఠాకూరుగారున్నూ కలిసి తీవ్రంగా వంగ రాష్ట్రము, బీహారు, ఓఢ్రరాష్ట్రముల ప్రజలతరఫున గవర్నరు జనరలైన విలియం బెంటింకు ప్రభువుకు సమర్పించిన గొప్ప మహజరును వ్రాసినది రామమోహనరాయలవారే. ఇది ఏషియాటిక్ జర్నలుయొక్క ప్రథమ సంపుటంలో అచ్చుపడి వున్నది.*

కుంపినీ డైరెక్టర్ల సభవారికికూడా రామమోహన రాయలవారు, ప్రసన్నకుమార ఠాకూరు, ద్వారకనాథ ఠాకూరుగారు దీనినిగురించి ఒక అసమ్మతిప్రకటన పంపించారు. ఈ ఆందోళన నిజంగా వంగరాష్ట్రప్రజలు చేస్తూవున్నది కాదనిన్నీ, కేవలమూ ద్వారకానాథ ఠాకూరుగారు, ప్రసన్న కుమార ఠాకూరుగారు, రామమోహనరాయలగారు కలిసి

---

* English works of Raja Ram Mohan Roy, pp 834—37.

చేస్తూవున్న గడబిడ అనిన్నీ ఇక్కడ కేంద్రప్రభుత్వంవారు సీమ అధికారులకు వ్రాశారు!

రామమోహనరాయలవారు 1831 లో ఇంగ్లాండుకు వెళ్ళి పార్లమెంటు సభవారికి ఈ దేశపు రివెన్యూ న్యాయ పరిపాలనలోని లోపాలనుగురించి మనవిచేస్తూ ఈ లఖిరాజు యీనాముహక్కుల విచారణచర్యలను గురించికూడా చెప్పారు. 1828 వ సంవత్సరపు రెగ్యులేషను రద్దుచేయకపోయినా, విలియం బెంటింకుగారు అప్పటిమట్టుకు దానికింద చర్య జరప కుండా ఆపుచేశారు.

రివెన్యూబోర్డు సెక్రటరీగావుండిన రాస్ మాంగిల్సు అనే దొరగారు 1837-'38 సంవత్సరాలలో మళ్లీ ఈ లఖిరాజు యీనాములను లాక్కొనే విషయంలో చర్యలు జరుపడానికి, కేసులు విచారించడానికి అన్ని జిల్లాలలోనూ స్పెషల్ డిప్యూటీ కలెక్టర్లను నియమించాడు. "బెంగాల్ హర్కారు" అనే పత్రికలో ఈ చర్యలు అక్రమమని ప్రసన్నకుమార ఠాకూరు గారు విమర్శించారు. మాంగిల్సుగారు వాటిని సమర్థిస్తూ వ్రాశారు. ఈ వాగ్వాదంలో ప్రసన్నకుమార ఠాకూరుగారి వాదమే ప్రజామోదమును పొందింది.

ఈనాముల రద్దుచర్యలు వంగరాష్ట్ర ప్రజలలో చాలా అసంతృప్తిని కలిగించినాయి. ఇందులో ఇవ్వబడే తీర్పులను పురస్కరించుకుని యీనాములకు పూరా శిస్తుకట్టి దానిని లఖిరాజుదార్లవల్లనూ, జోతీదారులవల్లనూ అతికఠినంగా వసూలుపర్చడం ప్రారంభించారు. శిస్తులు బాగా వసూలు చేశామనే మెహర్బానీ పొందడానికీ, కొంత స్వలాభం పొంద

డానికీ గవర్న మెంటు తాశీల్దారులు ఆడవాళ్ళ చెవుల పోగులు, ముక్కుపుల్లలూ, వుస్తెలూ, పూసలూకూడా తెంపి దౌర్జ న్యాలు చేయడం ప్రారంభించినట్లు అనేకమంది చెప్పుకొని గోలపెట్టారు. ఈఅన్యాయాలను అరికట్టడానికి ప్రసన్నకుమార ఠాకూరుగారూ, ద్వారకనాథఠాకూరుగారూ, వారిమిత్రులూ కలిసి చాలాకష్టపడి పనిచేశారు.

జమీందారీ అసోసియేషను అనే భూస్వాముల సంఘము ఒకటి ద్వారకనాథఠాకూరుగారి కృషివల్లనూ, ఇంకా ఆ కాలంలో సర్కారుఉద్యోగంలో లేని ఇతర దొరల కృషివల్లనూ 1837లో స్థాపింపబడింది. వంగరాష్ట్రంలో ఉండే భూస్వాములహక్కులు సంరక్షించుకోవడానికే ఈ సంఘము స్థాపించబడినా, దాని ఉద్దేశ్యాలూ, కార్యక్రమ ప్రణాళికా ఇంకా విశాలంగా ఉన్నాయి. 1837-వ సంవత్సరం నవంబరు 12 వ తేదీన ఈ జమీందారీసంఘంయొక్క మొదటి సమా వేశం జరిగింది. జాతి మత వర్ణ కుల దేశవివక్షత లేకుండానూ, ఏలాంటి సంకుచితభావమూ లేకుండానూ భూమిలో హక్కుగల ప్రజలందరూ దీనిలో సభ్యులుగా వుండేటట్లు సార్వజనీనమైన ఉదారసిద్ధాంతాలతో ఈ సంఘం స్థాపించబడేటట్లు నిశ్చ యించారు. ఆ కాలం నాటికి దేశంలో వున్న రాజకీయ ప్రజాసంఘ మిది వక్కటే.

బ్రహ్మసభలో సభ్యులై సంస్కరణవాదులుగా వుండి ప్రజాక్షేమంకోసం పాటుపడుతూవున్న ప్రసన్నకుమార ఠాకూరుగారివంటి కొందరు పెద్దమనుష్యులు గల ఒక ఉప సంఘాన్ని ఈ సభవారు నియమించారు. దీనిలో దేశీయులూ,

ద్వారకానాథ్ తాకూరుగారూ సభ్యులై దాని కృషికి తోడ్పడ్డారు. ఆ కాలంలో సంస్కర్తల పక్షానికి వ్యతిరేకంగా వుండిన సనాతనవాదుల పక్షంవారి ధర్మసభాధ్యక్షుడైన రాజా రాధాకాంత దేవుగారు కూడా ఈ సంఘములో సభ్యుడైనందువల్ల నే ఈసంఘం ప్రజాదరణ కెంతపాత్రముగా వుండేదో తెలుస్తుంది. బెంగాల్ బ్యాంకిలో దివానుగా వుండిన రామకమలసేను గారును, ఆయన తరువాతి ఆవుద్యోగం చేసిన ఆయన కుమారుడు హరిమోహనసేనుగారునూ కూడా దీనిలో సభ్యులు.

లఖిరాజు యీనాములను కుంఫినీవారు రద్దు చేస్తూ వున్నందుకు ఈ జమీందారీ సంఘము అసమ్మతిని సూచిస్తూ ఆందోళన జరిపింది. ఈఆందోళనలో కలకత్తా సుప్రీముకోర్టులో బ్యారిస్టరుగా వుండిన లీత్ (Lieth) గారు కూడా పాల్గొన్నారు.

ప్రసన్నకుమారఠాకూరుగారు చనిపోయినప్పుడు జరిగిన సానుభూతి సభలో మాట్లాడుచూ రాజేంద్రలాలు మిత్రగారు ఈ జమీందారీ సంఘము యొక్క ప్రాముఖ్యతను గురించి చెప్పారు.

"ప్రసన్నకుమార ఠాకూరుగారు జమీందారీసంఘానికి కార్యదర్శిగా వున్నారు. వీరు బ్రిటిషు ఇండియా అసోసియేషను స్థాపించిన వారిలో ఒకరు. ఈ సంఘము దేశ స్వాతంత్ర్యానికి దారిచూపినదని నా అభిప్రాయము. ప్రజలు తమ హక్కులకొరకు శాసనబద్ధములైన మార్గాల ద్వారా పోరాడే పద్ధతిలోను తమ కోరికలను అభిప్రాయాలను వెల్లడించే పద్ధతులలోనూ ఈ సంఘము ప్రజలకు ప్రథమ పాఠా

లను బోధించింది కేవలము జమీందారుల హక్కులకోసమే ఈ సంఘము పాటుపడుతూ వున్నట్లు పైకి కనబడినా, జమీందారుల హక్కులు రైతుల హక్కులతో పెనవేసుకొని వున్నందువల్ల యిది విడదీయడానికి వీలులేనిది గనుక ఒకరికి క్షేమకరమయినది రెండవవారికి కూడా క్షేమకరమయిన సంగతిగానే వుంటుంది. ఒకరికి నష్టకరమయినది రెండవవారికిన్నీ నష్టకరంగానే వుంటుంది ఏది ఎలాగవున్నా, కుంఫినీ ప్రభుత్వంవారు యీనాములను రద్దుచేయడానికి జరిపిన చర్యల విషయంలో ఈ సంఘముచేసిన గొప్ప ఆందోళన పెద్ద జమీందారులకంటె చిన్న భూస్వాములకూ రైతులకీ చాలా ఎక్కువగా ఉపకరించింది. ఈ ఉపకారం కలగడానికి మహత్తరమైన కృషిచేసిన వారిలో ప్రసన్న కుమార ఠాకూరుగారు ఒకరు"అని రాజేంద్రలాలుమిత్రగారు అన్నారు.*

1898 వ సంవత్సరం ఆ ఘుమాయున ప్రసన్న కుమార ఠాకూరుగారును ద్వారకనాథ ఠాకూరుగారునూ ఇతర మిత్రులును కలిసి ఒక మహాసభను సమావేశపరచారు. చాలా కాలం వరకూ "లఖిరాజుదార్ల మహాసభ"అని దానిని చాలామంది వ్యవహరిస్తూవుండేవాళ్లు. వంగరాష్ట్రంలో

---

* Bengal Orators Compiled for the National Guardian. Calcutta pp 62-83.

Rajendralal Mitra's Speeches by Jogeswar Mitra. S. K. Lahiri (Calcutta) (1892) pp 25.

Rise and Growth of the congress C. F. Andrews and Girija Mukurjee. pp 98-99.

The Modern History of Chiefs, Rajahs, Zamindars etc (Life of Prasanna Kumar Tagore) Lokenath Ghose (1881) pp 205-207

చాలా పక్కల నుంచి చాలామంది ఆ సభకు వచ్చారు. ఈ మహాసభ పురమందిరం మేడ క్రిందిభాగంలో జరిగింది. దానిలో మనుష్యులు క్రిక్కిరిసిపోయారు. స్థలం చాలక చాలా మంది బయటరోడ్డుమీద నిలుచున్నారు. జనసమూహం ఎక్కువై చందపాల్ ఘాటు దగ్గరనుంచి గవర్నమెంటు హౌసు గేటుదాకా రోడ్డు అంతా ప్రజలతో క్రిక్కిరిసిపోయింది. రాజా రాధాకాంతదేవుగారిని ఏకగ్రీవంగా ఆ సభకు అగ్రాసనాధిపతిగా ఎన్నుకొన్నారు. కలకత్తా బారిష్టరు లీత్ దొరగారూ, ఇంకా యితర న్యాయవాదులూ ఆరోజులలో ఈ ఉద్యమానికి తోడ్పడుతూ గొప్ప ఉపన్యాసాలు చేశారు. ఈ సభలో ద్వారకనాథ ఠాకూరుగారు ఇలాగ మాట్లాడారు. "ఆర్యులారా! మహమ్మదీయుల ప్రభుత్వం అనాగరికుల ప్రభుత్వమని మనం అంటూవుండడం పరిపాటి అయింది కాని, ఈ చిత్రం చూశారా? ఈ అనాగరిక ప్రభువులు విద్యాపోషణ కోసమూ, మత ధర్మాలకోసమూ యిచ్చిన యీనాములను ప్రపంచంలోకల్లా మాదే నాగరిక ప్రభుత్వమని చెప్పుకునే ఈ క్రైస్తవ కుంఫినీ ప్రభుత్వం లాక్కుంటూ వున్నది!" అనేటప్పటికి ఆ విశాలమైన పురమందిరంలో అన్ని పక్కల నుంచీ ప్రజలు చప్పట్లు చరిచి తమ మనోభావాన్ని స్పష్టంగా వెల్లడించారు. ఆ సభలో ప్రసన్న కుమారఠాకూరుగారు ఉపన్యసించలేదుగాని, ఈ ఉద్యమానికంతకూ ఆయనే మూల కారకుడుగా వుండి దానిని చక్కగా నిర్వహించడానికి తోడ్పడ్డారు.

ఈ ఆందోళన యిలాగ జరుగుతూవుంటే, అప్పటి ప్రభుత్వంవారి మనోభావాలు ఎలా వున్నాయి? ఎప్పటికప్పుడు

వారు యీ ఆందోళనను కనిపెట్టి చూస్తూనేవున్నారు. అప్పటి గవర్నరు జనరలు ఆక్లండు ప్రభువు ఈ గడబిడ అంతా చూసి ప్రజలు చెలరేగి అల్లరి చేస్తారనిన్నీ, బహుశా గవర్నమెంటు భవనాన్ని ముట్టడిస్తారనిన్నీ భయపడ్డాడు. అందువల్ల ఆయన కలకత్తాలో వున్న మేజస్ట్రేటుల నందరినీ పురమందిరం దగ్గర వుండవలసిందని ఉత్తర్వు చేశాడు. వందలకొద్ది తెల్లపోలీసువారిని నల్లపోలీసువారిని గవర్నమెంటు భవనానికి వచ్చేరోడ్డుకి రెండు పక్కలా బారులు తీర్చి నిలబెట్టాడు. గవర్నరు జనరల్ ఆయన కార్యదర్శులతో గవర్నమెంటు భవనంలోవుండి ఆ సభలో ఏమి జరుగుతూవున్నదో అనే ఆదుర్దాతో అరగంట కొకమాటు సమాచారం తెప్పించుకొంటూ వున్నాడు. ఈ మహాసభయొక్క ఫలితంగా 50 బీగాలకు లోపు విస్తీర్ణంగల లఖిరాజు ఈనాములను మినహాయించవలసినదని ప్రభుత్వంవారు ఒక తాఖీదు చేశారు. ఈ విధంగా చిన్న భూస్వాములు బ్రతికిపోయారు. *

బెంగాల్ బ్రిటిషు ఇండియా సొసైటీ అనే ప్రజాసంఘం 1843 వ సంవత్సరం ఏప్రిల్ 20 వ తేదీన స్థాపించబడింది. కలకత్తాలో గొప్పరాజకీయ నాయకులుగా పేరు పొందిన రామగోపాల ఘోషుగారు, జార్జితాంప్సన్ అనే దొరగారితో కలిసి ఈ సంఘాన్ని స్థాపించారు. ఈ సంఘానికి తాంప్సన్ గారే అధ్యక్షులుగా వున్నారు. దాని కార్యదర్శి ప్యారీ చంద్ర మిత్రగారు. బంగాళా బ్యాంకి దివాను రామకమల సేనుగారి

---

* Prasanna Kumar Tagore - The Modern History of Indian Chiefs, Rajahs, Zamindars etc. Part II The Native Aristocracy and gentry by Lokenath Ghose, Calcutta. (1881) pp 205-207)

కుమారుడు హారిమోహన సేనుగారు మొదలైన దేశీయ పెద్ద మనుష్యులు, కొందరు దొరలూ కూడా దీనిలో సభ్యులుగా వున్నారు.

బ్రిటిషు ఇండియా ప్రజలయొక్క స్థితిగతులను గురించీ దేశంయొక్క సంపదను గురించీ, ఆదాయాన్ని గురించీ సరియైన సమాచారాలు సమకూర్చి ప్రకటించడమూ, దేశ ప్రజలలో అన్ని తరగతులవారి యోగక్షేమాలకు తోడ్పడి, అభివృద్ధి చేయడానికీ, ప్రజల హక్కులను కాపాడడానికీ, శాంతియుతంగానూ, ధర్మబద్ధంగానూ ప్రయత్నించడమూ ఈ సంఘం యొక్క వుద్దేశ్యం. ఈ బ్రిటిషు రాజ్యాలను పరిపాలించే ఆంగ్ల రాజుగారియందు ప్రభుభక్తిని కలిగియుండే విషయంలోగాని, ఆయన ప్రభుత్వానికీ, శాసన ధర్మాలకూ విధేయులైయుండే విషయంలోగాని ఏలాంటి విరోధమూ లేకుండా వుండేపద్ధతులనే అవలంబించడానికి ఈ సంఘంవారు నిశ్చయించారు. దేశము యొక్క శాంతికి భంగం కలిగించే పనులుగాని, ప్రభుత్వము యొక్క అధికారానికి భంగంకలిగించే పనులను గాని హర్షించకుండా వుండడానికిన్నీ నిశ్చయించారు.

ఈ సంఘమువారు దేశ స్థితిగతులను గురించి చాలా సంగతులు సేకరించారు. వాటినిబట్టి ప్యారీ చంద్ర మిత్రగారు జమీందారులకూ రైతులకూగల పరస్పర సంబంధాలను గురించీ, హక్కులను గురించీ, కలకత్తా రివ్యూ అనే పత్రికలో

ఒక అమూల్యమైన వ్యాసాన్ని వ్రాశారు. ఇది అప్పట్లో గొప్పసంచలనం కలిగించింది ×

---

× (Rajendranath Mitra's Speeches Raibahadur Jogesh Mitra. S. K. Lahiri Calcutta (1892) p. 25; Rise and Growth of Congress C F. Andrews and Girija Mukarjee p. 99, Lives of Peary Chander Mitra, Hari Mohan sen and Ramgopal Ghose in The Modern History of Indian Chiefs, Rajahs, Zamindars etc. by Lokenath Ghose, Calcutta (1881)

# మహాసభలు - మహాజరులు

స్కాట్లాండు దేశపు చర్చి మిషనుసొసైటీవారి మిషనరీ అలెగ్జాండర్ డఫ్ అనే ప్రతిభాశాలి 1830 లో కలకత్తాకు వచ్చి తన క్రైస్తవ మతప్రచారం అతి చతురతతో సాగించాడు. తాను బోధించే పాఠాలద్వారా హిందూమతాచారాలను గురించి పిల్లలకు అపనమ్మకమూ, అసహ్యమూ కలిగేటట్లు చేశాడు. క్రైస్తవులు గాకపోయినా శుష్కవేదాంతులుగా చేయగలిగాడు. త్వరలోనే అతని కృషి ఫలించి, కులీన బ్రాహ్మణ యువకులు క్రైస్తవ మతంలో కలిశారు. ఇతడు గవర్నరు జనరలైన విలియం బెంటింకును లోబరచుకొని క్రైస్తవ మతప్రచారానికి ప్రోద్బలం కలిగించే శాసనాలు, వుత్తర్వులు చేయించాడు. హిందూమతానికి, క్రైస్తవ మతానికి, 1850వ సంవత్సరం వరకూ ఇతని నాయకత్వం కింద తీవ్రమైన పోరాటం జరిగింది జార్జి స్మిత్తు అనే ఆయన వ్రాసిన డఫ్‌గారి జీవిత చరిత్రలో ఇది బాగా వివరించబడింది.* వంగరాష్ట్రంలో క్రైస్తవ మిషనరీలూ, కుంఫిణీ అధికారులూ ఇలాగ ప్రజలకు వ్యతిరేకులుగావున్నా ఇక్కడ కొందరు దొరలు ప్రజలను నీచంగా చూస్తూవున్నా బారిష్టర్లూ, ఇతర

---

* Life of Alexander Duff by George Smith (2 Vols.) 1879.

వృత్తులు చేసుకునే దొరలూ, భూస్వాములుగానూ కోటల యజమానులుగానూ వుండే దొరలు కొందరు, ప్రజలతో కొంతస్నేహంగానే వుండేవారు పూర్వపు నవాబులిచ్చిన లాఖిరాజు ఈనాముల పట్టాలను పరిశీలించి తమహక్కులు రుజువుపరుచుకోలేని భూస్వాముల యీనాములు తీసివేయా లని కుంఫిసీవారు 1828 లో ప్రయత్నించారు. దీనిని గురించి రాజా రామ మోహనరాయుంగారు ద్వారకనాథ ఠాకూరు ప్రసన్నకుమార ఠాకూరుగార్లు ఆందోళన చేశారు. అందువల్ల కొన్నాళ్ళు వూరుకొని కుంఫిసీవారు మళ్ళీ దానిని అమలులో పెట్టారు. శిస్తులు వసూళ్లలో చేసే జబర్దస్తీలు హింసలు మితి మీరినవి. అంతట 1837 లో జమీందారీ అసోసియేషను అనే ప్రజాసంఘం స్థాపించి కొంత ఆందోళన చేశారు. ద్వారక నాథఠాకూరుగారు అప్పటినాయకులు.*

వంగరాష్ట్రపు బ్రిటిషు ఇండియా సొసైటీ అనే ప్రజా సంఘం ఒకటి కలకత్తాలో 1843 లో స్థాపించబడింది రామ గోపాల ఘోషుగారు మొదలైనవారు అందులో సభ్యులు. ఆకాలంలో మన దేశంలోవుండే దొరలలో (Lieth) లీత్ గారు, థాంప్సనుగారు మొదలైన భూస్వాములు బారిస్టర్లు కొందరుకూడా ఆ రెండు సంఘాలలోనూ సభ్యులై దేశీయు లతోపాటు కుంఫిసీవారి చర్యలను విమర్శించి ప్రజాసేవ చేశారని పైన చెప్పియున్నాను. అయితే 1850 లో విదేశీయు

---

* Life of Prasannakumar Tagore Modern History of Indian Chiefs, Rajahs, Zamindars etc. Lokenath Ghose (1881) (pp 205–207)

ాకూ తెల్లవారికీ అభిప్రాయభేదం కలిగిన సందర్భం ఒకటి తటస్థించింది

ఈ దేశంలో నేరాలు విచారించడానికి కుంపినీవారు జిల్లా కలెక్టర్లనే మేజస్ట్రేటులుగా నియమించారు. ఈ కోర్టులపైన అప్పీళ్లను విచారించడానికి 'సదరు' కోర్టులనుకూడా స్థాపించారు. అయితే ఈ దేశంలోని దొరలుచేసే నేరాలను విచారించడానికి వీటికి అధికారంలేదు. పార్లమెంటువారి అధికారం క్రింద కలకత్తా, బొంబాయి, చెన్నపట్నం రాజధాని నగరాలలో స్థాపింపబడిన సుప్రీము కోర్టులకే ఆ అధికారంవుండేది. దీనివల్ల ఒక తెల్లవాడు దేశంలో ఎక్కడైనా నేరంచేస్తే ఆ రాజధాని నగరాలలో కేసు దాఖలు చేయవలసి వచ్చేది. ఇలాగ తెల్లవారు కుంఫినీ అధికారానికి లోబడకుండావుండే విచక్షణ తీసివేయదలచి 1850 లో గవర్నరు జనరలు కవున్సిలు సభ్యులైన బెతూనుగారు ఒక చిత్తు చట్టాన్ని ప్రకటించారు. ఇది గెజెటులో ప్రకటించేటప్పటికి తెల్లవారు హాహాకారాలు చేశారు. తమర్ని నల్లవారితో సమానంగా చేసే చట్టాలు గనుక ఇవి నల్లచట్టాలని వీటిని నిరసిస్తూ ఇవి శాసనం కాకుండా ప్రతిఘటించడానికి దేశంలోవున్న తెల్లవారందరూ ఏకమై సభలుచేసి మహజరు లంపి గొప్ప ఆందోళన చేశారు. అందువల్ల ఈ చట్టాలు ఆగిపోయినాయి. రాజకీయ ఆందోళన వల్ల యెంత పని జరుగుతుందో దీనివల్ల ప్రజలకు అర్థమైనది. న్యాయపరిపాలనలో తెల్లవారికి, నల్లవారికి ఇలాంటి భేదం వుండడం న్యాయంకాదని కలకత్తా దేశీయ నాయకులయిన రామగోపాల ఘోషుగారు విమర్శించగా ఆయన అగ్రిహార్టీ

కల్చురల్ సొసైటీ ఉపాధ్యక్షపదవిలో వుండడానికి వీలు లేదని దొరలు పట్టుపట్టి రాజీనామా నిచ్చేటట్లు చేశారు. దొరలకూ దేశీయులకూ వైషమ్యాలు పెరిగాయి. *

ఇలాగ కలకత్తాలో దొరలకూ, దేశీయులకూ భేదాభిప్రాయాలు కలిగి వున్నందువల్లను మిషనరీలూ, దొరలూ ఒకటిగా వున్నందువల్లనూ, దేశీయుల క్షేమంకోసం ప్రత్యేకంగా ఒక ప్రజాసంఘాన్ని స్థాపించుకోవలసిన అవసరం కలిగి ది. దీని కింకొక కారణం కూడా తోడైంది.

హిందూదేశాన్ని పరిపాలించడానికి కుంఫినీవారికి పార్లమెంటువారు 1833 వ సంవత్సరంలో యిచ్చిన ఇరవైయేళ్ళ పట్టా 1853 తో అయిపోతుంది మళ్ళీ కొత్తపట్టా యిచ్చే ముందు భారతదేశంలో కుంపినీవారి పరిపాలనను గురించి కొంత విచారణ జరుగుతుంది. ఇదివరకుజరిగిన విచారణలలో కేవలం కుంఫినీ వుద్యోగులే సాక్ష్యాలు యిచ్చేవారు. దేశీయులు కూడా తమ కష్టసుఖాలను గురించి పార్లమెంటువారికి అర్జీలు పంపుకుంటే కొంత లాభంవుంటుందని కూడా అప్పుడు ఈ దేశంలోని వివిధ రాష్ట్రాలలో రాజకీయ పరిజ్ఞానం కలిగిన ప్రజానాయకులకు తోచింది. చెన్నపట్నంలో గాజుల లక్ష్మీనరసుగారు అదివరకే స్థాపించి పనిచేస్తూవున్న మద్రాస్ నేటీవ్ అసోసియేషనుద్వారా ఈ పని చేయడానికి వీలుకలిగే వున్నది. గాని బొంబాయిలో అప్పటికి ఇలాంటి దేశీయ ప్రజాసంఘమే

* Life of Ramgopal Ghose-Representative Indians by G. Parameswaran Pillai; Modern History of Indian Chiefs, Rajahs etc. Lokenath Ghose pp. 78-81.

లేదు. కలకత్తాలో వుండిన బ్రిటిషు యిండియా సొసైటీ పైన చెప్పిన అభిప్రాయభేదాలవల్ల స్తంభించినది. అందువల్ల సరిగా పనిచేయడానికి వీలుకలుగలేదు. దేశీయ ప్రజలకుగల కష్టాలను పై అధికారులకు చెప్పుకోడానికి దేశీయ ప్రజా సంఘం ఒకటి అవసరమని కలకత్తా ప్రజా నాయకులైన ప్రసన్న కుమార ఠాకూరుగారు రాజేంద్ర లాలుమిత్రా, రామగోపాలఘోషు మొదలైనవారును భారతదేశంలో పత్రికా నిర్వహణంలో అఖండుడని పేరుపొందిన హరిచ్చంద్రముఖర్జీగారున్నూ నిశ్చయించి 1851 స పత్సరం అక్టోబరు 15 వ తేదీన "బ్రిటిషు ఇండియన్ అసోసియేషన్" అనే ప్రజాసంఘాన్ని కలత్తాలో స్థాపించారు. దీనికి రాజా రాధాకాంతదేవుగారి, అధ్యక్షులుగానూ, దేవేంద్రనాథ్ ఠాకూరుగారిని కార్యదర్శిగానూ నియమించారు.

దేశముయొక్క ఆంతరంగిక పరిపాలనలోను. పార్లమెంటువారు నిర్ణయించిన పరిపాలన విధానములోనూ కొంత అభివృద్ధిని కలిగించే వుద్దేశ్యంతో ఈ సంఘం స్థాపించబడింది. ఈ సంఘం తరపున 1852 లో పార్లమెంటుకొక పెద్ద మహజరుపంపించారు. అందులో ప్రజలకుగల కష్టాలన్నింటినీ వివరించారు. శిస్తులు అత్యధికంగా వుండడము, న్యాయ పరిపాలన బాగా లేకపోవడము, ప్రజల మానప్రాణాలకు ఆస్తులకు రక్షణ లేకపోవడమూ, కుంపినీ వారు అనేక విధాలైన లాభాలు ఆర్జిస్తూవుండడము, ప్రజలు దరిద్రులుగా వుండడము, పరిశ్రమలు అడుగంటడము, ప్రజలలో విద్యాభివృద్ధి లేకపోవడము, పెద్దఉద్యోగాలు ప్రజలకివ్వకపోవడము

మొదలైన **అన్యాయాలను** వివరించారు. దేశవ్యవహారాలను ఇకముందు 12 మంది సభ్యులుగల ఒకసంఘం వశంలో వుంచ వలసినదనిన్నీ, కేంద్రప్రభుత్వం రాష్ట్రీయ ప్రభుత్వాలపైన తనిఖీచేస్తూ రాజకీయ సైనికవ్యవహారాలు మాత్రం జరుపుతూ వుండవలసినదనిన్నీ దేశంలో శాసనాలుచేసే అధికారం పరిపాలకవర్గంవారి చేతులలోగాక, కొంత ప్రజాప్రాతినిధ్యలక్షణాలు గల ఒక సంస్థలో నెలకొల్పవలసినదనిన్నీ కలకత్తాలో 17 మంది సభ్యులుగల శాసనసభను ♦ స్థాపించవలసినదనిన్నీ ఇంకా దేశ పరిపాలనకు సంబంధించిన కొన్ని సంస్కరణలు చేయవలసిన దనిన్నీ ఆ మహాజరులో సూచించారు. సంస్కరణల కోసం అన్ని రాష్ట్రాలవారూ కలిసి ఏకగ్రీవముగా పార్లమెంటును కోరితే బాగా వుంటుందని దేవేంద్రనాథ ఠాకూరుగారు 11-11-1851 వ తేదీన ఒక వుత్తరం వ్రాసి చెన్నపట్నం ప్రజా **నాయకులకు** పంపారు. చెన్నపట్నంలో ఎల్. కూపర్ అనే దొర షెరీఫు. ఇతడు సమావేశపరచిన పురజనుల సభలో ఆ వుత్తరాన్ని చదివి బ్రిటిషు ఇండియా ప్రభుత్వము యొక్క పరిపాలనను చక్కచేయడానికి, ఇంగ్లాండు దేశము యొక్క క్షేమమూ, హిందూదేశ క్షేమము కూడా ఆలోచించడానికి, దేశీయుల స్థితిగతులను అభివృద్ధి చేయడానికి ప్రజలకు బాధ కరంగా వుండే శాసనాలను గురించి పై అధికారులకు మహాజరు

♦ ఈ శాసనసభకు ప్రతి రాజధానిలో నుంచీ మర్యాదస్తులైన ముగ్గురు దేశీయ ప్రముఖులను నియమించవలెననిన్ని సివిలు ఉద్యోగులలో అనుభవముగల ఒక్కరిని నియమించవలెననిన్ని ప్రభుత్వము వారి అధికారమునకు లోబడని ఒక వ్యక్తిని అధ్యక్షుడుగా నియమించవలెననిన్ని వ్రాయబడినది.

లంపడానికి కలకత్తాలోని బ్రిటిషు యిండియన్ అసోసియేషను అనే ప్రజాసంఘానికి ఒక శాఖను స్థాపించడానికి 1852 లో తీర్మానించారు. *

బొంబాయిలో దాదాభాయినౌరోజీ, నౌరోజీఫర్దూంజీ, భావుదాజీగార్లు ప్రజానాయకులుగా వుండి 1852లో బొంబాయి అసోసియేషను అనే ఒక ప్రజాసంఘాన్ని స్థాపించారు. అయోధ్యలోకూడా బ్రిటిషు ఇండియన్ అసోసియేషన్ యొక్క శాఖను అక్కడివారు స్థాపించారు. ఇలాగ ఈ ప్రజాసంఘాలన్నీ కలిపి పనిచెయ్యాలని ఈ దేశభక్తుల ఆశ అయితే ఇందుకు కొన్ని అంతరాయాలు కలిగినందువల్ల ఇది సాధ్యపడలేదు. కాని, వంగరాష్ట్రంలో బ్రిటిషు యిండియన్ అసోసియేషన్ వారును, బొంబాయి ప్రజాసంఘము వారున్నూ, చెన్నపట్నంలో మొదటినుండి ప్రజాసేవచేస్తూవున్న మద్రాసు నేటివు అసోసియేషనువారున్నూ వేరువేరుగా సభలుచేసి తీర్మానాలుచేసి కంపినీ పరిపాలనలో గల లోపాలను గురించి, దేశీయులకుగల కష్టాలను గురించీ మహజరులు పంపి రాజ్యాంగ సంస్కరణలను చేయవలసిన దనిన్నీ, ప్రజలకు కూడా కొంత పలుకుబడి, ప్రాతినిధ్యమూ కలిగించవలసినదనిన్నీ పార్లమెంటువారిని ప్రార్థించారు.

1852 వ సంవత్సరములో కలకత్తా బ్రిటిషు ఇండియన్ అసోసియేషను వారు ఇంగ్లండ్‌లోని పార్లమెంటు వారికి

---

* Rise and Growth of the Congress. C. F. Andrews and Girija Mukerjee pp 97–107.

§ India in the Victorian age R. C. Dutt pp 186-187 Biography of Dadabhai Naoroji by R. P. Masani Chapter V.

పంపిన మహాజరు భారతీయుల రాజకీయ హక్కులను గూర్చిన మొదటి లిఖిత పత్రమని చెప్పవచ్చును. "బ్రిటిషు వారితోడి సంబంధమువల్ల ఈ దేశానికి కలుగుతుందనుకుని ఆశపడిన దానిలో నే మాత్రము లాభమున్ను కలుగలేదని చెప్పుటకు విచారముగానున్నది" అని అప్పట్లో ప్రజలలో వ్యాపించి యున్న భావములను ఇంగ్లాండ్‌లోని పార్లమెంటువారికి స్పష్ట పరుపబడినది.

"పార్లమెంటువారు క్రిందటిసారి కంపెనీవారికి భారత దేశానికి రాజ్యాధికార పట్టా యిచ్చినప్పుడు ఈ దేశ పరిపాలనా విధానములో కొన్ని మార్పులు చేసినమాట నిజమే గాని భారతదేశ స్థితిగతుల ననుసరించి ముఖ్యముగా జరుగవలసిన సంస్కరణములేవీ చేయలేదు" అని చెప్పి తరువాత కొంత కాలమునకు కాంగ్రెస్ మహాసభవారు తమ తీర్మానములలో భారతదేశీయులకు గల అన్యాయములుగా పేర్కొన్న వాటిలో ముఖ్యమైన వానిని కొన్నిటిని ఈ మహాజరులో వివరించినారు. దుర్భరముగానున్న భూమిశిస్తును తగ్గించవలెనన్నారు. న్యాయ పరిపాలనా విధానమును సంస్కరించ వలెనన్నారు. వ్యక్తులకు ప్రాణభయము, ఆస్తిపోవుననే భయము లేకుండా తగు బందోబస్తులు చేయవలెనన్నారు. కంపెనీ వారి సర్వముక్తా యిజారా వ్యాపారములవల్ల ఈ దేశీయులకు కలుగుతూవున్న నష్టములను తొలగించవలె నన్నారు. దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించవలెనన్నారు. ప్రజలలో విద్యాభివృద్ధిని కలిగించవలె నన్నారు. పెద్దపెద్ద ప్రభుత్వోద్యోగములను కూడా భారతీయుల కివ్వవలెనన్నారు. భారతదేశ పరిపాలనా విధానము

నంతటినికూడా ఈ మహాజనులో సింహావలోకనము గావించి, దానిలోని లోపములనుచూపి, దాని యభివృద్ధికి మార్గము లను సూచించినారు. శాసనసభలకుండవలసిన అధికారములు నిర్ణయించినారు ఈ దేశపరిపాలనముపైన పార్లమెంటువారు చలాయించ తగిన అదుపు ఆజ్ఞలను వివరించారు. ఈ దేశ ములో వివిధ మత ధర్మములను సంస్థలను కాపాడెదమని వాగ్దానము చేయవలసినదని కోరినారు. ప్రభుత్వములోని వివిధ శాఖలలోని వివిధ ఉద్యోగముల నిర్వహణములోను పొదుపు చేయతగిన అవకాశములను సూచించినారు ఈ దేశములో అమలు జరుగుచున్న సివిలు క్రిమినలు న్యాయ విధులలోను చర్యలలోను న్యాయ పరిపాలనా విధానములలోను పోలీసు మేజస్ట్రేటు అధికారముల నిర్వహణములోనుగల లోపము లను నిరూపించి, విమర్శించినారు. కంపెనీవారికి సర్వ మక్తాయిజారా అధికారము లుండుటవల్లను ముఖ్యముగా ఉప్పు వర్తకమువారికి ప్రత్యేక ఇజారాగా నున్నందువల్లను ప్రజలకు కలుగుతూవున్న కష్టనష్టములను వివరించి ఈ ప్రత్యేక అధికారములను రద్దుచేయవలసినదని కోరినారు. కంపెనీవారు భూమిపన్నుల ద్వారాను, ఇతర విధము గాను పూర్వకాలపు మహామ్మదీయ పరిపాలనములో కన్న ఎక్కువ సొమ్మునే ఈ దేశీయులవల్ల వసూలుచేస్తూ ఉన్న ప్పటికిని అందులో చాలా స్వల్పపు మొత్తమునే భూమార్గ జలమార్గముల రాక పోకల రవాణాల అభివృద్ధి నిమిత్తము వినియోగించుటలోని అన్యాయమును నిరూపించినారు. ప్రజ లలో విద్యాభివృద్ధి చేయుగలందులకు తగు ఏర్పాటులు చేయక

పోవుటను గూర్చి వగచినారు. హిందువులును మహమ్మదీయులును ఎక్కువ సంఖ్యగాగల ప్రజలను పరిపాలించుట కేర్పడిన ఈ కంపెనీప్రభుత్వము, ప్రజలవల్ల వసూలుచేసిన సొమ్ములో నుంచి క్రైస్తవ మతాధికారులకు జీతము లిచ్చి యీ మతమును ప్రోత్సహించుట అన్యాయమని మొరపెట్టినారు.

బ్రిటీషుఇండియన్ అసోసియేషన్ స్థాపించబడిన వెంటనే దానికి చెన్నపట్నములో నొకశాఖను స్థాపించే విషయమై ఆ సంఘకార్యదర్శియైన దేవేంద్రనాథ ఠాకూరుగారు చెన్నపట్నములోని ప్రజానాయకులతో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపినారు. 1851 వ సంవత్సరము డిశంబరు 11 వ తేదీన ఆయన చెన్నపట్నములోని ప్రముఖులకు వ్రాసిన లేఖవల్ల అప్పటి రాజకీయ వ్యవహారములను గూర్చిన విశేషములు మనకు తెలియుచున్నవి.

అఖిలభారత ప్రజాసంఘము నొకదానిని స్థాపించవలసిన యావశ్యకతను గురించిన్నీ, బ్రిటిషు ఇండియన్ అసోసియేషను యొక్క ఆశయములను గురించిన్నీ దేవేంద్రనాథ ఠాకూరుగారు ఇలాగ వ్రాసినారు: "తూర్పు ఇండియా వర్తక కంపెనీవారి రాజ్యాధికారపట్టా యొక్క మరతుకాలము త్వరలోనే ముగియగలదు గనుక, ఆ విషయమై ఇంగ్లండులోని పార్లమెంటువారికి చేయవలసిన విన్నపములు, దేశములోని అన్ని ప్రాంతములలోను గల దేశీయులును వెనువెంటనే చేయుటవల్లను, వివిధ ప్రాంతాల దేశీయుల పక్షమున వారి ప్రతినిధిగా నొక ప్రజాసంఘమే అట్లు చేయుటవల్లను ఎక్కువ ప్రయోజనకరముగా నుండుననే సంగతిని మీరు

గ్రహించియే యుంటారు. కలకత్తా, ఆగ్రా, బొంబై, చెన్న పట్నములలో నుంచి వేరువేరుగా ప్రత్యేక ప్రజాసంఘములీ విషయములో ఏకీభావము వహించి వేరు వేరు విన్నపములు చేయుటవల్ల ఎంత ప్రయోజనముండునో వేరువేరురాష్ట్రముల యొక్క క్షేమలాభములను ఆలోచించి, వారి కోరికల ననుసరించి ఒక కేంద్ర ప్రతినిధి సంఘమువారు చేసే విన్నపమునకు కూడా అంత ప్రయోజనమే ఉండగలదు. అయితే తక్కిన మూడు రాజధానులలోని దేశీయ ప్రముఖులును బ్రిటిషు ఇండియన్ అసోసియేషన్‌తో ఏకమై పనిచేయుటవల్ల కొన్ని ముఖ్యమైన లాభములున్నవనే సంగతిని మరువకూడదు. ఇందువల్ల ఈ కార్యసాధనము కోసము చేయవలసివచ్చే ఖర్చు చాలా తక్కువ కాగలదు. ఉదాహరణమునకు ఒక కేంద్ర సంఘమున్న యెడల భారతదేశమునకు సంబంధించిన విషయములను పార్లమెంటు వారికి నివేదింపగలందుల కొక ముక్త్యారు ప్రతినిధిని నియమిస్తే సరిపోతుంది. వేరువేరు సంఘములు పనిచేయ దలచిన యెడల వేరువేరు ప్రతినిధులను నియమించవలసి యుండును. మరిన్నీ పరిపాలనా విధానమును చక్కబరుపమని కోరే విషయములో వేరువేరు సంఘములూ వేరువేరు విధములైన సూచనలను చేసే దానికన్న అందరూ కలిసి ఒకే విధమైన సూచనలను చేసిన యెడల (ఇలాగ ఏకగ్రీవముగా చేసిన సూచనలకు) ఎక్కువ విలువ యుండును. మీ రాజధానిలోని సోదర దేశీయులు ఈ బ్రిటిషు ఇండియన్ అసోసియేషలో చేరి పనిచేయటమూ మూలముగాగాని ఈ ఆశయములతోనే మీరొక ప్రత్యేక

ప్రజాసంఘముగా నేర్పడిగాని బ్రిటిషు ఇండియన్ అసోసియేషన్ వారి యుద్యమమునకు మీరు తోడ్పడుదురని తెలుసుకొనుటకు మా సంఘమువారు కుతూహల పడుచున్నారు. మీకు ఇలాంటి యుద్దేశ్యమున్నట్లైతే మాతో నుత్తరప్రత్యుత్తరములు జరిపే ఒక ఉపసంఘమునుగాని ఒక ప్రత్యేక సంఘమునేగాని నిర్మాణము చేయుటలో నెంత మాత్రమున్నూ ఆలస్యము చేయవద్దు. ఏలననగా కంపెనీవారికి మళ్ళీ రాజ్యాధికారపు పట్టానిచ్చే విషయము తక్కున విషయమును గూర్చిన చర్చలు అతిత్వరలోనే ప్రారంభము కానున్నవి" అని వ్రాసినారు. బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ యొక్క ఉద్దేశ్యములను గురించీ అంతవరకు ఆ సంఘమువారు చేసిన పనిని గురించీ కూడా ఆ పుత్తరములో వ్రాసినారు. "ఈ సంఘము యొక్క ఉద్దేశ్యములను కొనసాగించుటలో నీ ప్రాంతములోని దేశీయ ప్రముఖులెంత పట్టుదలను కలిగియున్నారో మీకు తెల్పుటకుగాను ఈ సంఘము మొన్ననేగా స్థాపించబడి ఇందులో నిప్పటికి కొద్ది మంది మాత్రమే సభ్యులుగా చేరియున్నప్పటికిని ఈ స్వల్ప కాలములోనే ఈ సంఘ వ్యవహారములకయ్యే ఖర్చుల నిమిత్తము అప్పుడే 16000 రూపాయులు చందాలవల్ల వసూలైనవనిన్నీ, పోలీసుశాఖ యొక్క క్రమ నిర్వహణమును గురించిన్నీ, దానినినడిపే విషయములో ప్రభుత్వమువారు ఖర్చు పెట్టగలందులకు నిర్దేశింపబడిన సొమ్మును వారితర వ్యవహారముల క్రింద ఖర్చుపెట్టుటవల్ల కలుగుతూ ఉన్న అనర్థకములను గురించిన్నీ ఈ సంఘమువారు శాసనసభవారికి విశద

పరచి పోలీసువ్యవస్థనుగూర్చి చేయబడు శాసనమును గూర్చి కొంత కృషిచేసియున్నారు. ఈ విషయము కేవలమూ ఈ రాష్ట్రమునకు సంబంధించినదే గాక భారతదేశ పరిపాలన కంతకూ ముఖ్యమైన విషయము. ఈ సంగతిని మీకు వ్రాయుమని మా సంఘమువారు నన్ను కోరినారు."

అప్పటి చెన్నపట్నపు షరీఫు (ఎల్. కూపరు) గారు సమావేశపరచిన ఒక మహాసభలో నీ ఉత్తరమును చదువగా ఆ సభవారు బ్రిటిష్ ఇండియన్ అసోసియేషను కొక శాఖా సంఘమును స్థాపించుటకు నిశ్చయించినారు.

---

Proceedings of the Madras Branch of the British Indian Association and of the Deccan Association (London). Mitchell. Printing Charing Cross Road 1852.

Rise and Growth of the Congress Andrews and Mukerjee P. P. 104—106.

# రామ గోపాలఘోష్ ప్రజాసేవ

రామగోపాలఘోషుగారు కలకత్తాలో ఒక చిన్న వర్తకుడైన గోవిందచంద్రఘోషుగారి కుమారుడు. ఆయన 1815 వ సంవత్సరంలో జన్మించారు. హేరుదొరగారి పాఠశాలలో ఇంగ్లీషు చదివి, తన తొమ్మిదవయేట హిందూకాలేజీలో విద్యార్థిగా ప్రవేశించాడు. అక్కడ హెన్రీ లూయీవివియన్ డిరోజియో అనే ప్రతిభాశాలికి ప్రియశిష్యుడై తెలివితేటలు కలిగి, సంఘాన్ని సంస్కరించాలనే భావాలతో పైకివచ్చాడు. రామగోపాలఘోషుగారు 17 వ యేటనే ఒక ఇంగ్లీషు వర్తక కంపెనీలో గుమాస్తాగా ప్రవేశించి, తరవాత కెల్సాల్ ఘోషు కంపెనీలో భాగస్థుడై వ్యాపారంలో విశేష ధనవంతుడైనాడు.

రామగోపాలఘోషుగారు వంగరాష్ట్రంలో ప్రథమ రాజకీయ నాయకులలో ఒకరు. ఆ కాలంలో స్థాపించబడిన భాషాభివృద్ధి సంఘాలలోనూ, రాజకీయ ప్రజాసంఘాలలోను ప్రముఖుడుగావుండేవాడు. ఇతడు ఎకడెమిక్ ఇన్‌స్టిట్యూషను ఎపిస్టోలరీ అసోసియేషను, సొసైటీ ఫర్ ది అక్విజిషన్ ఆఫ్ నాలెడ్జ్ అనే సంఘాలలో సభ్యుడు. దేశీయులకు రాజకీయ పరిజ్ఞానం కలిగించి అభివృద్ధి చెయ్యాలని ఈయన తన సర్వ

కాల సర్వావస్థలలోనూ ఆలోచిస్తూ ఉండేవాడు. రాజకీయ ప్రజాసభలవల్ల, వార్తాపత్రికలవల్ల, ఇంగ్లాండులో ఆందోళనము చేయడమువల్ల ఈ దేశప్రజలకు చాలా లాభం కలుగుతుందని నమ్మి అందుకోసం పాటుపడుతూ వుండేవాడు.

ఈయన 'జ్ఞానాన్వేషు' అనే పత్రికలో వ్యాసాలు వ్రాస్తూవుండేవాడు. తరవాత కొన్నాళ్ళకు ఆ పత్రికకు సంపాదకుడైనాడు. అది ఆగిపోయిన తరవాత స్పెక్టేటరు అనే పత్రికను స్థాపించాడు. అది కొన్నాళ్ళు నడిచి ఆగిపోయింది. అప్పుడాయన దర్పణమనే కొత్త పత్రికను స్థాపించి నడిపాడు. అదికూడా ఎంతో కాలం జరగలేదు. అప్పుడుకూడా ఆయన అధైర్యం జెందక మళ్ళీ 1842 లో ఆ పత్రికను ఉద్ధరించాలనిన్నీ, ఒకమాస పత్రికను కూడా స్థాపించాలనిన్నీ చాలా తంటాలు పడ్డాడు. ఈ విషయాన్ని గురించి ఆయన తన స్నేహితుడికి ఇలాగ వ్రాశాడు: "నెలకు నూరురూపాయలైనా ఖర్చుచేసి మంచి జీతమిచ్చి పత్రికా నిర్వహణానికే కాలాన్నంతా నియోగించే తెలివైన యువకుణ్ణి ఒకడిని నియమిస్తేగాని, మనం రెండు పత్రికలను నడపలేము. ఇలాగ రెండు పత్రికలను నడపడం ఇప్పుడు చాలా అవసరమని నా అభిప్రాయం. మన దేశీయ విద్యాధికులలో విచక్షణా జ్ఞానాన్ని వృద్ధిచేయడానికీ, పాడైపోతూవున్న గ్రంథాలయాలనూ, విజ్ఞానార్జన సంఘాలనూ వుద్ధరించడానికీ స్తబ్ధంగా పడివున్న స్థితిలో నుంచి మనవారిని లేవదీసి. స్త్రీ విద్య, విధవా వివాహాల ఆవశ్యకతను గురించీ, ఇంకా ఇతర విషయాలను గురించీ, చర్చించడానికి ఒక మాసపత్రిక వుండడం చాలా

అవసరం. దీన్ని ఒక విశిష్టమైన సాధనంగా చెయ్యాలి. ఇంక 'దర్పణమో' అది దేశీయ జనసంఘాని కంతటికీ వుపయోగించాలి. అది సులభశైలిలో వుండాలి. ఏమాత్రమూ క్లిష్టంగా వుండకూడదు. విషయాలను గురించి చర్చించేటప్పుడు దీర్ఘములైన తార్కిక చర్చలలోకీ, సిద్ధాంత ప్రతిపాదనలలోకీ దిగకూడదు. సనాతనవాదుల మతాచార విశ్వాసాలకు భంగం కలిగిస్తాయనే అనుమానం కలిగేట్లు వుండకూడదు. దేశీయ జనసంఘాని కంతటికీ వినడానికి కుతూహలంగా వుండే సమాచారాలను ప్రకటించాలి. క్రమక్రమంగా వార్తలయొక్క దృక్పథాన్ని వృద్ధిచేసి వారి మూఢవిశ్వాసాలను తొలగించాలి. వారి మనస్సులలో విజ్ఞానాన్నీ, నాగరికతనూ వెదజల్లాలి. పూర్వము కొంతకాలం నడిచి ఆగిపోయిన దర్పణం పత్రికనే ఆదర్శంగా వుంచుకోవాలి" అని వ్రాశారు.

కలకత్తాలో దేశీయులు కాపురంవుండే పేటలలో సభలు చేసుకోవడానికీ, ఒక పుస్తక భాండాగారం స్థాపించడానికీ, మన చిత్రపటాలూ, శిలావిగ్రహాలూ పెట్టుకోనడానికీ ఒక పురమందిరం వుండాలని రామగోపాల ఘోషుగారు దీన్ని స్థాపించడానికి ప్రయత్నించారు.

ఇంగ్లాండు దేశ ప్రజలకు హిందూదేశ స్థితిగతులను గురించి తెలియజేయగలందులకు అక్కడ ఆందోళన చేయడం అవసరమని రామగోపాలఘోషుగారికి తోచింది. ఈ వుద్దేశ్యంతో ఆయన సీమలోవున్న ఆడం అనే ఆయనతో వుత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. కేవలమూ సభలు చేసినందువల్లనూ, అర్జీలు పంపినందువల్లనూ, ఎక్కువలాభం

వుందనిన్నీ, అవి అన్నీ ఎవరో కొందరు చదువుకొన్నవాళ్లు చేస్తూవున్న గడబిడ అని ఇంగ్లీషువారు అనుకుని ఉపేక్షిస్తారనిన్నీ, దేశీయ ప్రజలకుగల కష్టాలు నివారించుకోవడానికి ప్రజలే కొంత కృషిచేస్తూ వున్నట్లు ఇంగ్లీషువారి మనస్సుకు తట్టి వారి పార్లమెంటు సభవారికి తెలుస్తే ఇక్కడ స్థానిక ప్రభుత్వమువారుకూడా వీటిని గురించి ఆలోచించక తప్పదనిన్నీ రామగోపాలఘోషుగారు ఊహించారు. అందువల్ల ఆయన ఈ దేశ స్థితిగతులను గురించి అనేక సమస్యలను గురించీ పరిపాలనను గురించీ అనేక విషయాలకు సమాచారాలు సమకూర్చి ఆడంగారికి పంపించారు. వాటిలో ఈ క్రింది విషయాలు ముఖ్యమైనవి. పోలీసుశాఖయొక్క నిజస్థితి. అందులో ఉన్న లోటుపాటులు; దానిని చక్కబరిచే మార్గాలు, ఆబ్కారీశాఖలో జరుగుతూవున్న అన్యాయాలు, వంగరాష్ట్ర ప్రజలలో స్వయంకృషి లేకపోవడానికి గల కారణాలు, అది కలిగించే మార్గాలు, దేశంలో జనసంఖ్య పెరుగుతూవున్నదా? తగ్గుతూ వున్నదా? అందుకు కారణ మేమిటి? దేశసంపద వృద్ధి అవుతూ వున్నదా క్షీణిస్తూ వున్నదా? జనసామాన్యముయొక్క సౌఖ్యము అభివృద్ధి అవుతూ వున్నదా లేక వారి అసౌకర్యాలు హెచ్చుతున్నాయా? దానికి కారణాలేమిటి? గ్రామాలలోను, పట్టణాలలోనూ హిందూ మహమ్మదీయ ప్రజలలో నీతి నియమాలు చక్కబడుతున్నాయా, పాడవుతున్నాయా? ఈ విషయంలో ప్రభుత్వ పద్ధతులూ, ప్రజాసంస్థలూ సహకారులుగా వున్నాయా! విరోధకారులుగా వున్నాయా? క్రైస్తవ మతబోధకుల మత ప్రచారం

వల్లనూ చర్యలవల్లనూ దేశంలో కలుగుతూవున్న ఫలితాలూ, అందును గురించి ప్రజలలో వ్యాపిస్తూ వున్న భావాలు, ఇంకా అనేక ఇతర విషయాలను గురించిన్నీ సప్రమాణమైన సమాచారాలను సమకూర్చి సీమ కంపారు.

రామగోపాల ఘోషుగారు ఆ కాలంలో అఖండమైన ప్రజాసేవచేసిన రాజకీయ నాయకులు. అప్పటి ఉద్యమాలన్నింటికీ ఆయన మూలపురుషుడుగా వుండి నడిపిన మహా నాయకుడు - అని అనడంలో అతిశయోక్తి యేమీ లేదు. కలకత్తాలో దేశీయులలో ఇంగ్లీషు విద్యావ్యాప్తికి పాడుపడిన డేవిడ్ హేర్ అనే దొర చేసిన కృషిని స్మరించడానికి 1841 లో ఒక సభ జరిగింది. అప్పుడాయన స్మృతిచిహ్నంగా ఒక శిలావిగ్రహాన్ని నెలకొల్పడానికి రామగోపాలఘోషుగారు ప్రతిపాదించారు. సామాన్యుణ్ని యిలాగ గౌరవించడం కొందరు గొప్పవారికి యిష్టం లేకపోయింది. హేరుదొరగారి పాఠశాలలో చదువుకుని పైకివచ్చినవారందరూ ఒక నెల సంపాదనను విరాళం యివ్వవలసిందని రామగోపాలఘోషుగారు హెచ్చరిస్తూ ఒక కరపత్రం ప్రకటించగా చాలా సొమ్ము పోగైంది. దానికి తానుకూడా కొంతసొమ్ము చేర్చి శిలావిగ్రహాన్ని నెలకొల్పారు.

దొరల కిష్టమైనవారినిగాక, ఇంగ్లీషు పాఠశాలలో పరీక్షలిచ్చిన దేశీయులకే వుద్యోగా లివ్వడానికి అప్పటి గవర్నరుజనరలైన హార్డింజిగారు 1844 లో తీర్మానించినందువల్ల దేశీయులకు కొంతమేలు కలిగింది. ఆయన పని చాలించుకునేప్పుడు ఆయనను అభినందించడానికి 1847 లో ఒక

బహిరంగసభ జరిగింది. ఆయనకు ఒక వినతిపత్రము సమర్పించి ఆయన స్మృతిచిహ్నంగా ఒక శిలాప్రతిమ నెలకొల్పాలని రామగోపాలఘోషుగారి సంకల్పం. అక్కడి దొరలు వినతి పత్రం సమర్పించడానికి అంగీకరించారు గాని, శిలాప్రతిమ నెలకొల్పడానికి యిష్టపడలేదు. రామగోపాలఘోషుగారు, కృష్ణమోహనబెనర్జీ గారూ కలిసి ఆ తీర్మానాన్ని ఆమోదింప జేసి కార్యం సాధించారు.

1843 బెంగాల్ బ్రిటిష్ ఇండియా సొసైటీ అనే ప్రజా సంఘాన్ని స్థాపించి ప్రజాసేవ చేయడాన్ని గురించి పైన చెప్పియున్నాము. 1850 లో దొరలకూ, దేశీయులకూ వైషమ్యాలు కలిగిన సందర్భములనుగురించి కుంపిసీవారికి మళ్ళీ రాజ్యాధికారపట్టా యిచ్చే సందర్భంలో ప్రజల కష్టా లను పార్లమెంటువారికి తెలపడానికీ, రాజ్యాంగవిధానం సంస్కరించడానికి పాటుపడడంకోసమూ కలకత్తాలో 1851 లో బ్రిటిషు ఇండియన్ అసోసియేషను అనే ప్రజా సంఘాన్ని స్థాపించి, సభలుచేసి తీర్మానాలు, మహజరులు, సీమ కంపి ప్రజాసేవచేసిన సంగతిని గురించిన్నీ పైన చెప్పబడియున్నది.

1853 వ సంవత్సరంలో కుంపిసీవారికి మళ్ళీ రాజ్యాధి కారపు పట్టా యిచ్చే సందర్భంలో పార్లమెంటులో హిందూ దేశ స్థితిగతులనుగురించి విచారణజరిగింది. అప్పుడు వంగ రాష్ట్రం లెఫ్టినెంటు గవర్నరుగా పనిచేసిన హాలీడేగారు సాక్ష్యం యిస్తూ మన దేశీయులకు వ్యతిరేకంగా మాట్లాడారు. బోర్డు ఆఫ్ కంట్రోలు అధ్యక్షుడైన సర్ ఛార్లెస్ వుడ్డుగారు హిందూదేశ పరిపాలనను సంస్కరించేవిషయమై 1853 వ

సంవత్సరం జూన్ 3-వ తేదీన ఒక ప్రణాళికను ప్రకటించారు. ఈ ప్రణాళిక ఎంత మాత్రమూ సంతృప్తికరంగా లేదనిన్నీ శాసన సభలలోను, సివిలుసర్వీసు ఉద్యోగాలలోను దేశీయులకు ప్రవేశ మివ్వకపోవడము, న్యాయశాఖలో పనిచేసే దేశీయుల జీతాలు హెచ్చించకపోవడము, పల్లపు వ్యవసాయానికి కాలువలు, చెర్వులు, బావులు నిర్మించడానికిగాని రాకపోకలకు రోడ్లు నిర్మించటానికిగాని, ఏర్పాటులు చేయకపోవడము, ఇంకా యీ దేశపరిపాలనలోగల ఇతర లోపాలను సంస్కరించకపోవడము చాలా ఆశాభంగకరంగా వున్నది. దీనిని గురించి తమ అసమ్మతిని తెల్పడానికి రామగోపాల ఘోషుగారు మొదలైన దేశీయ నాయకులు కలకత్తా పుర మందిరంలో 1853 వ సంవత్సరం జూలై 29 వ తేదీన ఒక మహాసభ సమావేశపరిచారు. ఆ రోజున కొన్ని వేలమంది సభకు వచ్చారు. చోటుచాలక చాలమంది బయట నుంచున్నారు. ఆ సభలో రామగోపాలఘోషుగారు యితర నాయకులూ తీవ్రమైన మహోపన్యాసాలిచ్చారు. రామగోపాల ఘోషుగారి వక్తృత్వాన్ని గురించి లండన్ టైమ్సు మొదలైన పత్రికలుకూడా ప్రశంసించాయి. రామగోపాలఘోషుగారు ఇంగ్లీషులో మహావక్త అని పేరుపొందారు. రామగోపాల ఘోషుగారు అఖండమైన ప్రజాసేవచేసి 1868 వ సంవత్సరం జనేవరులో స్వర్గస్థులైనారు. *

---

* Life of Babu Ram Gopal Ghose in Representative Indians by G. Parameswaran Pillai – 1897.

# బొంబాయి అసోసియేషన్

"భారతదేశము నందలి బ్రిటీషు పరిపాలనమును గురించి చాలా కాలమువరకు ఇంగ్లాండ్‌లోని రాజకీయ నాయకులే విమర్శిస్తూ వుండేవారు. భారతీయులు నోరులేనివారుగా నుండేవారు. క్రమక్రమముగా భారతీయులలో ఇంగ్లీషు విద్య, రాజకీయ పరిజ్ఞానాలు అభివృద్ధి చెందగా తమ దేశ స్థితిగతులను గురించీ తమకుగల బాధలను గురించీ ఆలోచించి విచారించ నాగినారు. ఆలోచించుకున్న కొలదీ తమకుగల కష్టముల జాబితా పెరగ జొచ్చినది. దీనిని గురించి అధికారులకు తెలుపుకొనుటకు ప్రయత్నించినకొలదీయింత ఎంత నిష్ప్రయోజనకరమో బయల్పడి భారతీయులకు విషాదము కలుగ నాగినది." అని దాదాబాయి నౌరోజీ జీవితచరిత్రను 1943 లో రచించిన ఆర్. పి. మసానీగారు వ్రాసినారు (చూడు పుట 55).

1833 వ సంవత్సరము తరువాత తూర్పు ఇండియా వర్తక సంఘము వ్యాపార సంస్థంలోనుంచి పరిపాలక సంస్థగా మార్పుజెందినది. అయితే వ్యాపారము చేయుట కేర్పడిన ఉద్యోగవర్గమే ప్రభుత్వముచేయ సాగినందువల్ల చాలా చిక్కులు తటస్థించినవి. ఈ కంపెనీ పరిపాలనా విధానములో మూడు ప్రత్యేక ప్రభుత్వములుండేవి. ఒకటి కలకత్తాలోనున్న గవర్నరు జనరల్ ప్రభుత్వము; రెండవది మద్రాసులోనున్న

చెన్నరాష్ట్రగవర్నరు ప్రభుత్వము; మూడవది బొంబాయిలో నున్న బొంబాయిరాష్ట్రగవర్నరు ప్రభుత్వము. ఈ రాష్ట్రీయ ప్రభుత్వములు ముఖ్యమైన వ్యవహారముల నన్నిటినీ కలకత్తా ప్రభుత్వమువారికి తెలియపరచవలసి యుండెడిది. ఆ విషయములలో తాము జరిగించిన చర్యను గురించి కలకత్తా ప్రభుత్వమువారు మళ్ళీ సీమలోని కంపెనీ డైరెక్టర్ల సభవారికి తెలుపవలసి యుండేది. ఇంగ్లాండులోని డైరెక్టర్ల సభవారొక దర్బారుగా ప్రభుత్వం జరిగించేవారు. పార్లమెంటు తనిఖీ సంఘము (బోర్డు ఆఫ్ కంట్రోల్) నకు లోబడి అన్ని వ్యవహారములును ఈ కంపెనీ డైరెక్టర్లు తమ యిచ్ఛవచ్చినట్లు నిరంకుశులై పరిష్కరిస్తూవుండేవారు. తమ చర్యలకు వీరెవ్వరికీ జవాబు చెప్పవలసిన బాధ్యతలేదు.

పార్లమెంటు తనిఖీ సంఘమువారు తమ కార్యాలోచనమునంతా రహస్యంగా జరిపేవారు. పార్లమెంటుసభవారు కోరితేతప్ప వీరు తమ నివేదికను సమర్పించేవారుకారు. అప్పుడుకూడా అందులో అన్నిసంగతులనూ వివరముగా వ్రాసేవారుకారు.

హిందూదేశములోని కలకత్తాప్రభుత్వము, బొంబాయి, మద్రాసు రాజధానుల ప్రభుత్వములు కలిపి ఆలోచించి కార్యనిర్వహణము చేసేవారుకారు. అనేక విషయములలో వారికభిప్రాయ భేదములు కలుగుతూ ఉండేవి. అందువల్ల కార్యనిర్వహణకు ఆటంకములు కలుగుతూవుండేవి.

భారత దేశ ప్రజలలో విద్యా వ్యాప్తి చేయుటకుగాని దేశముయొక్క ఆర్థిక స్థితిగతులను బాగుచేయుటకుగాని ఈ

కంపెనీ ప్రభుత్వమువారు ప్రయత్నించినవారు కారు. దేశప్రజల చిత్త వృత్తులలోను, దేశములోను అనేకమార్పులు కలుగుతూ ఉన్నప్పటికిని ఈ కంపెనీ పరిపాలన ఎమోగు బొదుగులు లేక యున్నది.

భారతదేశములో ఏదో విధముగా జరిగిన ఇంగ్లీషు విద్యాభివృద్ధి ఫలితముగా భారతీయులలోని కొందరు బుద్ధిమంతులకు ఈదేశ పరిపాలన ఈ విధముగా జరుగుట సరికాదని తోచినది. దీనిని సంస్కరించమని కోరుటకు తమకుహక్కు కలదనిన్ని తోచినది. భారతదేశపు గొప్పప్రభుత్వోద్యోగములలో భారతీయులను ప్రవేశింప నివ్వకపోవుటయే అప్పుడు కనబడిన ముఖ్యమైన అన్యాయము - ఉద్యోగములలో జాతి మత వర్ణ వివక్షత చూపబడకూడదని పార్లమెంటువారు 1833 సం॥లో కంపెనీవారికి రాజ్యాధికారపట్టా ఇచ్చేటప్పుడు శాసించి యున్నను, ఆచరణలో నీ తారతమ్యము చూపబడుతూనే వచ్చినది. సీమలోనే నియమింపబడిన ఇంగ్లీషు ఉద్యోగములను కవనెంటెడ్ సర్వీస్ అనిన్ని, భారతదేశములో నియమింపబడే ఉద్యోగములను అన్ కవనెంటెడ్ సర్వీసు అనిన్ని వ్యవహరిస్తూ సీమనుంచి వచ్చిన దొరలందరికీ ప్రత్యేక సౌకర్యములను కలిగించేవారు. పన్నుల వసూలు చేయడానికి న్యాయ పరిపాలన జరపడానికి సీమలోనే కొందరు దొరలను తయారుచేసి ఉద్యోగములిచ్చి పంపేవారు. వీరే మన ఐ. సి. యస్. ఉద్యోగవర్గము వారైనారు.

కంపెనీవారికి మళ్ళీ రాజ్యాధికారపుపట్టా ఇచ్చే తరుణము మళ్ళీ 1853 లో వచ్చినది. ఆ సందర్భములో భారతీ

యులు తమ కష్టములను గురించి మొరపెట్టుకోవడానికి అవకాశము కలిగినది.

1852 వ సంవత్సరము ఆగస్టు 26 వ తేదీన బొంబయిలోని ఎల్ఫిన్‌స్టన్ పాఠశాల భవనపు గదులలో దేశీయ ప్రముఖుల సభ యొకటి జరిగి బొంబయి అసోసియేషన్ అనే పేరుతో దేశీయ ప్రజాసంఘ మొకటి స్థాపించబడినది. అప్పుడాసభకు హాజరైనవారిలో నౌరోజీ ఫర్దూంజీ, భావుదాజీ అనే రామకృష్ణవిఠలుగారు, దాదాభాయి నౌరోజీగారు మొదలైనవారుండిరి. దాదాభాయి నౌరోజీగారు సర్కారు ఉద్యోగము చేస్తూ ఉన్నప్పటికిని ఆ సభలో పాల్గొని ఒకచిన్న ఉపన్యాసము నిచ్చినారు, ఇప్పటి * దృష్టితో చూస్తే ఆ యుపన్యాసము చాలా నిర్వీర్యముగానే కనబడవచ్చును గాని, అప్పటికాలానికదే గొప్పసంగతి అని చెప్పవచ్చును. భారతీయులకు న్యాయము చేయవలసినదని బ్రిటిషు ప్రభువులను వేడుకొనుచూ ఆ యుపన్యాసములో హెచ్చరించినారు.

ఇంగ్లండులోని పార్లమెంటువారికి పంపించగలందులకు బొంబయి అసోసియేషన్ వారొక మహజరు పిటీషనును తయారుచేశారు. ఇప్పటిలాగ అందులో స్వరాజ్యమును కోరక పోయినా కోట్లసంఖ్యకలదిగానున్న భారతీయ ప్రజలను పరిపాలించగలందులకు ఉదారబుద్ధిగల ప్రభుత్వ విధానము కావలసియున్నదని మాత్రము స్పష్టముగా కోరినారు. అప్పట్లో భారతీయులకు గల బాధలను నివారించవలసినదని అందులో కోరినారు. అప్పటి బాధలలో యిప్పటికిని కొన్ని అలాగునే

* 1943

నిలిచియున్నందువల్ల ఆ మహాజరు యిప్పటి పరిస్థితులను గురించే వ్రాయబడినదేమో అనే అనుమానమును కలిగించుచుండును. అప్పుడు మన దేశీయులకు ముఖ్యముగా కనబడిన విషయము ఇండియను సివిలు సర్వీసుయొక్క ఉన్నత ప్రభుత్వోద్యోగములలో భారతీయులను చేర్చుకునే అంశమే. అందుకోసము ప్రతి రాష్ట్రములోను ఒక విశ్వవిద్యాలయమును స్థాపించి ప్రభుత్వోద్యోగులను తర్ఫీదుచేయవలసినదని కోరినారు. ప్రభుత్వముయొక్క శాసనసభలలో విద్యావంతులైన భారతీయులను నియమించవలెనని కూడా ఆ మహాజరులో కోరినారు విద్యాభివృద్ధి నిమిత్తము ప్రభుత్వమువారు ప్రత్యేకించిన సొమ్ము 12,500 సవరసులు ఎంతమాత్రము చాలదనిన్నీ, ఆ మొత్తమును హెచ్చుచేయవలసినదనిన్నీ కోరినారు. ఇంతేకాదు; ప్రతి జిల్లాలోనుండిన్నీ వసూలుచేసిన భూమిశిస్తులో విశేషభాగము నా యా జిల్లాలోనే ప్రజాహితైక నిర్మాణ (పబ్లికువర్క్సు) ముల నిమిత్తము ఖర్చుపెట్ట వలసినదని కూడా కోరినారు.

ఈ సందర్భములో కంపెనీ ప్రభుత్వ విధానమును గురించి కూడా తీవ్రమైన విమర్శ చేసినారు. ఈ మహాజరులోని విషయములు ప్రకటింపబడగానే ఇంగ్లీషు పత్రికలకు చాలా కోపము వచ్చినది. దేశీయ ప్రజాసంఘ స్థాపనము విషయమై మొదట సానుభూతిని చూపించిన ఆంగ్లేయ పత్రికలే యీ మహాజరులో చేయబడిన విమర్శనలకు తమ అసమ్మతిని కనుబరచినవి. అప్పట్లో అధికారులతో మోమోటమి గల దేశీయులు కొందరుకూడా యీ రాజకీయోద్యమములోనుండి

తొలగినారు అందులో సర్ జెమ్సెట్జీ జీజీభాయి, రామ్‌లాల్ ఠాకోర్సీదాస్, మహమ్మద్ అమాన్ రోగే, మానెక్‌లాల్ కర్సెట్జీగార్లు ముఖ్యులు. "భారతదేశ శ్రేయముకొరకున్నూ, భారతీయుల నిమిత్తమున్నూ కొన్ని సూచనలు" అనే శీర్షికతో కర్సెట్జీ గారొక చిన్న పుస్తకమును ప్రకటించి అందులో "మొట్టమొదట ప్రాక నేర్వవలెను; తరువాత నడువ నేర్వవలెను; అటుతరువాత పరుగెత్త నేర్వవలెను" అని వెటకారముగా వ్రాసినారు!

ఆంగ్లేయ పత్రికలలోకల్లా "టెలిగ్రాఫ్ కొరియర్" అనే పత్రిక ఈ విషయమై అతి తీవ్రముగా వ్రాసినది. ఈ దేశములో నింగ్లీషు సంస్థలను నెలకొల్పుటనుగురించి కాని, ఈ దేశీయులు స్వపరిపాలనమును చేసికొనగలుగుటను గురించికాని ఏ రాజకీయ వేత్తయున్నూ, కలలోనైనను అనుకోవడానికి వీలులేని అంశములనిన్నీ, ఆంగ్లేయ నాగరకతయొక్క సహజ పరిణామములైన సంస్థల నిక్కడ నాటుటకు ప్రయత్నించుట, ప్రాక్పశ్చిమార్ధగోళములలో సహజముగా నుత్పత్తియగు పదార్థములను కలగాపులగము చేయుమని కోరుటవంటిదే యనిన్నీ ఆ పత్రికారాజము అభిప్రాయపడినది. స్వాతంత్ర్య వృక్షముయొక్క విత్తనమును నాటుట భూమి తగినదేయని ఒకవేళ అనుకున్నప్పటికిన్నీ ఆ మొక్క నొకచోటినుండి ఇంకొకచోటికి మార్చినాటిన తరువాత నది పెరిగి పెద్దదవుతుందా? ఆ వృక్షమును అసలు విత్తనములోనుంచే పెంచవలెనుగాని అంటు కట్టుటకు వీలున్నదా?" అని ఆ పత్రిక ప్రశ్నించినది.

స్పెక్టేటరు పత్రికాధిపతి మాత్రము ఈ విషయంలో కొంత విశాలదృష్టిని కనబరచినాడు. "ఇది తరుణము కాదని నాకుచెప్పి అప్పటికి తప్పించుకొని గాని, అది తలయెత్తకుండా దానిని అణచివేసిగాని ఇలాంటి యుద్యమమును ప్రోత్సహించుటకు వీలులేదు. ఈ మహజరులో నుదాహరింపబడిన కోరికలను మన్నించి, కొంత సంస్కరణముచేయుట బ్రిటిషువారికి నష్టకరముగా దేశీయులకు సౌకర్యము కలుగచేయుట యగునని అనుకొనుటయున్నూ పొరబాటుసంగతి. ఇంగ్లీషు సంస్థలందు భారతీయులకు అభిరుచిని, అనురాగమును కలిగించినందువల్ల ఇప్పటివలె కేవలము విదేశీయ సివిలు ఉద్యోగుల సిబ్బందిలో మన మీ దేశమును మన చేతులలో నుంచుకొనుపద్ధతికి బదులుగా మన ప్రభుత్వం పట్ల అనురాగముగల అసంఖ్యాకమైన ఐచ్ఛికభట దళములో నీ దేశమును మన చేతులలో నుంచుకొనగలుగుదుము. ఈ పద్ధతిని మన మింతవరకును బాగా అవలంబించలేదు. దేశరక్షణముకొరకు అసంఖ్యాకమైన ఐచ్ఛికభటుల దళమును సమకూర్చవలసిన అవసర మొకటి పైన చెప్పిన వాక్యములను వ్రాసిన నాలుగు సంవత్సరములలోనే కలుగునని, 1857 లో వచ్చిన మహావిప్లవమువల్ల ఈ నీతిని ఇంగ్లీషువారు బాగా గ్రహించగలుగుదురనిన్నీ ఆపత్రికలో నావాక్యములు వ్రాసిన లేఖరి కలలోనైనను అనుకొనియుండడు.

బొంబాయి అసోసియేషనువారు పార్లమెంటువారికి పంపిన అర్జీ ఇంగ్లాండులో సంచలనము కలిగించినది. భారతదేశముపట్ల సానుభూతిగల సర్ ఎడ్వర్డ్ ర్యాన్.

సర్ ఎర్స్కిన్ పెర్రీ, జాన్ బ్రైట్, జోసెఫ్ హ్యూమ్ మొదలైనవారు ఈ మహాజరును సమర్థిస్తూ గట్టిగా ప్రచారము చేసినారు. ఈ భారతదేశమును విజాతీయులైన ఇంగ్లీషువారు పరిపాలించుట ఇంగ్లాండుదేశమునకుగాని, భారతదేశమునకుగాని క్షేమకరమైన సంగతికాదని స్వాతంత్ర్య ప్రియుడైన కాబ్డెన్ అప్పట్లో చెప్పినాడు. తరువాత నతడు వ్రాసిన ఒక లేఖలో: "పూర్వార్థగోళములోనున్న భారతదేశము నా ప్రాంతీయులే పరిపాలించుకొనుట న్యాయము. పశ్చిమార్థగోళమునుంచి అక్కడికి వచ్చిన అధికారపరంపర వల్ల ఎంత చక్కగా పరిపాలన జరుగుతున్నప్పటికినీ, అది భారతీయుల ఆత్మగౌరవమునకు భంగకరమైన విషయముగానే వారు ఎంచుకొనెదరు. మన దృష్ట్యా అది సత్పరిపాలనముగా నుండకపోయినప్పటికినీ, భారతీయులు తమ దేశీయులద్వారానే పరిపాలింపబడుట కిష్టపడుదురు" అని వ్రాసినాడు. అయితే ఈ కాబ్డెన్‌గారి దేశీయులు మాత్రము భారతదేశాన్ని తమ చేతులలోనే ఉంచుకొనదలచినారు.

1853 వ సం. మార్చి 13వ తేదిన ఇంగ్లాండులోని భారతీయ మిత్రుల (Friends of India) సభ యొకటి జరిగినది. భారతదేశ రాజ్యాంగ సంస్కరణ విషయములలో పార్లమెంటులో కృషిచేయగలందులకు "ఇండియా రిఫారం సొసైటీ" అనే పేరుతో ఒక సంఘమును స్థాపించినారు. దానికి డేన్బీ సేమర్‌గారిని అధ్యక్షుడుగాను, జాన్‌డికిన్‌సన్ గారిని కార్యదర్శిగాను ఎన్నుకున్నారు. అయితే వీరు చేసిన కృషివలన కామన్సు సభవారు తమ మనస్సును మార్చుకొనలేదు.

పూర్వమువలెనే భారత దేశమును కంపెనీవారి వశములోనే ఉంచి వారి పరిపాలనపైన పార్లమెంటువారి తనిఖీ సంఘము నుంచుటకు నిశ్చయించి కంపెనీవారికి మళ్ళీ రాజ్యాధికారపట్టా నిచ్చినారు. కంపెనీ డైరెక్టర్ల కోర్టు సభవారికిని, పార్లమెంటు వారికినిగల పరస్పర సంబంధములందు ఎట్టి మార్పునూ చేయలేదు. కంపెనీ డైరెక్టర్ల కోర్టు సభలో మాత్రము ఒక మార్పు చేశారు. ఈ సభలోని సభ్యులసంఖ్య 18 కి తగ్గించి నారు. అందులో ఆరుగురిని ఇంగ్లీషు పార్లమెంటుకు బాధ్యత గల ఆంగ్ల ప్రభుత్వ మంత్రివర్గమువారే భారత దేశములో పదేండ్లకు తక్కువగాకుండా నివసించిన అనుభవజ్ఞులలో నుండి నియమించుటకు నిశ్చయించినారు. మిగతా 12 మందిని కూడా కంపెనీ యజమానులు (ప్రొప్రయిటర్సు) అలాగే పది సంవత్సరములకు తక్కువ కాకుండా భారత దేశములో నివ సించిన అనుభవజ్ఞులలోనుండి ఎన్నుకొనుటకున్నూ నిశ్చయించి నారు. కంపెనీవారి కొలువులోనున్న సివిలు ఉద్యోగములును, వైద్యశాఖకు సంబంధించిన యుద్యోగములునుకూడా పూర్వ మువలె కంపెనీవారి కిష్టమువచ్చిన వారికిచ్చే పద్ధతిని రద్దుచేసి పోటీ పరీక్షలలో తేరిన అభ్యర్థులకే ఇవ్వవలెనని శాసించారు. అయితే ఈ పోటీ పరీక్షలు ఇంగ్లాండులోనే జరిపేటట్లు నిశ్చ యించినందువల్ల దూరభారముననున్న భారతీయులు ఈ ఉద్యోగములలో ప్రవేశించుటకు అవకాశములు చాలా తక్కువమైనవి. భారతీయులింత కష్టపడి ఆందోళనచేసినా కృషికి తగిన ఫలితము లభించలేదు. అయితే ఒక్క సంగతి మాత్రము స్పష్టపడినది. భారత దేశమునందలి నలు ప్రాంత

ములనుగల దేశీయులందరూ కలిసి ఐకమత్యము వహించి కృషిచేసినందువల్ల కలుగుననుకొన్న దానికంటె ఎక్కువ సంస్కరణములనే ఇంగ్లీషు మంత్రులవల్ల పొందగలిగినారు. అందువల్ల దేశీయులు ఇకముందుకూడా ఈలాగున రాజకీయ వ్యవహారములను చర్చించుకొని ఆందోళన చేయుటవలని లాభమును మనవారు గ్రహించగలిగినారు. భారతదేశ స్థితి గతులను గురించి ఆవంతయైనను తెలియని ఇంగ్లీషువారికి సంగతులు తెలియచెప్పుటవలని లాభములనుకూడా మనవారు గ్రహించగలిగినారు.*

* Dadabhai Naoroji— R. P. Masani, (Allen and Unwin) pp. 53–57.

# మద్రాసు రాజకీయాలు

సర్ తామస్ మన్రో అనే అనుభవజ్ఞుడైన దొరను చెన్నపట్నంలో కుంపినీవారి పరిపాలనకింద వున్న రాజ్యాల పరిపాలనశాఖలలో గల లోపాలను విచారించి సవరించడానికి ఆవశ్యకమైన సూచనలూ చేయగలందులకు 1814-1817 మధ్య ప్రిన్సిపల్ కమీషనరు (ముఖ్యవిచారణకర్త)గా నియమించారు. ఆకాలంనాటి కుంపినీ పరిపాలననుగురించిన్నీ ప్రజల స్థితిగతులను గురించిన్నీ మన్రోగారు నిష్పక్షపాతంగానూ, నిర్భయంగానూ తన నివేదికలో వివరించారు. కుంపినీ పరిపాలనలో ప్రజలకు గల కష్టసుఖాలను బాగా గ్రహించి, అందుకోసం అనేక సంస్కరణలను సూచించారు. ఆయన యిచ్చిన సలహాలన్నీ అమలుజరిగితే బాగానే వుండును గాని, అలా జరగలేదు. ఆయన అభిప్రాయాలు మాత్రం చరిత్ర ప్రసిద్ధాలైనాయి.

మన్రోగారు అనుభవశాలిన్నీ, సమర్థుడున్నూ అయిన పరిపాలకుడుగా వుండి కుంపినీవారి మన్ననలకు పాత్రుడు కావడమే గాకుండా, ప్రజానురంజకుడుగా వుండి ప్రజల ప్రేమకు గూడా పాత్రుడైనాడు. దత్తమండలాలలో యిప్పటికీ యీయనను "మండ్రోలు సాహేబుగా" రనిన్ని, "మాండవ

**మని"** అనిన్ని ప్రజలు తలుచుకుంటూవుంటారు. ఈయన 1780 లో తన 19 వ యేట మనదేశానికి వచ్చి కొన్నాళ్లు అసిస్టెంటుగా వుండి తరువాత కలెక్టరై బారామహాలు పరగణాలకు పరిపాలకుడై 1800 మొదలు 1807 వరకూ దత్తమండలాలకు కలెక్టరుగా వున్నాడు. 1813 లో ఈ దేశ స్థితిగతులనుగురించి పార్లమెంటు ఎదుట సాక్ష్య మిచ్చాడు. చెన్నరాజధాని పరిపాలనలోగల లోపాలను విచారించి వాటిని సంస్కరించడానికి సూచన లివ్వగలందులకు 1814–17 మధ్య ప్రధాన కమీషనరుగా నియమింపబడినాడు. 1820 లో చెన్నపట్నం గవర్నరై ఎనిమిదేళ్లు చక్కగా పరిపాలించాడు. ప్రజలకు కొంత మేలు చెయ్యాలని ప్రయత్నించాడు. గాని తాను తలపెట్టిన కార్యాలు నెరవేరకముందే 1827 లో చనిపోయాడు.

మన్రోగారు ఈదేశప్రజలతో కలిసి మెలిసీవుండి, వారి గుణశీలాలను బాగా గ్రహించారు. వారి కష్టసుఖాలను గురించి అనేక సందర్భాలలో వ్రాశారు. హిందూదేశప్రజలు నాగరికులేననిన్నీ, తెల్లవారితో సమానమైన తెలివి తేటలు కలవారనిన్నీ, మంచి విశ్వాసపాత్రులనిన్నీ, అయినప్పటికీ వీరికి కుంపినీవారికింద వుండే పెద్ద ఉద్యోగాలేవీ యివ్వటంలేదనిన్నీ తెల్లవాళ్లెవరూ చేయడానికి అంగీకరించని స్వల్పజీతాలుగల నౌకరీలు మాత్రమే వీరికి యిస్తున్నారనిన్నీ, దేశపరిపాలనములో దేశీయులకు జోక్యంలేకుండా దేశాచారాలెరుగని విదేశీయుల సహాయంతో జరపడానికి ప్రయత్నిస్తున్నందువల్ల ప్రజలకు చాలా అన్యాయాలు జరుగుతున్నాయనిన్నీ ఆయన తన మినిట్సులో వ్రాశారు.

ప్రభుత్వ నిర్వహణంలో ప్రజలకు పలుకుబడి లేక పోవడంవల్లను, వారిని ఆలోచించకుండా శాసనాలు చేస్తూ వున్నందువల్లను ఈ శాసనాలు దేశాచారాలకు, దేశపరిస్థితులకు సరిపడనివిగానూ వుంటూవున్నవనిన్ని, ప్రజలు నోరులేనివారై తమ కష్టాలు ఎవరితో చెప్పుకోవాలో ఎరగక బాధలు పడుతూ వున్నారనిన్నికూడా వ్రాశారు.

చిరకాలంనుంచి గ్రామ పరిపాలనము చేస్తూవున్న గ్రామ పంచాయితీలను విచ్ఛిన్నంచేసి దేశ పరిపాలనము కలెక్టర్లద్వారాను, వారి తాబేదారులద్వారానూ చేస్తూ వున్నందువల్ల ప్రజలకు చాలా అన్యాయాలు జరుగుతున్నాయనిన్ని, న్యాయపరిపాలన కొంత బాగానే వున్నప్పటికిన్నీ అధికారులు దేశభాష రానివారవడంవల్లను తాబేదారులు లంచగొండులవడంవల్లను న్యాయపరిపాలనశాఖకూ శిస్తులు వసూలుచేసే రివిన్యూశాఖకూ దగ్గరసంబంధం వున్నందువల్లను భూమిశిస్తుల బాకీకి పొలాన్ని అమ్మించే అధికారమూ రైతును నిర్బంధించి ఖైదులోవుంచే అధికారమూ సర్కారుకు వున్నందువల్లను రైతుల కష్టాలకు మితిలేకుండా వున్నదని మన్రోగారు వ్రాసి శిస్తుబాకీకి మనిషిని నిర్బంధించేపద్ధతి తీసివేయమన్నారు.

పోలీసువారు నేరములను విచారించి శాంతిభద్రతలను కాపాడడానికి అసమర్థులుగా వుండి బీదవారిపైన నిరంకుశాధికారాలు చేస్తూ వున్నందువల్లకూడా ప్రజలు బాధపడుతూ వున్నారని ఆయన వ్రాశారు.

పూర్వపురాజులు నిర్మించిన చెరువులను, బావులను కుంపినీవారు మరమ్మతు చేయనందువల్ల అవి పాడై పల్లపు

సాగుకు నీటివసర్లు లేక వ్యవసాయము క్షీణించినదనిన్నీ, రాకపోకలకు సరియైన రోడ్లు, వంతెనలు లేనందున వర్తకము బాగా లేదనిన్నీ మన్రోగారు చెప్పినారు.

ఇంగ్లీషువారు తమ వర్తకం అభివృద్ధి చేసుకోదలచి తమ సరుకులు ఈ దేశంలో ఎందుకు బాగా చెలామణీ కావడంలేదని మన్రోగారిని 1813 సం॥ పార్లమెంటు విచారణలో అడిగారు. ఈ దేశప్రజలకు కావలసిన వస్తువులన్నీ యిక్కడివారు చక్కగానూ, చౌకగానూ తయారుచేస్తున్నారనిన్ని అలాంటి పరిశ్రమ లున్నంతకాలము ఈదేశంలో సీమ సరుకులు చలామణీకావని మన్రోగారు స్పష్టంగా జవాబు చెప్పారు.

పూర్వము హిందూరాజులు పరిపాలిస్తూ వుండగాను తరవాత మహమ్మదీయు లేలిన కాలంలోనూకూడా యీదేశ ప్రజలు చాలా విద్యావంతులుగా వుండేవారు. దేశంలో గొప్ప గొప్ప విద్యాలయాలు, శాస్త్ర పాఠశాలలు వుండేవి. ప్రతి గ్రామంలోనూ గ్రామపంచాయతీలు నడిపే గ్రామపాఠశాల లుండేవి. వీరి పోషణకోసం పూర్వపురాజులు నవాబులూ యిచ్చిన యీనాములు, జాగీర్లు, వర్షాశనాలు కుంపినీవారి కాలంలో నశించినవి. ప్రభుత్వాదరణ లేక గొప్పవిద్యాలయాలు, పాఠశాలలూ పాడుపడినవి. గ్రామపంచాయతీల నాశనంతో గ్రామపాఠశాలలుకూడా చాలవరకు నాశన మైనాయి. మిగిలిన పాఠశాలలు చాలా అధ్వాన్నస్థితిలో వున్నాయి. హిందూదేశప్రజలలో విద్యాభివృద్ధి చేయడం కోసం సాలుకొక లక్షరూపాయలు ఖర్చుపెట్టవలసినదని పార్ల

మెంటువారు 1813 లో తీర్మానించినప్పటికీ కుంపినీవారు ఆ సొమ్మును ఇంతవరకూ సద్వినియోగం చేయలేదు.

సర్ తామస్ మన్రోగారు గవర్నరైన తరువాత చెన్న రాజధాని ప్రజలలో కొంత విద్యాభివృద్ధి చేయదలచి, అప్పుడు దేశంలోవున్న పాఠశాలలను వృద్ధరించడానికీ, ఇంగ్లీషు నేర్పే పాఠశాలలు స్థాపించడానికీ నిశ్చయించి దేశంలోవున్న పాఠశాలలస్థితిన్నీ అందులో చెప్పే చదువున్నూ ఎలాగున్నదో తెలుసుకోవడానికి 1822లో కలెక్టర్లచేతదీనిగురించి విచారణ జరిపించారు. మన్రోగారు చేయించినవిచారణవల్ల అప్పటికి దేశ ప్రజలలోని విద్యాభివృద్ధి యెలాగవుండేదో తెలిసింది. అప్పటికి చెన్నరాజధాని జనసంఖ్య ఒకకోటి 20 లక్షలుపైగా వుండేది. సామాన్య పజలకు అక్షరజ్ఞానం లేదు. మధ్యతరగతుల వారి లోనూ, భూస్వాములలోనూ, వర్తకులలోనూ కొంచెము విద్యా సంస్కారం వున్నది. హిందువులకు ముఖ్యంగా వర్తకానికి పనికివచ్చే వ్రాతకోతలూ, లెక్కలూ తెలుసును. బ్రాహ్మణు లలో చాలమంది బాగా చదువుకున్నవారని చెప్పవచ్చును. కొంతమంది తర్క వ్యాకరణ వేదాంత గణితశాస్త్రిలలో గొప్ప పాండిత్యము కలిగివారై ఆకాలంనాటి ఐరోపాలోని విద్యావంతులకన్న విద్యలో వెనకబడినా, పూర్వకాలంనాటి ఐరోపా విద్వాంసులకు సమానమైనవారని చెప్పవచ్చును. అప్పటికి వున్న 12500 పాఠశాలలలో 750 వేదపాఠశాలలు. తక్కినవి గ్రామ పాఠశాలలు ఇవి ప్రజలవల్ల పోషింపబడేవి. పిల్లల తలిదండ్రులు పిల్లవానికి తల ఒకటికి నాలుగు అణాలు చొప్పున జీతమిచ్చేవారు. నెలకు ఆరు, ఏడు రూపాయీల

కన్న హెచ్చు ఆదాయము లేనందువల్ల వేరేవిధంగా బతక లేనివారే బడిపంతుళ్ళుగా వుండేవారు. పెద్దశాలశిక్షలో కన బడే విషయాలే ఆ బడిలో పిల్లలు చదివే సంగతులని చెప్ప వచ్చు. కొంచెము బాగా చదువుచెప్పే బడులలో పిల్లలు పద్యాలు, పాఠాలు తడుముకోకుండా అప్పచెప్పి లెక్కా డొక్కా బాగా వ్రాయగలిగేవారు *

కుంపినీవారికాలంలో చెన్నరాజధానిలో వుండే జిల్లా కోర్టులపైన అప్పీలు అధికారం కలిగిన చెన్నపట్నం సదర్ అదాలత్తు కోర్టులో తెలుగు తర్జుమాచేసే ఇంటర్ప్రిటరు అనే వుద్యోగం చేసిన వెన్నెలకంటి సుబ్బారావు పంతులు గారు ఆ కాలంనాటి పాఠశాలలస్థితిని గురించి మద్రాసు స్కూలుబుక్కు సొసైటీవారికి 1820 సంవత్సరం నవంబరు 22 వ తేదీన ఒక పెద్ద ఇంగ్లీషు వుత్తరం వ్రాశారు. ఈయన సుప్రీంకోర్టులో ఇంటర్ప్రిటరైన ఏనుగుల వీరాస్వామయ్య గారికి బంధువుడు. ఆయనలాగనే స్వయంకృషివల్ల ఇంగ్లీషు నేర్చుకుని పెద్ద వుద్యోగం చేసినవాడు. "చెన్నపట్నంలో దరి

---

* (Life and letters of Sir Thomas Munro - By the Rev. G. R. Gleig M. A; M. R. S. L &c. 3 Vol, (1830); Vol. I pp 123, 124, 155, 186, 273, 283, 305. 384–399, 405. Vol. III pp 69–85, 227–8, 269–70, 319–390, Minute of Sir Thomas Munro on the State of Country and the Condition of the people 31–12–1824; paras 22, 28, 37–39; History of Education in Madras – The Manual of the Administration of the Madras Presidency C. D. Maclean Vol. I. pp 568–570, 592.)

దాపుగా అన్ని వీధులలోనూ వీధిబడులు వున్నాయి. వాటిలో ముగ్గురికి తక్కువ కాకుండాను 50 మందికి ఎక్కువ లేకుండాను అన్నికులాల పిల్లలూ చదువుకుంటున్నారు. చెన్నపట్నంలో తెలుగుబడి పంతుళ్ళందరూ ఉత్తరాది బ్రాహ్మలే. ఈ రాజధాని గ్రామాలలోనూ వీధిబడు లున్నాయి. పిల్లలను అయిదో ఏటనే బడిలో వేస్తారు. వారికి గుంట ఓనమాలు, ఐదుబడులు, గుణింతము, బాలరామాయణమూ చెప్తారు. అయితే వ్యాకరణంమాత్రం వాళ్ళకు నేర్పరు. ఆడపిల్లలు సాధారణంగా ఈ బడులలో చదువుకోరుగాని, భోగంవాళ్ల పిల్లలు మాత్రం చదువుతారు. బడిపంతుళ్ళకు కష్టానికితగిన ఆదాయం లేదు. వాళ్ల జీవనం జరగడమే కష్టంగా వున్నది. గ్రామాలలో పిల్లలు తలఒకటికి నాలుగణాలు యిస్తారు. చెన్నపట్నంలో తల ఒకటికి ఒక రూపాయి చాలా పెద్దజీతం అనవచ్చు. ఈ దేశాన్ని పరిపాలించిన పూర్వపు అధికారులు బడిపంతుళ్లకు రొక్కపు బహుమతులూ యీనాములూ యిచ్చేవారు. గొప్పవారిపిల్లల చదువు పూర్తి అయిన తరువాత వాళ్లకు గురుదక్షిణక్రింద బహుమతు లిచ్చేవారు. డబ్బుకలవారు పిల్లలను బడికి పంపుతారు. లేనివారికి ఇంటి దగ్గరే చదువు చెపుతారు.

ఈపిల్లలు నేర్చుకునే చదువు కొద్దిపాటిదే ఐనా తరవాత కచ్చేరీలలో చేరినప్పుడు పైవుద్యోగులవద్ద తరిఫీదు పొందుతూ ఆలోటును పూర్తి చేసుకొంటారు. ఈబడులలో లెక్కలుకూడా చెప్తారు గాని, అది అంతబాగా లేదు. నీతిని బోధించే పుస్తకాలు కూడా వాళ్ళచేత చదివిస్తారుగాని

వాటిఅర్థం బోధించరు. సంస్కృతి పాఠశాలలలో మాత్రం వ్యాకరణం చెపుతారు గాని, దేశభాషలబడిలో అది చెప్పరు.

ఇంక ఈ దేశీయులకు (నేటివ్‌లకు) ఇంగ్లీషుభాషను బోధించే విధానం వర్ణిస్తాను. ఒకమనిషి తనస్వభాష నేర్చు కోవడం ప్రారంభించిన తరవాతనో నేర్చుకున్న తరవాతనో ఇంగ్లీషు నేర్చుకోవడం ప్రారంభించవచ్చును. అర్వైయేళ్ళ వాళ్ళుకూడా ఇంగ్లీషు నేర్చుకోవడం నేను స్వయంగా ఎరుగు దును. దేశీయుడు ఇంగ్లీషు నేర్చుకోవడం ప్రారంభించగానే ముందుగా ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకుంటాడు. సాధారణంగా ప్రతిదినమూ బడిపంతులు ఉదయాన్ని స్పెల్లింగు బుక్కులో నుంచి ఒకపాఠమూ వొకబ్యులరీలోనుంచి ఒకపాఠమూఇస్తాడు. తరువాత పూర్వకాలపు బడిపంతుల్లు తమపిల్లలకోసం తయారు చేసిన ఇంగ్లీషు సంభాషణలుగల డయలాగు అనే పుస్తకాలలో నుండి ఒకపాఠనుకూడా ఇస్తాడు. ఒకవిద్యార్థి నూరుమాటలు నేర్చుకొని కొంచెము దస్తూరీ బాగా వ్రాయడం రాగానే ఎవరిశిఫారసువల్లనో ఏదో ఒక కచ్చేరీలో ఒంయిదునా ఉమేదు వారీ (వాలంటీరుగా) ప్రవేశిస్తాడు. క్రమంగా అక్కడి బంధు వుల ప్రాపకంవల్ల చిన్నజీతంగల వుద్యోగం సంపాదిస్తాడు.

జిల్లాలలో ఇంగ్లీషు నేర్చుకునే విద్యార్థులు చదివే పుస్త కాలు వొకబ్యులరీ, డయలాగు, అరేబియన్ నైట్సు మాత్రమే. వాళ్ళకు వ్యాకరణం తెలియదనే నాసమ్మకం. నేనుచెప్పిన వొకబ్యులరీ డయలాగులుకూడా నిర్దుష్టమైనవీ వ్యాకరణ యుక్తములైనవీ అని నేను చెప్పను. వీటివల్ల విద్యార్థులు తప్పులు లేకుండా యింగ్లీషు మాట్లాడగలుగుతారని కూడా

నేను చెప్పను. అందువల్ల రాజధాని నగరంలోనూ జిల్లాలలోనూ ప్రస్తుతం అమలులోవున్న ఇంగ్లీషు నేర్పేపద్ధతి ప్రజల విద్యాభివృద్ధికి తోడ్పడేది కాదు. ఇప్పుడు చెన్నపట్నంలోవున్న యింగ్లీషు బడిపంతుళ్లలో చాలామందికి వ్యాకరణము తెలియదనే నా అభిప్రాయం. కొన్ని ఏళ్లకిందట చెన్నపట్నంలో మూడు నాలుగు పాఠశాలలకన్నా హెచ్చుగా లేనప్పుడు ఈ బడిపంతుళ్ల రాబడి కొంచెము బాగుండేది. కాని ఇప్పుడు వాటిసంఖ్య చాలా హెచ్చినందువల్ల వాళ్లకు జీవనం గడవడమే కష్టంగా వున్నది.

దేశంలో వివిధభాషలలో విద్యాభివృద్ధి చేయడానికి ఆయాభాషలలో వ్యాకరణాలను నీతికథలను లెక్కలను గణిత శాస్త్రాన్ని గురించిన పుస్తకములు తయారుచెయ్యాలి. అలాగే ఇంగ్లీషు పాఠశాలలకోసం ఇంగ్లీషువ్యాకరణం ఆయా భాషలలో బోధించడమూ ప్రపంచ చరిత్ర ఆయా భాషలలోనికి అనువదించడమూ సామాన్య ఇంగ్లీషుసంభాషణలను తర్జుమా చేయించడమూ ఇంగ్లీషు భాషలలోనూ తక్కినభాషలలోనూ వకబ్యులరీలను నిర్మించడమూ మంచిభాషతో చక్కని కథలను ప్రచురించడమూ అవసరము.*

ప్రజల విద్య ఇలాగ అజ్ఞానస్థితిలో వుండడం మన్రోగారు చూసి దాన్ని చక్కబరచడమేగాకుండా, ప్రజలకు ఇంగ్లీషువిద్య కూడా నేర్పాలని నిశ్చయించి దానినిగురించి

---

* The First Report of the School Book Society for the year 1823 page 43-C in the Appendix; A Journal of the Life of Vennelakunty Subbarow (1872) pp- 65-76.

1826 వ సం. మార్చి 10వ తేదీన ఒకఫర్మానా జారీచేశారు. ఇందుకోసం "కమిటీ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షను" అనే విద్యాభివృద్ధిసంఘాన్ని నెలకొల్పారు. విద్యాభివృద్ధికోసం సాలుకు నాలుగు వేలు కేటాయింపు చేశారు. అందులో 700 రూపాయలు బడిపుస్తకాలు తయారు చేయించడానికి ఏర్పడిన మద్రాస్ స్కూలుబుక్కు సొసైటీవారికి ప్రత్యేకించారు.

ఈ విద్యాభివృద్ధిసంఘంవారు బడిపంతుళ్ళను తయారు చేయడానికి చెన్నపట్నంలో ఒక నార్మలుస్కూలును నెలకొల్పారు. చెన్నపట్నం కోటలో వుద్యోగులకోసం కుంపినీవారేర్పరచిన కాలేజీ ఆవరణలోనే ఈ పాఠశాలకూడా స్థాపించారు. దీనికి ఒక ఇంగ్లీషు హెడ్‌మాస్టరును నెలకు రు. 300 ల జీతమిచ్చి యేర్పరిచారు. పిల్లలకు చదువు చెప్పడానికి చెన్నపట్నం బస్తీలోనూ, దాని పరిసరాలలో వున్న పేటలలోనూ కలిసి తొమ్మిది పాఠశాలలున్నూ రాజధానిలో వున్న 20 జిల్లాల ముఖ్యపట్టణాలలోను హిందువుల కొకటిన్ని, మహమ్మదీయుల కొకటిన్ని చొప్పున రెండేసి కలెక్టరేటు పాఠశాలలున్నూ ఆ జిల్లాలలో వుండే 61 తాలూకాలలోనూ 61 తాశిల్దారీ పాఠశాలలున్నూ నెలకొల్పారు. చెన్నపట్నం పాఠశాలలలోనూ జిల్లా కేంద్రాల పాఠశాలలలోనూ ఇంగ్లీషు వ్యాకరణము, గణితము, భూగోళము, అరవము, తెలుగు, అరబ్బీ భాషలు నేర్పేవారు. తాశిల్దారీ పాఠశాలలో ఇంగ్లీషు చెప్పేవారు కారు. మన్రోగారు తలపెట్టిన సంస్కరణాలు పూర్తికాకముందే ఆయన 1827 లో చనిపోయినారు. చెన్నపట్నం నార్మలు స్కూలున్నూ పాఠ

శాలలున్నూ బాగా నేజరిగినవిగాని, జిల్లా కేంద్రాల పాఠశాలలు సరియైన తనిఖీ లేక పాడైనవి. వాటిని సంస్కరించడాన్ని గురించి కొంత చర్చ జరిగిందిగాని పనిజరగలేదు. ఇంతలో దేశంలో ఇంగ్లీషు విద్యావిధానాన్ని స్థాపించడమే తమ వుద్దేశ్యమని కేంద్రప్రభుత్వమువారు 1835లో తీర్మానించారు. ఇక్కడి అధికారులు దానిని సరిగా అర్థంచేసుకోలేక, జిల్లా కేంద్రపాఠశాలలను 1836లో రద్దుచేసి కమిటీ ఆఫ్ నేటివ్ఎడ్యుకేషను అనే కొత్త విద్యాసంఘాన్ని నెలకొల్పారు. గవర్నరు యొక్క కవున్సిలుసభ్యుడు దీనికి అధ్యక్షుడు. ప్రెస్బిటేరియను చాప్లీను అనే క్రైస్తవమతాధికారిన్నీ గవర్నమెంటు మరాటీ ట్రాన్సులేటరున్నూ, డిప్యూటీజడ్జి అడ్వకేటున్నూ, కుంపినీ ఖగోళశాస్త్రజ్ఞుడున్నూ, సోలిసిటరున్నూ దీనిలో సభ్యులు. చెన్నపట్నంలో ఒక (కాలేజీ) కళాశాలను ఒక ఉన్నత పాఠశాలను నాలుగు ఇంగ్లీషు పాఠశాలలను స్థాపించవలసినదని ఈ కమిటీవారు శిఫారసు చేశారు గాని, ఆ ప్రకారం జరగలేదు. * ఇలాగ దేశీయుల విద్య విషయమై కుంపినీవారు ఉపేక్షాభావం వహించారు.

1828 లగాయతూ చెన్నపట్నం సుప్రీంకోర్టులో అడ్వకేటు జనరలుగా వుండిన జార్జి నార్టనుగారున్నూ తెలుగు తర్జుమాచేసే ఇంటర్ప్రిటరు అనే వుద్యోగిగావున్న ఏనుగుల వీరాసామయ్యగారున్నూ పోలీసు మేజస్ట్రేటుగా వుండిన

---

* History of Education; Manual of Administration of the Madras Presidency. C. D. Maclean Vol. I. pp 569–70.

వెంబాకం రాఘవాచార్యులుగారున్నూ కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారున్నూ కలిసి చెన్నపట్నంలో హిందూ లిటరరీ సొసైటీ అనే ప్రజాసంఘాన్ని స్థాపించి, సభలుచేసి, ప్రజలకు రాజకీయపరిజ్ఞానం కలిగించడానికి చాలా పాటుపడ్డారు. భారతదేశ పరిపాలననుగురించీ రాజ్యాంగమునుగురించీ న్యాయపరిపాలనా విధానాన్ని గురించీ దేశ చరిత్రనుగురించీ జార్జి నార్టనుగారు 1833–34 మధ్య కొన్ని మహోపన్యాసాలిచ్చారు. * ఇందువల్ల, ప్రజలకుగల హక్కులను గురించి వారికి తెలిసి, రాజకీయపరిజ్ఞానము కలగడమేగాక, విద్యాభివృద్ధి కోసం పాటుపడాలనే కార్యదీక్షకూడా కొందరికి కలిగింది. 1836 లో వీరాస్వామయ్యగారు చనిపోయినా, తక్కినవారు దీనికోసం చాలా పాటుపడి ప్రజాసేవ చేశారు. 1837 లో చెన్నపట్నం గవర్నరైన ఎల్ఫిన్‌స్టన్ ప్రభువు కేంద్ర ప్రభుత్వంవారు 1835 లో సూచించినప్రకారం ఇంగ్లీవిద్యావిధానమూ పాశ్చాత్య ప్రకృతిశాస్త్ర విజ్ఞానమూ చెన్నరాజధానిలో వ్యాపింపజేయడానికి సుముఖుడుగా ఉండినాడు. ఈ అవకాశం చూచుకొని చెన్నపట్నం పౌరులు చెన్నపట్నంలో ఒక ఇంగ్లీషు కాలేజీని (కళాశాలను) స్థాపించడం చాలా అవసరమనిన్ని ప్రజలకు జ్ఞానాభివృద్ధి జాతీయతకు పునాదియని తాముగ్రహించినామనిన్నీ, కేవలమూ దయాధర్మంగా విద్యాభివృద్ధి చేయవలసినదని తాము కోరడం లేదనిన్నీ, శక్త్యానుసారంగా తాముకూడా కొంతవిరాళం యిస్తామనిన్నీ ప్రభుత్వం స్థాపించే సంస్థల నిర్వహణంలో

* Rudimentals – George Norton pp ii, iii, 1–18.

తమకుకూడా కొంత అధికారమూ, పలుకుబడీ వుండాలనిన్నీ ఒకమహాజరు వ్రాసి డెబ్భయివేలమంది సంతకాలుచేసి జార్జి నార్టనుగారిద్వారా గవర్నరుగారికి అందజేశారు. విద్యాభి వృద్ధిని గురించిన విషయాలలో ప్రజాభిప్రాయం తీవ్రరూపం దాల్చినదని నార్టనుగారు గవర్నరుగారికి మనవిచేశారు. గవర్నరుగారు జాగ్రత్తగా యోజించి ఆంగ్లసారస్వతమూ ప్రకృతి శాస్త్రములు తత్వశాస్త్రమూ నేర్పుటకు ఒకయూని వర్సిటీ అనబడే విశ్వవిద్యాలయాన్ని స్థాపించడానికిన్నీ దానికి విద్యార్థులను తయారుచేయడానికి ఒక ఉన్నతపాఠశాలను స్థాపించడానికిన్ని నిశ్చయిస్తూ 12-12-1838 వ తేదీన తమ అధికారరీత్యా ఒకమినిట్సు వ్రాశారు. తరువాత ఆప్రకారం 2-8-1839 తేదీన ఒక యూనివర్సిటీ బోర్డును నెలకొల్పారు. దానికి నార్టనుగారు అధ్యక్షుడు. రాఘవాచార్యులుగారు శ్రీనివాసపిళ్ళగారు మొదలైన కొందరు దొరలూ దేశీయులూ అందులో సభ్యులు. 1841 వ సంవత్సరం ఏప్రిలు 14 వ తేదీన మదరాసు యూనివర్సిటీ అనే ఉన్నత పాఠశాలను గవర్నరు గారు ప్రారంభించారు. ప్రజలకోరిక నెరవేరడానికి ఇంతకాలం పట్టింది. *

---

* History of Education in Madras. Article by Dr. P. J. Thomas in The Madras Tercentenary Commemoration Volume. pp. 443-7.

# విద్యాబోధనము - మతప్రచారము

1836 నాటికి చెన్నపట్నంలో ఇంగ్లీషు బాగా చెప్పే పాఠశాలలు మూడు వుండేవి. చెన్నపట్నం కోటలో దొరలకోసం కుంపినీవారు స్థాపించిన కాలేజీ అనే పాఠశాల ఆవరణలోనే దేశీయ ఉపాధ్యాయులను తర్ఫీతు చేయడాని కోసం మన్రోగారు స్థాపించిన నార్మలుస్కూలు అనే ట్రెయినింగు పాఠశాలకూడా వుండేది. ఇందులో ఇంగ్లీషు బాగా చెప్పడంవల్ల ఉపాధ్యాయులుగా తర్ఫీతు పొందడడంకోసం చేరేవాళ్ళేగాక, ఇంగ్లీషు నేర్చుకోదలచిన పిల్లలు పెద్దలు కూడా యిందులో చేరేవాళ్ళు ప్రభుత్వంవారు 1836 లో తక్కిన పాఠశాలలను రద్దుచేసినప్పుడు దీనిని మాత్రం కొంత అభివృద్ధిచేశారు. పూర్వంలాగ ఉచితంగా చదువు చెప్పడం మానేసి నెల 1-కి అర్ధరూపాయ జీత మేర్పరిచారు. ఎవరి పుస్తకాలు వారు తెచ్చుకోవా లన్నారు.

నేటీవు ఎడ్యుకేషను సొసయిటీ అనే పేరుతో కొందరు దొరలు దేశీయుల విద్యాభివృద్ధికోసం ఒక సంఘంగా ఏర్పడి చందాలు పోగుచేసి నల్లవారి బస్తీలోనే ఒక పాఠశాల స్థాపించారు. ఇది నేటీవు ఎడ్యుకేషను సొసైటీ స్కూలు అని ప్రసిద్ధిజెందింది.

బాపీ; లారీ; లనే స్కాట్లాండు దేశపు క్రైస్తవ మత ప్రచారకులు ఇద్దరు కలిసి 1835 వ సంవత్సరం జూన్ నెలలో చెన్నపట్నంలో ఇప్పుడు జార్జిటవును అనిన్నీ, ఆ కాలంలో బ్లాకుటవును లేక నల్లవాళ్ల బస్తీ అనిన్నీ వ్యవహరింపబడే పేటకు ఒక మైలు దూరంలో "సెయింట్ ఆండ్రూస్ స్కూల్" అనే పాఠశాల నొకదానిని స్థాపించారు. ఈ పాఠశాలలో చదివే పిల్లలకు పైతరగతివారికి బైబిలు, మార్షమను వ్రాసిన ప్రపంచ చరిత్ర సంగ్రహమూ నేటీవు పిల్లలకోసం వ్రాయబడిన భూగోళ శాస్త్రమూ శబ్దాల వ్యుత్పత్తిదాకా వ్యాకరణమూ సంబంధ సామ్యము (Proportion) వరకూ గణితమూ నేర్పేవారు. దీనిని బట్టి ఆ కాలంలో చదువు ఏస్థితిలో వుండేదో తెలుసుకోవచ్చును.

విద్యాబోధనముద్వారా క్రైస్తవ మతప్రచారం చేయడానికి ఫ్రీ చర్చి ఆఫ్ స్కాట్లాండు మిషనువారి అధికారం క్రింద కలకత్తాలో అలెగ్జాండర్ డఫ్‌గారు స్థాపించిన జనరల్ అసెంబ్లీ పాఠశాలలాంటిది చెన్నపట్నంలోకూడా నడపాలని ఈ మిషనరీల ఉద్దేశ్యం. ఇందుకోసం వీరు రాజధానిలో వుండే క్రైస్తవ మతాభిమానుల దగ్గరనుంచి కొంత సొమ్ము పోగుచేసి, అలాంటి పాఠశాల నిర్వహించడానికి తగిన మిషనరీని పంపవలసినదని సీమలోవున్న ఫ్రీ చర్చి ఆఫ్ స్కాట్లాండు మిషనువారిని కోరారు. అంతట వారు విద్యావంతుడున్నూ, కార్యశూరుడున్నూ అయిన జాన్ ఆండర్సన్ అనే యువకుణ్ణి చెన్నపట్నానికి మిషనరీగా పంపారు. ఇతడు 1836 ఆగష్టు 13 వ తేదీన సీమలో బయలుదేరి డిశంబరు 27 వ తేదీన

ముందుగా కలకత్తా చేరి అక్కడ అలెగ్జాండరు డఫ్‌గారి పాఠశాలద్వారా జరుగుతూవున్న క్రైస్తవమత ప్రచారాన్ని స్వయంగా చూసి 1837 వ సం॥ ఫిబ్రవరి 22 వ తేదీన చెన్నపట్నానికి వచ్చి మిషను పాఠశాల నిర్వహణానికి పూనుకున్నాడు. అప్పటికి అతని వయస్సు 21 సంవత్సరాలు. ఇతడు చాలా చొరవకలవాడు. ఇతనికి సహాయంగా పని చేయడానికి రాబర్టు జాన్‌స్టను అనే మిషనరీని నియమించారు. ఆయన 1839 జనవరి 24 వ తేదీన చెన్నపట్నం వచ్చాడు.

సెయింట్ ఆండ్రూస్ మిషను పాఠశాల నల్లవాళ్ళ బస్తీకి దూరంగా ఊరు వెలుపల వున్నందువల్ల దేశీయుల పిల్లలు రావడానికి అనువుగా లేదని తోచి ఆండర్సనుగారు దానిని 1837 వ సం॥ ఏప్రిలు 3 వ తేదీన బస్తీమధ్య ఆర్మీనియను వీధిలో వున్న రెండంతస్తుల మేడలోకి మార్చారు. అప్పుడీ పాఠశాలలో 59 మంది పిల్లలు వుండేవారు. ఇలాగ కొత్త పాఠశాల ప్రారంభమైనది. *

---

* ఆర్మీనియను వీధిలో బడి ప్రారంభించిన తరవాత పద్దెనిమిది నెలలకు జార్జిటవునులోనే ఎర్రబాలుసెట్టి వీధిలోవున్న ఒక విశాలమైన భవనానికి ఈపాఠశాలను మార్చారు. 1846 దాకా బడి అక్కడే వుండేది ఆండర్సనుగారూ జాన్‌స్టనుగారూ కూడా అక్కడే కాపురం వుండేవారు. తరవాత మతంలో కలిసిన యువకులు కూడా అందులోనే వుండేవారు. దీనిని మిషను భవనం అనేవారు. ఒక స్వంతభవనం కావలసిన అవసరం 1845 నాటికే కలిగింది. అంతట చందాలు వసూలుచేసి ఇప్పుడు హైకోర్టు ఎదుట పాతక్రైస్తవ కళాశాల వుండేస్థలంలో వుండిన నావికుల గృహం అనే పాతయింటిని 2500 వరహాలకు కొని 1846 డిశంబరు 15 వ తేదీన గృహప్రవేశం అయ్యారు. తరవాత క్రొత్తభవనం నిర్మించారు.

ఈ పాఠశాల ఉద్దేశ్యాలను మిషనరీలు ప్రచురించిన ప్రకటనలోనే స్పష్టంగా వివరించారు: "స్కాట్లాండు చర్చి వారి క్రైస్తవ మతబోధకుడైన ఆండర్సనుగారు ఆ మతాధికారుల పెత్తనముకిందను, ఆదరణకిందను ఒక పాఠశాలను స్థాపిస్తున్నాడు. ఈ చర్చి మిషనువారి ఆదరణకింద అలెగ్జాండర్ డఫ్‌గారు కలకత్తాలో ఏడేళ్ల కిందట స్థాపించి నడుపుతూవున్న మిషను పాఠశాల ఇప్పుడు చాలా అభివృద్ధిలో వున్నది. అందులో అన్ని కులాలపిల్లలూ 600 మందికి పైగా చదువుకుంటున్నారు. ఒక సంవత్సరంకిందట బొంబాయిలోకూడా అలాంటి పాఠశాలనే డాక్టరు విల్సనుగారు స్థాపించారు. చెన్నపట్నం పాఠశాలకూడ ఆ పద్ధతులలోనే నడపబడుతుంది."

"చదువు చెప్పడముమూలముగానే వీలైనంత హెచ్చుగా విజ్ఞానాన్ని, ముఖ్యంగా బైబిలు విజ్ఞానాన్ని ప్రజల మనస్సులకు ఎక్కించడమే దీని ముఖ్యోద్దేశము. విజ్ఞానబోధయొక్క తక్కిన శాఖలన్నీ ఈ ముఖ్యోద్దేశానికి లోబర్చియుంచబడుతాయి. క్రమక్రమముగా ఈ పాఠశాలలో చెప్పే చదువులాంటి చదువు చెప్పే దేశీయుబడిపంతుళ్ళను, బోధకులను తయారుచేయడమూ, వారిద్వారా దేశీయులందరికీ విద్యాలాభమూ, క్రైస్తవమతముయొక్క లాభముకూడా కలిగించడమే దీని ముఖ్యోద్దేశము."

"పిల్లల తరగతులు ఏర్పడి పాఠాలు ప్రారంభించడానికి వీలుకలుగగానే ఇంగ్లీషుతోపాటు వ్యాకరణము, వ్యాసలేఖనము మంచి దస్తూరీతో వ్రాతకోతలు లెక్కలు వ్రాయ

డము - చరిత్ర, భూగోళము, గణితము, ఖగోళశాస్త్ర సంగ్రహము, అర్థశాస్త్రపాఠములు-తర్కము. నీతిశాస్త్రము, తత్వశాస్త్రము, ఆధ్యాత్మజ్ఞానము. క్రైస్తవమత సిద్ధాంతములు మొదలైన విషయములు బోధింపబడతాయి. తెనుగు అరవము బోధించడానికి పండితులు నియమింపబడతారు." అని అండర్సనుగారు పత్రికలద్వారా ప్రకటనచేశారు.

అండర్సనుగారి ప్రధానోద్దేశ్యము ముందుగా పిల్లల మనస్సులను క్రైస్తవమతంలోనికి మార్చడము. తరువాత అలా మారినవారిలో తెలివితేటలు కలిగి క్రైస్తవమతమందు భక్తికలిగినవారిని మతబోధకులుగా చేయడము, అటుతరువాత యీ ప్రతినిధులద్వారా ప్రజలలో ప్రచారం చేయించి ప్రజలను క్రైస్తవమతంలో కలిపి క్రైస్తవ జనసంఘాలను నిర్మించడము.

పాఠశాల వుద్దేశ్యాలను గురించిన ప్రకటన పత్రములను బట్టి క్రైస్తవ మతప్రచారమే దాని ప్రధానోద్దేశ్య మనే సంగతి అందరికీ స్పష్టంగా తెలుస్తూనే వున్నది. దీనిలో దాపరికమేమీ లేదు. ఆ సంగతి తెలిసీకూడా, "ఈ ఆండర్సనుగారి వుద్దేశాలు నెరవేరి పోతున్నాయా?" అనే దిలాసాతో హిందువులు తమ పిల్లలను ఈ క్రైస్తవ పాఠశాలకు పంపడం ప్రారంభించారు. ఆండర్సనుగారుమాత్రం తన బడిని ప్రారంభించిన రోజు మొదలుకుని తన లక్ష్యాన్ని ఒక్కక్షణమైనా విస్మరించలేదు. ఆబడిలో పిల్లలుప్రవర్తించే పద్ధతులు మొదలుకుని నేర్చుకునే విషయాలవరకూ అన్నిసందర్భాలలోనూ ఈ పిల్లలు తమ మతాచారాలు పనికిమాలినవని అనుకుని

వాటినిచూసి సిగ్గుపడి అసహ్యించుకునే టట్లూ, ఏసుక్రీస్తు బోధలూ, మతాచారాలూ చాలా మంచివని వారు అనుకునే టట్లూ పాఠశాల కార్యక్రమం సాగించారు.

పాఠశాల ప్రారంభించిన తరవాత కొన్నాళ్ళకు అనగా 1837 వ సంవత్సరం జూను 16 వ తేదీన ఆండర్సనుగారు వ్రాసిన మొదటి వుత్తరంలో యిలాగ వ్రాశారు. *

"నల్లవారిబస్తీలో ఏప్రెలు 3 వ తేదీని నేను పని ప్రారంభించినది లగాయతు నేను అనుకున్న దానికంటె ఎక్కువ ఫలితమే కలిగింది. పాఠశాల దినదినాభివృద్ధి చెందుతూవుంది. ఇప్పుడు 180 మంది పిల్ల లున్నారు. చెన్నపట్నంలో వుండే ఘరానాకుటుంబాల వారిపిల్లలు కొందరు యిప్పుడిప్పుడే చేరుతున్నారు. పిల్లవాళ్ళసంఖ్య అభివృద్ధి అవుతూవుండడం కన్నా వారిలో విజ్ఞానం ఆర్జించాలనేతృష్ణ అనుదినమూ అభివృద్ధి అవుతూవుండడమే ముఖ్యంగా సంతోషించతగిన సంగతి."

ఒకే తరగతిలో చదువుకునే పిల్లలు తాము నేర్చుకున్న విషయాలనుగురించి ఒకరినొకరు ప్రశ్నించుకునేపద్ధతి, ఈ అండర్సనుగారి చేతులలో ఒక గారడీవిద్యలాగా ఉపయోగపడింది. ప్రతివిషయాన్నిగురించీ తర్కించడమును పురికొల్పి ఒకపిల్లవాడింకొకపిల్లవాడితో బుద్ధిబలాన్ని ఉపయోగించి వాగ్యుద్ధము చేసేటట్టు ప్రోత్సహించడము ప్రారంభించారు. డబ్బుగలవారి పిల్లలనీ, ఎక్కువకులములవారి పిల్లలనీ గాక

* True Yoke-fellows-Life and labours of John Anderson & Robert Johnston of the Madras Free Church Mission. By Rev. John Braidwood M. A.

తాము విన్న సంగతులను బాగా గ్రహించి జ్ఞాపకం వుంచుకొని తెలివితేటలతో ఉపయోగించేవారే అధికులనే భావాన్ని కలిగించినారు. హిందువుల "అహంభావాన్నీ", "దురభిప్రాయాలనూ" వదలగొట్టడానికి వారిమతాచారాలను గురించిన వాగ్వాదాలను పురికొల్పేవారు. పిల్లవాళ్ళూ, వాళ్లలో బడి పెద్దలుగా వుండే మాస్టర్లూ, బడిపంతుళ్ళూ కలిసి ప్రతి బుధవారం సాయంత్రమూ సభచేసి అందులో అనేక విషయాలను గురించి చర్చలు జరిపేవారు. ముఖ్యంగా హిందూమతాచారాలు మూఢవిశ్వాసాలనీ, క్రైస్తవమత సిద్ధాంతాలే పరమోత్కృష్టమైనవనిన్నీ. బైబిలే నిజమైన వేదమనిన్నీ ఇంకా ఇలాంటి "ఉపయుక్త" విషయాలను గురించి చర్చలు జరిపేవారు; వ్యాసాలు వ్రాసిచదివేవారు. విమర్శలు చేసేవారు; వాగ్వాదాలు చేసేవారు. దీనివల్ల శాస్త్ర దారిలోపడిన పిల్లలకూ బడిపెద్దలకూ మంచి మనో వికాసం కలిగి తమపెద్దలు చెప్పారని నోరుమూసుకుని నమ్మి వుండడము గాక, ప్రతివిషయాన్ని గురించీ తమబుద్ధిని వినియోగించి ఆలోచించి తర్కించేటట్లు చేసి మూఢవిశ్వాసాలను వదలగొట్టడానికి ఉపయోగించే ఉత్తమమైన విషయాలు అనగా క్రైస్తవ మతసిద్ధాంతాలను గురించి ఆలోచించడమూ, వాటినిగురించి వ్రాయడమూ మాట్లాడడమూ అలవాటుచేసి క్రైస్తవ విజ్ఞానానికి దోహదంచేసేది.

ఆండర్సనుగారు తనబడిలో ఎక్కువకులాల పిల్లలను కూడా తక్కువ కులాలవారితో కూర్చోబెట్టి చదువు చెప్పే వారు. ఇది ఎక్కువ కులాలవారికి కష్టంగా తోచింది. ఇది

గాకుండా హిందువుల మతాచారాలను ఖండిస్తూ, ఇవన్నీ మూఢవిశ్వాసాలని నిరూపిస్తూ శాస్త్రపాఠాలు బోధించడము వల్లను, బైబిలుకథలు చెప్పుతూ క్రైస్తవ మతసిద్ధాంతాలను బోధిస్తూ వుండడమువల్లనూ, పిల్లలమనస్సులో తమ మతాన్ని గురించీ, ఆచారాన్ని గురించీ ఒకవిధమైన అసహ్యాభావం వర్ధిల్లడం ప్రారంభించింది. ఈ విపరీతపు చదువు చూడగానే కొంతమంది పిల్లల తల్లిదండ్రులకు భయాశ్చర్యాలు కలిగి నాయి. అందువల్ల కొంతమంది మర్యాదస్థులు తమ పిల్లలను ఆండర్సనుగారి పాఠశాలలోనుంచి వెంటనే మాన్పించడానికి నిశ్చయించారు. నల్లవారి బస్తీలోనే వున్న నేటివ్ ఎడ్యుకేషను సొసైటీవారి పాఠశాలలోకూడా ఇంగ్లీషుచదువు చెప్పేవారు. ఈ పాఠశాలను నిర్వహించేవారు కూడా దొరలే అయినప్ప టికీ వారు కేవలమూ క్రైస్తవ మతప్రచారమే తమ పరమా వధిగా నిర్ణయించుకున్నవారు కారు. పైగా హిందువుల మతా చారాలకు భంగము కలిగించడము తమ వుద్దేశ్యం కాదని వీరనేకసార్లు వెల్లడించి వున్నారు. అందువల్ల ఆండర్సను పాఠశాలలోలాగ అక్కడ అన్ని కులాల వారినీ సమానంగా కూర్చోపెట్టడమూ, క్రైస్తవమతం బోధించడమూ లేదు. ఆండర్సను పాఠశాలలో ఇలాగ జరు గుతూవున్నందువల్ల తమ పిల్లలను మాన్పించామని చెప్పి కొందరు మర్యాదస్థులు 1837 జూలై నెలలో తమ పిల్లలను ఆ పాఠశాలలో చేర్చుకోమని కోరగా వారా ప్రకారం చేర్చు కున్నారు. ఆ పాఠశాల అధికారులుకూడా క్రైస్తవులే అయి వుండినీ క్రైస్తవమతంకోసం తాను చేస్తూవున్న కృషికి

యిలాగ ఆటంకం కలిగించడం బాగాలేదని ఆండర్సను నిందించినా లాభం లేకపోయింది. ఈ పాఠశాలవారి పోటీ లేకపోతే తాను వెంటనే మాలమాదిగలనుకూడా తన పాఠశాలలో చేర్చుకుని హిందువుల కులాచారాలను విధ్వంసం చేసి త్వరలోనే క్రైస్తవమతాన్ని స్థాపించేవాడనని ఆండర్సను అన్నాడు.

హిందువుల సనాతన ధర్మానికీ, క్రైస్తవమత సిద్ధాంతానికీ చెన్నపట్నంలో జరిగిన మొదటి పోరాటము ఆండర్సనుగారి పాఠశాలలోనే జరిగింది. 1838 వ సంవత్సరం అక్టోబరు 19 వ తేదీన ముగ్గురు పంచములను ఆండర్సనుగారి పాఠశాలలో చేర్చుకోవడము తక్కినకులాల పిల్లలకు విపరీతముగా కనపడింది. ఈ పంచములతో కలిసి కూర్చుని చదువుకోవడానికి తక్కిన పిల్లలు యిష్టపడలేదు. అక్టోబరు 25 వ తేదీన మూడవతరగతిలోని పిల్లలు కొందరు కలిసి వచ్చి ఈ పంచములను బయటికి వెళ్లగొట్టమని ఆండర్సనుగారిని కోరారు. ఆయన వప్పుకోలేదు. అంతట ఆ తరగతిలో 19 మంది పిల్లలు ఆ మధ్యాహ్నం బడికి రాకుండా మానివేశారు. ఒక పిల్లవాడు ఒక మహజరు పట్టుకొనివచ్చి తక్కినవారిచేత సంతకాలు చేయించడానికి ప్రయత్నం చేయడం చూసి ఆండర్సను దానిని మొదటిలోనే తుంచివేసినాడు. తరవాత ఆ 19 మంది పిల్లల యిళ్లకూ ఒక బంట్రోతును పంపించి వాళ్లు వెంటనే క్లాసుకు రాకపోతే పేర్లు కొట్టివేస్తానని కబురు పంపించాడు. అంతట వాళ్లు మళ్లీ క్లాసుకు వచ్చారు.

చాలామంది తల్లిదండ్రులు - సంరక్షకులు, ఈ పంచములను వెళ్లగొట్టకపోతే తమ పిల్లలను పాఠశాలకు పంపడం మానివేస్తామని ఆండర్సనుగారిని బెదరించడం ప్రారంభించారు గాని అతడు లొంగలేదు. ఇలాగ ఒక పదిహేనురోజులు జరిగినవి. ఇంక లాభంలేదని తెలుసుకొని కొందరు పిల్లల తండ్రులు తమ పిల్లలను ఈ బడిలోనుంచి మాన్పించి నేటివ్ ఎడ్యుకేషను సొసైటీ పాఠశాలకు పంపించారు. ఈ సంగతి స్పష్టంగా తెలిసీకూడా ఆ పాఠశాల అధికారులు 10 మంది పిల్లలను చేర్చుకున్నారు. దీనితో ఆండర్సను వ్యవహారం బెట్టు తప్పింది.

ఆండర్సనుచర్యకు ఇష్టపడనివాళ్లు చాలామంది ఏమి జరుగుతుందో చూద్దాము' పిల్లలను ఇంటిదగ్గరే అట్టేపుంచారు. తాను క్రైస్తవ మతప్రచారకులయొక్క మేలుకోరి ఇలాంటి సంస్కరణచేస్తే దానికి భంగం కలిగించేటట్లుగా తోటిదొరలు తన పాఠశాలలోనుంచి పోయిన పిల్లలను తమ పాఠశాలలో చేర్చుకోవడం ఎంతమాత్రమూ బాగాలేదని ఆండర్సనుగారు ఆ పాఠశాల అధికారులకు గట్టిగా వ్రాశారు. కాని లాభం లేకపోయింది. ఆండర్సను అధైర్యం చెందక తన బడిపెద్దలను*

---

* "బడిపెద్దలు - మానిటర్లు". బడిపెద్ద అనగా ఉపాధ్యాయునికి సహాయత్వము వహించు ముఖ్యవిద్యార్థి అని శబ్దరత్నాకరంలో అర్థం వ్రాయబడి వున్నది. పూర్వం మన వీధిబడులలో ఓనమాలు మొదలు పెద్ద పుస్తకాలవరకూ చదివే వేరువేరు తరగతుల పిల్లలువున్నా వారికి వేరువేరే బడిపంతుళ్లు వుండేవారు కారు. ఒకే బడిపంతులు బడినంతా నడిపేవాడు. పిల్లలలో తెలివైనవాళ్లచేత చిన్నపిల్లలకూ, కింది తరగతివారికీ పాఠాలు చెప్పించేవాడు. ఈ పిల్లలనే బడిపెద్దలనేవారు. ఇంగ్లీషువారి దేశానికి

(మానిటర్లను) దీనినిగురించి ఏమీ మాట్లాడవద్దనిన్నీ, ఎప్పటిలాగనే పాఠాలు చెప్తూతూ వుండమనిన్నీ ఉత్తరువు చేశాడు. దీనినిగురించి పాఠశాల వెలపల ఊళ్ళో జరుగుతూవున్న గడబిడ ఈ బడి పెద్దలలో చాలా నిబ్బరమైన గుండెగలవారికి కూడా కొంత అస్థైర్యము కలిగించింది; గాని డిసెంబరు నెలాఖరు నాటికి ఈ గడబిడ కొంత సద్దు అణగింది. పాఠశాలలో నుండిన 277 మంది పిల్లలలో ఒక వందమంది ఈ కారణంవల్ల బడి మానివేశారుగాని ఆండర్సను తన పట్టు వదలలేదు.

తమ మతాచారాల విషయంలో యీ దేశీయులు కొంత బెట్టుసరి చేసినా చివరకి ఏ పాఠశాలలో చౌకగానూ, బాగానూ చదువు చెప్తారో ఆ పాఠశాలకే పంపుతారని ఆండర్సను గ్రహించి 1839 లో సంవత్సరోత్సవంలో ఆ సంగతి స్పష్టంగా పైకి చెప్పివేశాడు. అందువల్లనే తనబడిలో నెలకి అర్ధరూపాయిచొప్పున మాత్రం జీతం నిర్ణయించాడు. కొన్నాళ్లకు హిందువులు తమ పిల్లలను మళ్ళీ పంపడం ప్రారంభించారు.

చెన్నపట్నంలో ఆండర్సను పాఠశాలలో పంచముల తగాదా జరుగుతూవుండగా కలకత్తాలో అలెగ్జాండరు డఫ్ యొక్క విద్యాప్రచారంవల్ల గొప్పయింటి హిందువులపిల్లలు క్రైస్తవమతంలో కలియడము తటస్థించి అక్కడిప్రజలు

---

వచ్చిన తరవాత ఈ పద్ధతిలో వుండే లాభాలుచూసి తమ పాఠశాలల్లో కూడా దీనిని ప్రవేశపెట్టారు. బడిపెద్దలను మానిటర్లనేవారు. చెన్నపట్నం కోటలో వుద్యోగం చేసిన బెల్ అనే దొర ఈ పద్ధతిని సీమలోకూడా ప్రవేశపెట్టాడు. దీనికి మద్రాస్ సిస్టం అని పేరువచ్చింది. (Memories of Madras - Sir Charles Laws on pp. 216-217.)

తల్లడిల్లుతున్నారు. బొంబాయిలో కూడా క్రైస్తవ ప్రచారంవల్ల యిద్దరు పార్శీయువకులు క్రైస్తవమతంలో కలిశారు. అప్పుడు పార్శీవారు గుమిగూడి యీ క్రైస్తవ బాలురపైని దౌర్జన్యం చేయడానికి ప్రయత్నించారు. శాంతికి భంగం కలగకుండా సర్కారువారు చర్య తీసుకోవలసి వచ్చింది. ఈ సమాచారం దేశంలో త్వరలోనే పాకింది.

కంచిలో కలెక్టరుగా వుండిన ఆర్థర్ ఫ్రీజ్ అనే అతడున్నూ, యింకా కొందరు దొరలున్నూ జాన్ ఆండర్సను గారిని అక్కడికి వచ్చి ఒక క్రైస్తవ పాఠశాలను స్థాపించవలసినదని కోరారు. ఆ ప్రకారం 1839 లో ఆండర్సను అక్కడికి వెళ్ళి ఒక పాఠశాల స్థాపించాడు. కంచికి గరుడసేవకు వచ్చినవారివల్ల చెన్నపట్నం పాఠశాలలో జరుగుచున్న క్రైస్తవప్రచారం సంగతి అక్కడి ప్రజలకు తెలిసింది. బొంబాయి సమాచారంకూడా వీరికి తెలిసింది. తమను మతంలో కలుపుకోడానికే యీ ఆండర్సను వచ్చాడని వారు అనుమానపడి వెనుకాడారు; కాని కచ్చేరిలో ఉద్యోగంచేసే బ్రాహ్మలు కొందరు పై అధికారుల మొహమ్మాటంకోసము కొత్త పాఠశాలకు తమ పిల్లలను పంపారు. ఈ సంగతిని ఆండర్సనుగారే 1839 జూన్ 1వ తేదీన వుత్తరంలో వ్రాశారు.

"మన విరోధులు అప్రమత్తులై వున్నారు గనక మనం చాలా జాగ్రత్తగా వుండాలి. మనం వేసిన పతకంలో మనం మెల్లిగా పోవాలి" అని జూన్ 13 వ తేదీన వ్రాశారు. ఆ వుత్తరంలోనే ఆ వూరి తాశీల్దారు తన పిల్లవాడిని తమ పాఠశాలకు పంపినసంగతి కూడా వ్రాశారు. కలెక్టరుగారి

మొగం మెప్పుకోసమే అతడు ఇలా చేశా డనడంలో తప్పే ముంది ?

"సైతాను తలఎత్తినాడు. అతనితోకూడ బ్రాహ్మలున్నూ తల యెత్తినారు" అనిన్నీ, వీరికి భయపడి కొన్నాళ్లు బైబిలు పాఠము ఆపవలసినదని తనకింద పనిచేసే ఉపాధ్యాయు డొకడు కోరితే అందుకు తాను సుతరామూ ఒప్పుకోలేదనిన్నీ ఆండర్సనుగారు వ్రాశారు. ఆ సమయంలో చెన్నపట్నంలో దేశీయులు కొందరు కలిసి ఈ క్రైస్తవ ప్రచారాన్ని అరికట్టడం ఎలాగా అని ఆలోచిస్తున్నట్లు తనకు తెలుస్తున్నదనికూడా ఆండర్సనుగారు వ్రాశారు.*

హిందువులు మేలుకొని స్వధర్మ రక్షణకోసం పని చేయడానికి ప్రారంభించినట్లు దీనివల్ల స్పష్టపడుతూ వుంది. 1839 ఫిబ్రవరి నెలలో సర్కారువారు ఒక పాఠశాల స్థాపించ డానికి ప్రయత్నిస్తూదానినిగురించి ఆండర్సన్‌గారిని అభిప్రాయ మివ్వమని అడిగితే జనసామాన్యానికి విద్యనేర్పడమున్నూ, ఉపాధ్యాయులకు బైబిలు నేర్పే బోధనాభ్యాసనశాల స్థాపించడమున్నూ ముఖ్యమైన కర్తవ్యములని ఆండర్సను చెప్పాడు. § ఆండర్సనుగారి క్రైస్తవ మతప్రచారము మెల్లిగా వేళ్ళు పారి నాటుకున్నది. 1840 సం॥ జూన్ నెలలో ఆండర్సనుగారు వ్రాస్తూ తమ ఉపాధ్యాయు డొకడు చెంగల్పట్టులో సర్కారు ట్రాన్సులేటరుగా పని చేస్తూ వున్నా

* True Yoke fellows-Life and labours of John Anderson and Robert Johnston By J. Braidwood. page 106.

§ Ibid Page 118.

డనిన్నీ, ఇంకొకడు అక్కడ పాఠశాల నడుపుతున్నాడనిన్నీ వ్రాశారు.

నెల్లూరులో తూర్పు ఇండియా కంపెనీకింద పని చేసే వైద్యాధికారి ఫ్రెడరిక్ కూపర్ అనే అతను అక్కడ తెలుగు, ఇంగ్లీషు నేర్పే పాఠశాల ఒకటి నడుపుతూ దానిని క్రైస్తవ మిషను కిందికి తీసుకొని నడపమని ఆండర్సనుగారిని కోరగా, ఆండర్సనుగారు 1840 ఆగస్టునెలలో ఆ ప్రకారం చేశారు. దేశీయులు చేసే పనులన్నింటికీ ఏదో అభ్యంతరం కలుగుతూ వుంటే యీ క్రైస్తవమతప్రచారాన్ని అరికట్టడానికి దేశీయులు ప్రయత్నిస్తూవున్నా, యిది యిలా అభివృద్ధిచెందడం చూచి వారు చాలా ఆశ్చర్యపడుతున్నారని జాన్‌స్టనుగారు 1840 ఆగస్టు 15 వ తేదీన వ్రాశారు.

1840 అక్టోబరులో చెంగల్పట్టులో జిల్లాజిడ్జిగా వుండిన డబ్లియు. ఏ. మోర్‌హెడ్ అనే దొర అక్కడ దేశీయులను ఒక పాఠశాల స్థాపించమని ప్రోత్సహించి దాని కొక ఉపాధ్యాయుణ్ణి పంపవలసినదని ఆండర్సనుగారిని కోరారు. అక్కడ క్రైస్తవపాఠశాలశాఖను స్థాపించడానికిది కారణం అయినది. ఈ మోర్‌హెడ్‌గారు క్రైస్తవమతప్రచారకులకు కుడిభుజంగా పనిచేశారు.

1840 నవంబరు 2 వ తేదీన చెన్నపట్నం క్రైస్తవ పాఠశాల కన్వీనరు యిలాగ వ్రాశాడు :—

"సర్కారు కాలేజీ అనే పాఠశాలను స్థాపించడంవల్ల మనకు కొంత యిబ్బంది కలిగిందని చెప్పడానికి సందేహం లేదు. అయితే పంచముల తగాదా సమయంలోనే యిది

స్థాపిస్తే మనం యింకా కష్టపడేవాళ్ళము". ఇలాగ వ్రాయడానికి కారణం సర్కారుపాఠశాలలో బైబిలుపాఠం లేకుండా లౌకికవిద్యమాత్రమే చెప్పడానికి నిశ్చయించడమే. ఇందువల్ల క్రైస్తవ మతప్రచారానికి దెబ్బతగిలిందని వారియూహా !! అయితే అధికారుల తోడ్పాటుతో యీ పాఠశాలలోకూడా పిల్లలు బైబిలు చదివేటట్లు చేయడానికి మిషనరీలు కొన్ని ఉపాయాలు పన్నారు. ఆ పాఠశాల 1841 లో స్థాపింపబడిన తరవాత మిషనరీలున్నూ, వారిస్నేహితులున్నూ ఆ పాఠశాలలో పిల్లలను పరీక్షచేయడానికి నియమింపబడుతూ వచ్చినందువల్ల పిల్లలను బైబిలును గురించి ప్రశ్నించి జవాబు చెప్పలేనివారిని పరీక్షలలో తప్పించేవారు.

1840 అంతంనాటికి క్రైస్తవ మిషనరీల ఉద్దేశ్యాలలో ఒకటి నెరవేరింది. ఆండర్సను పాఠశాలలో తర్ఫీదుపొందిన దేశీయ బడిపంతుళ్ళు కొందరు బయలుదేరి ఇతరపాఠశాలలలో బైబిలు బోధలుచేయడం ప్రారంభించారు. మైసూరు మహారాజుగారి పాఠశాలలో ఒకడు, కంచిలో ఒకడు, నెల్లూరులో ఒకడు, చెన్నపట్నం పాఠశాలలోని పంతుళ్ళున్నూ కలిసి మొత్తం 18 మంది తయారైనారు.

1841 వ సంవత్సరం జూన్ 20 వ తేదీని ఆదివారం రోజున ఆండర్సనుగారి అసలు ఉద్దేశ్యం ఫలించింది. ఆరోజు సాయంత్రం నల్లవారి బస్తీలో వున్న మిషనుభవనంలో పి. రాజగోపాల్ అనే మొదలియారు యువకుడినిన్నీ, చిల్లర వ్యాజ్యాల కోర్టు జడ్జిపనిచేసిన సి. రామయ్యగారి మనమడైన ఏ. వెంకటరామయ్య అనే యువకుడినిన్నీ ఆండర్సనుగారు

క్రైస్తవమతంలోకలిపారు. మర్నాడు సోమవారంనాడుతగాదా ప్రారంభమైనది. ఈ యువకులను క్రైస్తవ మతంలోనుంచి మళ్లీ వెనక్కి హిందూమతంలోకి పొద్యేటట్టు చెయ్యాలని వారి బంధువులు, స్నేహితులు, కులమువారు చేసిన బ్రహ్మ ప్రయత్నాలకు అంతులేదు. మిషనరీలు ఈ యువకుల ఇష్టానికి వ్యతిరేకముగా వారిని నిర్బంధించి యుంచినారని చెప్పి చెన్నపట్నం పోలీసు మేజస్ట్రేటుల కోర్టులో ఫిర్యాదు చేసి ఈ యువకులను కోర్టులో హాజరుపరచి సంగతి విచారించేటట్లు వారంటు పొందారు. అంతట మిషనరీలు ఆ యువకులతో కోర్టులో హాజరైనారు.

ఆ కాలంలో చెన్నపట్నం పోలీసు మేజస్ట్రేటులకోర్టులో వున్న మేజస్ట్రేటులలో ప్రధాన అధికారి జె. హెచ్. బెల్. ఇంకొక మేజస్ట్రేటు డాల్రింపుల్. ఈ ఇద్దరూ స్కాట్లాండు దేశపు వారలు. ఆండర్సనుగారిపైనా క్రైస్తవ మతంపైనా అభిమానం కలవారు. తరవాత ఆండర్సనుగారి క్రైస్తవ ప్రచారంలో ఆయనపట్ల విరోధించిన హిందువులు ఆయనకు అపాయం కలిగించకుండా అతనికి బందోబస్తు యిచ్చిన్నీ, రక్షించిన్నీ అనేక విధాలుగా తోడ్పడ్డారు. ఇంకొక మేజస్ట్రేటు వడగల బ్రాహ్మణుడైన వెంబాకం రాఘవాచార్యులుగారు.

వెంబాకం రాఘవాచార్యులుగారు ఆ కాలంలో చెన్నపట్నంలో కుంపినీవారి కొలువులో పోలీసుసూపరెంటుగాను, మేజస్ట్రేటుగానూ పనిచేసి ప్రఖ్యాతి చెందినవారు. సుప్రీము కోర్టు ఇంటర్ ప్రిటరైన ఏనుగుల వీరాస్వామయ్యగారూ, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారూ, వీరూ కలిసి 1832 లో

హిందూ లిటరరీ సొసైటీని స్థాపించి ప్రజాసేవ చేశారు. మణేగారు సత్రానికి ధర్మకర్తలలో వొకరు. పచ్చయ్యప్ప గారి ధర్మాలను గురించి సుప్రీముకోర్టు 1832 లో చేసిన స్కీముప్రకారం నియమింపబడిన ధర్మకర్తల బోర్డుకు రాఘవాచార్యులుగారు అధ్యక్షులు. వీరు 184ఽ లో పరమపదించారు. ఈయన కొంతకాలము పోలీసుసూపరెంటుగా వుండి తరవాత పోలీసుకోర్టు అని పిలువబడే కచ్చేరీలో వీరు మేజస్ట్రేటుగా వుండేవారు. అందువల్ల వీరిని ప్రజలు "పోలీసు" రాఘవాచార్లుగారనేవారు. వీరిపేరిట ఇప్పటికీ చెన్నపట్నంలో పోలీసు రాఘవాచారివీధి అని ఒకవీధి ఉన్నది.

వెంకట్రామయ్య కేసు విచారణకు వచ్చినప్పుడు కోర్టులో ప్రధాన మేజస్ట్రేటుగారైన బెల్‌గారు హాజరుగా లేరు. డార్లింపుల్‌గారున్నూ, రాఘవాచార్యులుగారున్నూ కొలువు కూటంలో వున్నారు. రాఘవాచార్యులుగారు వెంకట్రామయ్యను చాలా ప్రశ్నలు వేశారు. అతనివయస్సు ఎంత అనిన్నీ, మిషనరీలు అతని నేవిధమైన నిర్బంధంలోనైనా వుంచారేమోననిన్నీ, క్రైస్తవమతంలో కలవడానికి అతని కేదైనా ఆశలు కల్పించారేమోననిన్నీ తెలుసుకోవడానికి చాలా ప్రశ్నలు వేశారు. ఆ ప్రశ్నలలో ఒకటి చాలా గడ్డు ప్రశ్న. "నీవు ఈ మిషనరీలదగ్గరకు రాకపూర్వం మీవాళ్ల దగ్గర వున్నప్పుడు, అంతకుముందు క్షణంవరకుకూడా విగ్రహారాధన చేస్తూవుండినవాడవేకదా" అని అడిగారు. "అవును నేను అలా చేసినమాట వాస్తవమే. ఈ విగ్రహారాధన విసర్జించి నా అంతరాత్మబోధప్రకారము నడచుకోడానికే నే

నిప్పుడు క్రైస్తవుడ నైనాను" అని వెంకట్రామయ్య జవాబు చెప్పాడు. "సరే ఇక నీ యిష్టంవచ్చినచోటికి వెళ్లవచ్చు" నని రాఘవాచార్యులుగారు అన్నారు. ఈ తీర్మానం వెంకట్రామయ్య తండ్రి విని "అయ్యయ్యో! ఇదేమిపాపకర్మమండీ, న్యాయంకోసం మీ దగ్గరికి వస్తే నా కుర్రవాణ్ని మీ రిలాగ పరాయివాళ్ళకు అప్పగించి పంపేస్తున్నారు!" అని గోల పెట్టాడు. అంతట రాఘవాచార్యులుగా రిలాగ అన్నారు. "ఈ అండర్సనుగారు చేసిన మోస మేమీ లేదు. ఈ పాఠశాల నడపడంలో తన వుద్దేశ్యం క్రైస్తవమత ప్రచారమేనని అతడు మొదటినుంచీ ఘంటాపథంగా చెపుతూనే వున్నాడు. పిల్లలను క్రైస్తవమతంలో కలపడమే అతని వుద్దేశమని నేను కూడా మీ అందరికి చెప్పేవున్నాను. మీరు నా మాటలు వినకుండా మీ పిల్లలను అతని దగ్గిరికి పంపారు. దాని ఫలితం మీరు యిప్పుడు అనుభవిస్తున్నారు" అని రాఘవాచార్యులుగారు అనేటప్పటికి ఎవరూ జవాబు చెప్పలేకపోయారు. రాజగోపాలుని కేసు విచారించేటప్పుడు బెల్‌గారుకూడా వచ్చారు. ఆ కేసుకూడా విచారించి మేజస్ట్రేటులు అతనిని నీయిష్టం వచ్చిన చోటికి వెళ్లవచ్చునని వుత్తర్వుచేశారు.

ఈ యువకులు మళ్ళీ క్రైస్తవ మతబోధకులతో పోతూ వుండగా బయట ప్రజలగుంపు దౌర్జన్యంగా వీరిమీదపడి వీరిని లాక్కొనిపోవాలని ప్రయత్నించారు గాని. ప్రధాన మేజస్ట్రేటుగారు వీరిని రక్షించారు. దీనివల్ల చెన్నపట్నం ప్రజలలో చాలా ఉద్రేకం కలిగింది. ఈ మిషనరీలను కొడతామని బెదరిస్తూ ఆకాశరామన్న వుత్తరాలు రావడమూ, వీరియిళ్ల

పైన రాళ్ళుపడడమూ చూచి వీరు భయపడి నెలాపదిహేను రోజులు బయటికి రాలేదు. వారు యతిరాజులు అనే అతనిని ఆగష్టు 3 వ తేదీన క్రైస్తవ మతంలో కలిపారు. ఇది విని ప్రజలు యింకా ఆవేశపూరితులైనారు. కొందరు యువకులను బలవంతంగా పాఠశాలలోనుంచి బయటికి తీసుకొనిపోయి నారు. ఈ క్రైస్తవమత ప్రచారాన్ని అరికట్టడానికి ఏమి చేద్దామా అని ఆలోచనలు సాగించారు. ఇంతవరకూ స్తబ్ధము గానూ, నిర్జీవముగానూ పడివున్న హిందువులు మేల్కొంచి ఈ క్రైస్తవ మిషనరీలపైన కత్తిగట్టుటకు లేచారు. ఈ యువ కులను క్రైస్తవమతంలో కలపడంవల్ల చెన్నపట్నంలో మిష నరీ పాఠశాల లన్నింటికీ దెబ్బతగిలింది. కొన్ని పాఠశాలలు అసలే మూసివేశారు. మిషనరీ అనేమాటే కర్ణకఠోరమైన శబ్దంగా పరిణమించింది. ఈ ప్రొటెస్టెంటు క్రైస్తవమిషనరీలకు విరోధులైన రోమను క్యాతలిక్కు మిషనరీలు, జెసూట్లు హిందువులకు తోడ్పడ్డారు. హిందువులు తమ కులకట్టు నుపయో గించి, బహిష్కారణమును ప్రయోగించి మిషనరీ పాఠశాలలోని బడిపెద్దలను, విద్యార్థులను లాంగదీసి పాఠశాలలోనుంచి వెళ్ళి పోయ్యేటట్లు చేయగలిగారు. ఈ క్రైస్తవమత ప్రచారాన్ని అరికట్టడానికి ఈ మిషనరీ పాఠశాల మూలాధారంగా వున్నది గనుక దీనిలోకి పిల్లలను పంపకుండా దీనికి పోటీగా వుండడానికి 'హిందూయూనియను స్కూలు' అనే కొత్త పాఠశాలను స్థాపించారు. మిషనరీపాఠశాలలో పనిచేసే బడి పంతులనే నెలకి 50 రూపాయిల జీతమిచ్చి ఆ పాఠశాలలో నియమించారు.

ఆండర్సనుగారి పాఠశాలకు దెబ్బతగిలింది. బడి పెద్దల తరగతి (Monitorial or college class) పోయింది. ఒక్క బడిపెద్దఅయినా లేకుండాపోయినారు. 13 తరగతులు, 400 పిల్లలు వుండిన యీ పాఠశాల యీ సుడిగాలిలో అదృశ్యమైనది. పదిహేను రోజులవరకూ మళ్ళీ పాఠశాల అంటూ ఏర్పడుతుందనే ఆశ లేకుండాపోయింది. ఒక బడి పెద్దను ఉత్తరాదికి, ఇంకొకనిని పడమటితీరానికి తీసుకొని పోయారు. మహమ్మారి అంటువ్యాధి తగిలినవారి నుంచే ఆసుపత్రిని చూచినట్లుగాచూచి ప్రజలు, వారిపిల్లలు యీ మిషను పాఠశాల దగ్గరకు రాకుండా దూర దూరంగా పోయారు. యతిరాజులను మతంలో కలిపిన నెలరోజులకు పెద్దతరగతిలో పిల్లలే లేరు. క్రింద తరగతిలో 24 మంది మిగిలారు. ఇంకొక నెలకు 50 మంది అయినారు. పై తరగతిలోకి 30 మంది వచ్చారు. కంచిలోకూడా దీనిఫలితంగా పిల్లలు బడి మాని వేశారు.

1841వ సంవత్సరం సెప్టెంబరులో అండర్సను నేటీవు హెరాల్డు అనే పత్రికను స్థాపించి క్రైస్తవ మతప్రచారం చేయడం ప్రారంభించాడు. అందులో ఇతడు వ్రాసిన తీవ్రమైన వ్రాతలు హిందువులను, వారి మతమును తిట్టిన తిట్లు చాలమంది దొరలకే ఆశ్చర్యము, కష్టము కలిగించాయి. ఆ సమయంలో ఒక ఇంగ్లీషు క్రైస్తవుని సంపాదకత్వమున ప్రకటింపబడుతూ వుండిన పత్రిక ఇతని వ్రాతలను విమర్శింప

సాగింది. చెన్నపట్నంలో సంపన్నులైన హిందువులు కంచిలో మిషను పాఠశాలలో పనిచేస్తూవున్న రామానుజులనే బడి పంతులను నెల 1 కి రు 100 లు జీతమిస్తామని రమ్మన్నారు గాని అతడు ఒప్పుకోలేదు.

# చెన్నపట్నం ప్రజల సంక్షోభం

పచ్చయ్యప్ప మొదలియారు అనే ధర్మాత్ముని పేరిట బీదలైన హిందువుల పిల్లలకు ఉచితంగా ఇంగ్లీషు సాహిత్యము, ప్రకృతిశాస్త్రము, తెలుగు, అరవము బోధించే ప్రాథమిక పాఠశాల ఒకటి 1842 వ సంవత్సరం జనవరి నెలలో నల్లవారిబస్తీలో స్థాపించబడింది. కుంపినీవారు 1841 లో స్థాపించిన మద్రాసు యూనివర్సిటీ అనే ఉన్నత పాఠశాలలో చేరదలచిన పిల్లలకు ఇంగ్లీషు చదవడం వచ్చివుండాలనే నిర్బంధం వున్నందువల్లనూ, ఆండర్సనుగారి మిషనరీ పాఠశాలలో బైబిలు, క్రైస్తవమతము బోధిస్తూ వున్నందువల్లనూ అది యిష్టంలేని ధనవంతులకుకూడా తమ పిల్లలకు ప్రారంభ విద్య చెప్పించేటందుకు యిబ్బందిగా వుండేది. ఈ పచ్చయ్యప్పగారి పాఠశాల స్థాపించడంవల్ల ఆ కొరత తీరింది. పై కారణంవల్లనూ, ఇక్కడ జీతాలు లేనందువల్లనూ త్వరలోనే ఈ పాఠశాల అభివృద్ధి జెందింది. పిల్లలు వందలకొద్దీ చేరడానికి వచ్చారు. చోటులేక చేర్చుకోవడానికి వీలులేనంతవరకూ చేర్చుకునేవారు. ఈ పాఠశాల శాఖోపశాఖలతో వృద్ధిజెంది చివరకు నేటి కళాశాలగా పరిణమించింది. ఈ పాఠశాల చరిత్ర చాలా విచిత్రమైనది. కుంపినీవారి కాలంలో దుబాషిగా వుండిన పచ్చయ్యప్ప మొదలియారుగారు చనిపోయేటప్పుడు

కొన్ని లక్షల రూపాయలు దానధర్మాలకు చెందచేస్తూ మరణ శాసనం వ్రాశాడు ఆయన వారసులు ఆ ధర్మాలు నిర్వహించక సొమ్ము తినివేశారు. అంతట చెన్నపట్నం సుప్రీము కోర్టులో అడ్వకేటు జనరల్‌గా వుండి 1827 లో విరమించుకున్న కాంప్టన్ గారున్నూ, తెలుగు అరవములు తర్జుమాచేసే ప్రధాన ఇంటర్‌ప్రిటరుగా వుండిన ఏనుగుల వీరాస్వామయ్య గారున్నూ ఆ మరణశాసనం దాఖలా ధర్మాలను బయటకు తీసి, సుప్రీముకోర్టులో వాటిని గురించి ఒక స్కీము తయారు చేయించారు. దానిప్రకారము 1832 లో నియమింపబడిన హిందూ ధర్మకర్తల బోర్డుకు వెంబాకం రాఘవాచార్యులు గారిని అధ్యక్షులుగా నియమించారు. కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారు మొదలైనవారిని సభ్యులుగా నియమించారు. రాఘవాచార్యులుగారు 1842 లో చనిపోగా, శ్రీనివాసపిళ్లగారే అధ్యక్షులైనారు. 1841 నాటికి ఈ ధర్మం తాలూకు సొమ్ము ఏడులక్షలకు పైగా లెక్క తేలింది. దాని వినియోగాన్ని గురించి సుప్రీముకోర్టువారు చేసిన తీర్మానము ప్రకారము పైన చెప్పిన పాఠశాల స్థాపింపబడింది.

ఆండర్సనుగారి పాఠశాల వార్షికోత్సవం 1842 వ సం. జనవరి 6 వ తేదీన జరిగింది. సుప్రీముకోర్టు ప్రధానన్యాయమూర్తి గేంబియరుగారు అగ్రాసనాధిపత్యము వహించాడు. 278 మంది విద్యార్థులు హాజరైనారు తమ మేలునుగోరి ఈ మిషనరీలు చేస్తూవున్న కృషిని దేశీయ ప్రజలు గమనించకపోవడమునకు న్యాయమూర్తిగారు తమ విచారమును వెలిబుచ్చారు. ఆండర్సనుగారి చర్యలో ఏమీ లోపము

లేదని సెలవిచ్చారు. 1842 మే నెల 14 వ తేదీన ఆర్. సుబ్బ రాయను అనే అతనిని, 1842 వ జూలైలో రామానుజుల నున్నూ మిషనరీలు క్రైస్తవ మతంలో కలిపినారు. హిందువు లలో మళ్లీ అలజడికలిగింది. రామానుజులతల్లి, తోడబుట్టినది అందరూ వచ్చి అతని మనస్సు విరిచారు. పాఠశాలలోని బాలురసంఖ్య మళ్లీ తగ్గిపోయినది.

ఏలాంటి కదలికయున్నూ లేకుండా పడివున్న హిందూ మతము 1841 లో కొందరు క్రైస్తవమతంలో కలియగానే అట్టుడికినట్లు ఉడికి సంచలనం పొందింది. విజృంభిస్తూ వున్న క్రైస్తవమత ప్రచారాన్ని అరికట్టడానికి హిందువులు కొత్తపాఠశాలలు స్థాపించారు. వార్తాపత్రికలు స్థాపించి విగ్రహారాధనను, వర్ణాశ్రమ ధర్మాన్నీ సంరక్షించుకొన డానికి కొన్ని ప్రయత్నాలు చేశారు. సర్కారు నౌకరీలో వుండి తెలివితేటలున్నూ, హోదాయున్నూ కలిగివున్న ఒక బ్రాహ్మణ పెద్దమనుష్యుడు సర్కారు శాసింపబోవు శిక్షా స్మృతిని గురించి ఇంగ్లీషులో ఒక కరపత్రాన్ని ప్రకటిస్తూ దేశీయులను యింకొక మతంలోనికి కలుపుకోవడం సంఘ క్షేమానికి భంగకరమనిన్ని, దానిని నిషేధించి శిక్షార్హముగా చేయవలెనిన్ని వ్రాశాడు. ఇదివరకు హిందూమతాచారము లను కుంపినీవారు సంరక్షిస్తూ, దేవాదాయములున్నూ ధర్మాదాయములున్నూ కూడా పరిపాలిస్తూ యిప్పుడు వాటితో జోక్యం విరమించుకోవడం బాగాలేదనిన్నీ మనవి చేస్తూ అప్పట్లో చెన్నపట్నం గవర్నరుగా వుండిన ఎల్ఫిన్స్టన్ ప్రభువుకు హిందువు లోకమహాజరును సమర్పించారు.

క్రైస్తవమతాన్ని అవమానించడానికి ఇంకను చిత్రమైన ప్రయత్న మొకటి జరిగింది. ఒక హాస్యగాడికి కొంత సొమ్మిచ్చి మిషనరీ వేషం వేయించి శాలవీధిలో ఒక చిన్న తిన్నెపైకి ఎక్కించి అరవములో అచ్చువేయబడిన బైబిలుగ్రంథం ప్రక్కను వుంచుకొని మిషనరీలు చేసేటట్లుగా పాడుతూ భజన చేస్తూ మతబోధచేస్తూ ప్రార్థిస్తూ వున్నట్లుగా అభినయింపజేశారు. లక్ష్మినరసు ప్రకటిస్తూ వుండిన నేటీవు హెరాల్డు పత్రికలో దీనిని గురించి చర్చించి ఇది చాలా అక్రమమని వ్రాశారు. లక్ష్మినరసుగారు తమపత్రికలో హిందువుల విగ్రహారాధనను, మతాచారములను ఖండిస్తూ కొన్ని వ్యాసాలు వ్రాశారు. నేటీవు ఎడ్యుకేషను సొసైటీస్కూలు అభిమాని యొకడు అరిస్టైడిన్ అనే మారుపేరుతో చెన్నపట్నంలో ప్రకటించబడే "ఎతేనియం" అనే ఇంగ్లీషుపత్రికలో మిషనరీలను గురించిన్నీ, లక్ష్మినరసుగారి మిషనరీపాఠశాలను గురించిన్నీ, క్రైస్తవమతంలోకి కలుపుకోవడానికి వీరు అవలంబించే పద్ధతులను గురించిన్నీ విమర్శించాడు. దీనినిగురించి లక్ష్మినరసుగారు సమర్థించుకుంటూ కొన్ని వ్యాసాలు వ్రాశారు.

1844 సంవత్సరంలో క్రైస్తవమతప్రచారం చాలా తీవ్రంగా సాగింది. చెంగల్పట్టులో జిల్లాజడ్జీ అయిన మోర్‌హెడ్డుగారు మిషనరీ పాఠశాల పరీక్షలు జరపడానికి కచేరీ చావడిని యిచ్చారు. ఇందువల్ల కోర్టు ఉద్యోగులకు, పార్టీలకు, ఆ బస్తీలోని యితర సంపన్నులకు కూడా మతబోధను చేయడానికి మిషనరీలకు అవకాశంకలిగింది. ఆవూరి సదరు అమీను ఒక హిందువుడు. అతడు మోహమ్మదీనికోసం తన ముగ్గురు పిల్ల

లను మిషనరీపాఠశాలలో చదివిస్తూ 30 రూపాయలు విరాళం యిచ్చాడు.

సి. విశ్వనాథం అనే బ్రాహ్మణయువకుడు 19 యేళ్ళ వాడు. చెన్నపట్నంలో ఆండర్సను పాఠశాలలో చదువుతూ వున్నవాణ్ణి 1844 వ సంవత్సరం మార్చి 28 వ తేదీన క్రైస్తవమతంలో కలిపినారు. అతని తల్లి తోడబుట్టినది వచ్చి గోలచేశారు గాని, అతడు విన లేదు. బయట ప్రజలగుంపు చేరి గడబిడలు చేస్తున్నారు. ఆతనిని మిషనరీలు నిర్బంధించి వుంచినట్లుగా చెపుతూ అతని బంధువులు పోలీసు కోర్టులో పిటీషను పెట్టి అతనిని కోర్టుకు హాజరుపరచవలసినదని వారంటు పుట్టించినారు. ఆ వారంటు తెచ్చిన కానిస్టేబులు ఆండర్సనువాకిట నిలిచివున్నాడు. అయినా ఆండర్సను జంకు లేకుండా యీ యువకుణ్ణి మతంలో కలిపి తరువాత కోర్టుకు హాజరుపరచినాడు. అక్కడ పోలీసు మేజస్ట్రేట్లు ఇతనిని కొన్ని ప్రశ్నలు అడిగి వదిలివేశారు. వీరిని దౌర్జన్యం చెయ్యాలని ప్రజలగుంపు ప్రయత్నించినా కానిస్టేబులు సహాయముతో మళ్లీ ఆండర్సనుగారు మిషను భవనం చేరారు.

ఈ బ్రాహ్మణ యువకుణ్ని క్రైస్తవ మతంలో కల పడంవల్ల దేశంలో ఒకవిధమైన భయం వ్యాపించింది. దీని ఫలితంగా ప్రతిమిషను పాఠశాలలోనూ పిల్లలు బడిమాని వేశారు. కొన్నిబళ్లు పూర్తిగానే మూసివేయవలసి వచ్చింది. ఈయువకుడు మతంలోకలిసిన సందర్భముల వాస్తవచరిత్ర అంద రికీ తెలియవలెనని ముఖ్యంగా దొరలకు తెలియవలెనని ఎతే

నియంపత్రికలో ప్రకటించారు. స్పెక్టేటరు అనే పత్రికయొక్క సంపాదకుడు తనకు స్వయముగా తెలిసినసంగతులను ప్రకటించాడుగాని, ఏమీ లాభంలేకపోయినది. అనేక వార్తలు పుకారులు వ్యాపించాయి. దేశీయులు తిట్లు శాపనార్థములు బెదరింపులువర్షించారు. రాజబాటలపైనపోయేఅసహాయులైన బాటసారులను క్రూరంగా కొట్టి హింసించారు. హిందువులు తురకలుకూడా తమ పిల్లలను క్రైస్తవ మతప్రచారకులు ఎత్తుకొనిపోయి తమ మతంలో కలుపుకుంటారనే భయంతో ఇళ్ళల్లో గదులలో పెట్టి తలుపులు వేసేవారు. చెన్నపట్నానికి రెండువందలమైళ్లదూరములో సూర్యాస్తమయమయినతరువాత చెన్నపట్నాన్నుంచి వచ్చి మచ్చుమందు జల్లి తమర్ని కులభ్రష్టం చేస్తారనే భీతితో ఆడవాళ్లు తమ యిళ్ల తలుపులను వేసుకొని కూర్చునేవారు. ఈ జైన బ్రాహ్మణ యువకుని క్రైస్తవమతంలో కలుపుకొనడంవల్ల హిందూసంఘము, దేశము ఇలాగ సంక్షుభితమైపోయింది.

విశ్వనాథం క్రైస్తవుడైన తరవాతరోజున చెన్నపట్నంలో ఇంగ్లీషు తరగతిలో 75 మంది పిల్లలుమాత్రమే హాజరైనారు. మతం పుచ్చుకున్నవారు నడిపే బైబిలు తరగతిలో పిల్లలే లేకుండాపోయినారు. రెండు నెలలకుకూడా దీని ఫలితములు తగ్గలేదు. ఇద్దరు తప్ప తక్కిన బడి పెద్దలందరూ పలాయనమైనారు. చెన్నపట్నంలో నల్లవారి బస్తీలోను, తిరువలిక్కేణిలోను కలిసి 300 మంది పిల్లలు పలాయనమైనారు. కంచిలోను, చెంగల్పట్టులోనుకూడా పిల్లలు బడి మాని వేశారు. ఇదివరకు జరిగినకృషిలో సగభాగం పూర్తిగా నాశన

మైనది. ఆడపిల్లల పాఠశాలలో మూడువంతులలో రెండు వంతులు వెళ్లిపోయినారు. పచ్చయ్యప్ప పాఠశాల శాఖలోకి 200 మంది పిల్లలు వెళ్లి చేరారు అక్కడ బైబిలు పాఠములు లేకుండా ఇంగ్లీషు చెప్పేవారు. 1844 జూన్ 12 వ తేదీన జాన్‌స్టను గారు ఇలాగ వ్రాశారు. "క్రైస్తవమత ప్రచారకుల పట్ల విరోధభావము ఇంకా తీవ్రంగానే వున్నది. ఉత్తరమున విశాఖపట్టణమువరకూ, దక్షిణమున తిరునల్వేలిదాకాను, పడమర బెంగుళూరుదాకాను ప్రజలలో భయము వ్యాపించింది. అక్కడి మిషనరీ పాఠశాల లన్నీ భగ్నమైనవి. క్రైస్తవ మతబోధకు ప్రజలు వ్యతిరేకులైనారు."

క్రైస్తవమతం పుచ్చుకొని ధైర్యం చాలక చలించిన రామానుజులు 1844 సం॥ జూలై 2 వ తేదీన భార్యతో మళ్లీ క్రైస్తవమతములోకి వచ్చి ఆశ్రయించాడు. అతని భార్య అలమేలమ్మ తెనుగు ఇంగ్లీషు చదువుకొని డిశంబరు 29 వ తేదీన, క్రైస్తవమతంలో కలిసినది.

1845 వ సంవత్సరం జనవరి 7 వ తేదీన ఆండర్సను పాఠశాలయొక్క 8 వ వార్షికోత్సవం జరిగింది. చెన్నపట్నం సుప్రీముకోర్టు ప్రధాన న్యాయమూర్తియైన గేంబియరుగారు అగ్రాసనాధిపత్యం వహించారు. 278 విద్యార్థులు హాజరు అయినారు. సుప్రీముకోర్టులో సహాయ న్యాయాధిపతి అయిన బర్టన్‌గారు క్రైస్తవమతప్రచారాన్ని గురించి అతి ఉత్సాహంతో ఉపన్యసించారు. చెంగల్పట్టు జిల్లాజడ్జి మోరుహెడ్డు గారు మళ్లీ పాఠశాల పరీక్షలకు తన కచ్చేరిచావడిని యిచ్చారు. 200 మంది ప్రేక్షకులు వచ్చారు. ఆండర్సను

గారు ఇంగ్లీషులోను, రాజగోపాలుడు అరవములోను క్రైస్తవ మతబోధ చేశారు. హిందూ సదరు అమీను, తన పిల్లలను పాఠశాలకు పంపుతూ నెలకు 10 రూపాయిలు యిచ్చాడు.

చెన్నపట్నంలో తిరువలిక్కేణి మిషనుపాఠశాల సెలవుల తలవాత 1845 వ సంవత్సరం ఫిబ్రవరి 3 వ తేదీన తెరిచారు. ఈ మిషనరీపాఠశాలలో పిల్లలసంఖ్యను తగ్గించడం ఎలాగ? ఈ క్రైస్తవమత ప్రచారాన్ని అరికట్టడం ఎలాగ? అని సెలవులలో హిందువులు తీవ్రంగా ఆలోచిస్తూనేవున్నారు. ఆండర్సనుగారు చింతాద్రిపేటలో కాపురం వుండేవారు. అక్కడనుంచి తిరువలిక్కేణికి వచ్చే పిల్లలందరూ మాని వేశారు. దేశీయులు తమ పిల్లలను మిషనరీ పాఠశాలలకు పంపేయెడల వారిని క్రైస్తవమతంలో కలిపితీరతారనిన్నీ, అందువల్ల పంపవద్దనిన్నీ హెచ్చరిస్తూ పెద్ద అక్షరాలతో గోడకాగితములు అట్టలు చెన్నపట్నంలో ప్రకటించారు. నల్లవారి బస్తీలోను, తిరువలిక్కేణిలోనూ మిషనరీ పాఠశాలలో పాతవిద్యార్థులలో చాలామంది మానివేశారు. ఎంతో ప్రయత్నంమీద 500 మంది కొత్తపిల్లలు చేరారు. ఈ పిల్లలుకూడా పూర్వంలాగా కులమింటి బిడ్డలుగాక, బీదలైన అలగాజనం పిల్లలేనని అండర్సనుగారే ఒప్పుకున్నారు.

క్రైస్తవమతం పుచ్చుకున్న హిందువులకు సమష్టి కుటుంబములోవున్న ఆస్తిహక్కులు పోతాయనే అభిప్రాయముతో చాలామంది మతంలోకలియడంలేదని వంగరాష్ట్రంలో ప్రభుత్వంవారు 1832 లో ఈ ఇబ్బందిలేకుండా చేశారు. ఆలాగే చెన్నరాజధానిలో కూడా చేయవలసినదని క్రైస్తవ

మిషనరీలు సర్కారువారిని కోరగా, ప్రభుత్వంవారు అలాంటి చట్టం చేయడానికి ఇప్పుడు పూనుకొన్నారు. ఈసంగతి తెలియగానే చెన్నపట్నంలో ప్రజలు తమ ధర్మశాస్త్రంలో ఇలాంటి మార్పుచేయడం అక్రమమని మనవిచేస్తూ ఒక మహజరును పంపినారు. కేవలము పరమార్థచింతతో మతం పుచ్చుకొన్న క్రైస్తవుల ఆస్తి హక్కుల విషయములోను, వివాహ హక్కుల విషయములోనూ హిందువులు చాలా అన్యాయం చేస్తున్నారనిన్ని, ఇది హిందువులఅసహనాన్ని, మూర్ఖత్వాన్ని కనబరుస్తున్నదనిన్ని ఆండర్సనుగారు ఆందోళనచేశారు.

1846 సం. ఆగస్టు 22 తేదీన చెన్నపట్నంలో మిషనరీ పాఠశాల గేటుదగ్గర వందలకొద్ది హిందువులు గుమిగూడినారు. అందులో చాలామంది బ్రాహ్మణులు గేటుతోసుకొని లోపలికి పోవాలని చూశారు. కాని, గేటు లొంగలేదు. అందులో ఒక ముసలి బ్రాహ్మడు పరుగెత్తుకొని వెళ్లి ఒక గొడ్డలి తెచ్చాడు. ఈయన కొడుకు రాఘవులు అనే కుర్రవాడు మతం పుచ్చుకోడానికి మిషనుపాఠశాలకు వచ్చాడు. ఇంకా ఇద్దరు పిల్లలు కూడా మతం పుచ్చుకోడానికి నిశ్చయించి కొద్దిరోజులకిందట వచ్చారు. వీరిని బలవంతంగా లాక్కొని పోవడానికే ఈ గుంపు ప్రయత్నిస్తూ వున్నది. గేటు తలుపులు విరగకొట్టాలని పెద్ద పెద్ద రాళ్ళు లోపలికి పడవేస్తున్నారు. ఇంతలో ఒక తెల్ల పోలీసు కానిస్టేబిలు ఆ ముసలి ఆయనచేతిలో గొడ్డలి లాక్కున్నాడు. అతనిని, ఇంకొక బ్రాహ్మణ్ణికూడా పోలీసువారు తీసుకొని వెళ్ళి దౌర్జన్యం జరగకుండా మిషనరీలను రక్షించారు.

మతం పుచ్చుకోవడానికి వచ్చినవారిని వారి బంధువులు వచ్చి అనేకవిధాలుగా బ్రతిమాలారు. ఇది మామూలుగా జరిగే తంతే. ఆండర్సనుగారు తన కుర్రవాడిని నిర్బంధించి యుంచినాడనిన్నీ, వాడిని విడిపించవలసినదనిన్నీ రాఘవులు తండ్రి సుప్రీముకోర్టులో హేబియసు కార్పసు పిటీషను దాఖలుచేయగా, ఆగష్టు 29 వ తేదీన రాఘవులును కోర్టులో హాజరుపరచవలసినదని అండర్సనుగారికి వారంటు వచ్చినది. రాఘవులు తండ్రీన్నీ, ఇంకొకాయనయున్నూ రాఘవులుకు 12 యేళ్లని ప్రమాణ వాఙ్మూలపత్రం దాఖలుచేశారు. కుర్రవాడున్నూ, మిషనరీలున్నూ వాడికి 17 సంవత్సరాలున్నాయని ప్రమాణ వాఙ్మూలపత్రం దాఖలు చేశారు. అడ్వకేటు జనరలు జార్జి నార్టనుగారు పిల్లవాడి తండ్రితరఫున వాదించాడు. పిల్లవాడితరఫున, మిషనరీల తరఫున ఆస్బారన్ అనే బారిష్టరు వాదించాడు.

అప్పుడు క్రైస్తవమతాభిమానియైన సర్ W. బర్టన్‌గారు న్యాయమూర్తి. రాఘవులు చాలాపొట్టిగా వుంటాడు. అందువల్ల అతనినిబల్లపైననిలబెట్టి న్యాయమూర్తి వాడినిఇంగ్లీషులో ప్రశ్నలు వేశాడు. అన్ని ప్రశ్నలకూ వాడు చక్కగా జవాబు చెప్పాడు. అంతట న్యాయమూర్తి ఈ కుర్రవాడి వయస్సు ఎంత వున్నా, వీడికి యుక్తాయుక్త వివేచనజ్ఞానము వున్నందువల్ల వాడి యిష్టంవచ్చిన చోటికి పోవచ్చునని వుత్తర్వుచేసి ఆండర్సన్ పాఠశాలకు భద్రంగా తీసుకుని వెళ్ళి వప్పగించవలసిందని షెరీఫుకు ఆజ్ఞాపించాడు.

ఈ తీర్పు చాలా అన్యాయంగా కనపడింది. బొంబాయి హైకోర్టులో యుక్త వయస్సు రాని పిల్లలను మిషనరీలు తమ వశంలో వుంచుకోరాదనిన్నీ, తండ్రికి వప్పగించి తీరాలనిన్ని సర్ ఎర్స్కిన్ పెర్రీగారున్నూ తక్కిన న్యాయమూర్తులున్నూ తీర్మానించగా వయస్సుతో నిమిత్తం లేకుండా క్రైస్తవ మతాన్ని గురించి ఏవో కొన్ని ప్రశ్నలువేసి వాడికి యుక్తాయుక్త వివేచన ఉన్నదని లేత వయస్సు పిలలను మిషనరీల వశంచేసి క్రైస్తవమతంలో కలుపుకోడానికి చెన్నపట్నంలో న్యాయాధిపతులుకూడా మిషనరీలకు తోడ్పడడం ప్రజలకు ఘోరంగా కనిపించింది.

అప్పుడు కోర్టులో జరిగిన కల్లోలము, ప్రజల మనోభావాలు, చూచితీరాలిగాని వర్ణించడానికి సాధ్యమైనది కాదు. కోర్టు ఆవరణలో బ్రాహ్మణులు, తక్కిన వర్ణాలవారు గుంపులు గుంపులుగా కూడారు. అనుక్షణమూ యీ జనసమూహం వృద్ధి అవుతూంది. బయట కూడినజనం కిటకిటలాడుతూ వున్నారు. కడుపు తరుక్కుపోయేటట్టు ఏడుస్తూవున్న రాఘవులు తల్లి శోకాలు విని ప్రజలు ఉద్రేకపూరితులు అవుతున్నారు. లోపలికి పోవడానికి సందు దొరకడం లేదు. ఈ జనసమూహం మహాసముద్రం కెరటాలలాగ పొంగుతూ ఊగులాడుతూ వున్నది. ఈ జనానికి కనపడకుండా వెనక్కి వెళ్ళి వుండమని ఆండర్సనుగారికి స్నేహితులు సలహా యిచ్చారు. ఇంకొకమిషనరీ రాఘవులు దగ్గర వున్నాడు. ఎదట గుమిగూడివున్న జనం వెళ్ళిపోకుండా అక్కడనే వున్నారు. ఏమైనాసరే కుర్రవాడిని లాక్కుపోదామని

బ్రాహ్మలు నిశ్చయించారు. పొద్దుగ్రుంకుతూ వున్నది. కోర్టు ఆవరణలో షెరీఫు కచ్చేరీదగ్గర ఒక బండినిపెట్టి ఆ బండిలోనే ఆ పిల్లవాడిని తీసికొని వెడతారని ప్రజలు అనుకునేటట్లు చేసి అండర్సనుగారి బండిని కోర్టు వెనుకకు తెచ్చివుంచారు. ఆపిల్లవాడు, వానిరక్షకులు ఆబండిలోకి ఎక్కారో లేదోకొంత మందివచ్చిపడి బండిచక్రాలు పట్టుకున్నారు. బండివాడు అతి చతురతతో తనకొరడాను ప్రయోగించి గుర్రాన్నిప్రజాసమూహంలోనుంచి దౌడుతీయించాడు. ఆ బండిమీాద రాళ్ళవర్షం కురిసింది. బండి వెనుక పక్కనున్న దిడ్డి కిటికీతలుపులు విరిగిపోయినవి. దానిలోనుంచి వెనకాల బ్రాహ్మలు పరిగెత్తుకుని వస్తూ రాళ్లు రువ్వడం కనబడుతూవుంది. కొన్ని క్షణాలలోనే బండి మిషనరీ భవనంగేటుదగ్గరకి చేరింది. అక్కడ మళ్లీ ఎవరూ దౌర్జన్యం చేయకుండా పోలీసువాళ్లు సిద్ధంగా కాపలా వున్నారు. మిషనరీలు అన్నీ సిద్ధపరచుకొనే వున్నారు. ఈ కేసువల్ల నేటివ్ జనసంఘం భీతావహం చెందినట్లు కనబడుతుందని అట్లాసు అనేపత్రిక వ్రాసింది. (True Yoke fellows - Rev. Braidwood. pp 310 – 312)

1846 వ సంవత్సరం అక్టోబరు 5 వ తేదీన జరిగిన వివిధ మిషనరీల సంయుక్త ప్రార్థనసభలో ఒక మిషనరీ ఆ కాలంలో హిందూప్రజల చిత్తవృత్తులు ఎలాగవుండేవో చక్కగా చిత్రించాడు.

"ఈ మధ్య ఒక మహాఅడవిలోని వృక్షాలు గొప్ప గాలికి ఊగులాడినట్లుగా హిందువుల జనసంఘము కదలిక చెందడం మీాలో కొందరు చూచేవున్నారు. ఏసుక్రీస్తుబోధలు

ప్రచారంచెందినవి. ఇది వారిని బాధించింది. నిర్జీవమై పడి యుండిన ఒక్కొక్క ఆత్మ మేల్కొన్నది ఇది విచిత్రమైన శక్తిఅనిన్నీ, మునుముందు ఈ హిందూదేశంలో తన రాజ్యాన్ని పెకలించగల శక్తి అనిన్నీ సైతాను గ్రహించాడు. తాను అధిష్టించియున్న విగ్రహారాధకుల హృదయాలలో కదలిక ప్రారంభించాడు. అంతట వారిలో నున్న దైవవిరోధ శక్తి విజృంభించినది. వారిలో ఒకరిపట్ల ఇంకొకరికిగల విరోధ భావాలు తాత్కాలికంగా చల్లారి. వారి క్రోధమంతా ఒక వంకకు కేంద్రీకరించింది. మనోవాక్కాయ కర్మల యొక్క స్వేచ్ఛను అణగద్రొక్కడానికి క్రైస్తవేతరులలో మేల్కొంచిన ఆత్మచైతన్యాన్ని అణచివేయడానికి, భగవంతుని భక్తులను భగవంతుని బైబిలు - వేద వాక్కును భగవంతుని కూడా ఎదిరించి అణగద్రొక్కడానికి పూనుకున్నారు. ఒక నిప్పురవ్వవల్ల అంటుకుని ప్రజ్వలించినట్లు ఇదివరకు స్తబ్ధమై పడియుండిన అజ్ఞానజనుల మనస్సులకు తాకింది. ఘోరమైన అనేక అసత్యాలు, ద్వేషము, క్రోధము, తృణీకారభావము, భగవంతుని దూషించడము, వారి హృదయాలలోనుంచి నోళ్ళలోనుంచి వెలువడి వాతావరణాన్ని కలుషితం చేసినవి. క్రైస్తవ మతబోధకులను, క్రైస్తవ మతంలో కలిసినవారిని చంపుతామని కొడతామని బెదిరించడము ప్రారంభమైనవి. రహస్యమైన కుట్రాలోచనలు సాగినవి. మీరువారనకుండా ఎవరు దీనికి సహాయం చేస్తామన్నా సంతోషపూర్వకంగా వారిసహాయం స్వీకరించారు. నూతనోత్సాహంతో విగ్రహాలకు మొక్కుబడులు చెల్లించారు.

క్రైస్తవపాఠశాలలో పిల్లలను మాన్పించారు. క్రైస్తవ భావాలు రేకెత్తుతూ వున్న పిల్లల మనస్సులను ఆత్మలను హృదయాలను అణగద్రొక్కివేశారు. తల్లిదండ్రులు తమ అధికారాన్ని ఉపయోగించి మతావేశపరులై పిల్లల జ్ఞానమును చిత్తవృత్తులను ఆలోచననుగూడా అణచివేశారు. వారియిళ్లకు పోయి, ఏమి కనబడుతుందో చూడండి. తెలివితేటలతో మెరుస్తూ ఏసుక్రీస్తుపట్ల భక్తికలుగుతూ వున్నవారి పిల్లలు విషణ్ణహృదయులై నిరాశతో పడివుండడం కనపడుతుంది. ఇది ఎలాగ తటస్థించిందో నేను వర్ణించి మీకు బాధ కలిగింపను. వారి బైబిలుగ్రంథం ఏమూలనో తాళం పెట్టినారో లేకపోతే తగలపెట్టినారో చెప్పలేను. వారి తలిదండ్రుల శాపనార్థాలు, వారిదేవుళ్ళు దుష్టులను శిక్షిస్తారనే బెదిరింపులు, వారు క్రైస్తవ మతబోధకుల మొగము చూడకుండాను మతంలో కలియకుండాను వారిని అణచివుంచాయి. ఈ చెన్నపట్టణంలో ఇలాగ శోకిస్తూ వున్న హృదయాలు ఎన్ని వున్నాయో! పరితపిస్తూవున్న ఆత్మలు ఎన్నివున్నాయో! భగవంతుడు తాను నిశ్చయించుకున్నప్పుడు తన కృపావీక్షణం వీరందరిపైనను ప్రసరింపజేసి వీరిని తరింపజేసి తీరుతాడు" ఇది కేవలము క్రైస్తవమత పక్షపాతులకు కనబడినస్థితి. హిందువు లేమనుకునేవారో దీనినిబట్టి ఊహించుకోవచ్చు.

1842 మొదలు 1847 వరకూ చెన్నపట్నం గవర్నరుగా వుండిన ట్వీడ్ డేల్ ప్రభువున్నూ, ఆయన తరువాత 1853 వరకూ గవర్నరుగా వుండిన సర్ హెన్రీపోటింజరుగారున్నూ క్రైస్తవమతాభిమానులు. వారికాలంలో ప్రభుత్వ కార్య

దర్శిగా వుంటూవున్న జె. ఎఫ్. తామస్‌గారు తమ క్రైస్తవ మతాభిమానాన్ని బహిరంగ గానే ప్రదర్శించేవాడు. ప్రభుత్వంలో పెద్దవుద్యోగాలు చేసే దొరలు, జడ్జీలు, కలెక్టర్లు కూడా చాలామంది మిషనరీలకు స్నేహితులుగా వుండేవారు. ఈ దొరలలో చాలామందికి క్రైస్తవసంస్థల కార్యనిర్వహణంలోకూడా కొంత సంబంధం వుండేది. 1845 లో ప్రధాన కార్యదర్శి అయిన జె. ఎఫ్. తామస్‌గారు చర్చి మిషనరీ సొసైటీయొక్క దక్షిణహిందూదేశశాఖ కార్యనిర్వాహక వర్గంలో సభ్యుడు. బ్రిటిషు అండు ఫారిన్ బైబిలు సొసైటీ కమిటీలోనూ, మద్రాసు స్కూలు బుక్ సొసైటీ కమిటీలోనూ సభ్యుడు. గవర్నరుగారు ఫిమేల్ ఆర్ఫన్ అసైలం అనే క్రైస్తవస్త్రీల అనాధశరణాలయానికి అధ్యక్షుడు. బిషప్పు అనే క్రైస్తవ మహోద్యోగిన్నీ, తామసుగారున్నూ, సుప్రీముకోర్టు జడ్జీఅయిన బర్టన్‌గారున్నూ దానికి ఉపాధ్యక్షులు. సుప్రీముకోర్టు ప్రధాన న్యాయమూర్తి, సర్వసేనాని, గవర్నరు కౌన్సిలులోని సభ్యులు, అందుగాకూడా మిలిటరీ మేల్ ఆర్ఫను అసైలం అనే క్రైస్తవ అనాధ శరణాలయంయొక్క కార్యనిర్వాహకవర్గంలో సభ్యులు. వీరందరూ క్రైస్తవమతప్రచారకులకు అన్నివిధాలా సాయం చేస్తూవుండేవారు.

1843 లో తిరునల్వేలి జిల్లాకలెక్టరుగా వుంటూవుండిన తామసు అనే దొర తన జిల్లాలో క్రైస్తవమత ప్రచారంవిషయంలో మిషనరీలు చేసేదానికంతా తాను పూర్తిగా సహాయంచేస్తూ వుండేవాడు. చెన్నపట్టణం సుప్రీంకోర్టు అనే

పరమోన్నత న్యాయస్థానంలో న్యాయాధిపతిగా వుండే సర్ విలియంబర్టన్ అనే దొరగారు తన క్రైస్తవ మతాభిమానాన్ని ఎంతమాత్రమూ దాచకుండా తాను విచారించే వ్యాజ్యముల మధ్య తన న్యాయస్థాన వేదికపైనుండియే క్రైస్తవ మతాన్ని గురించి అప్పుడప్పుడు హిందువులకు ఉపన్యసిస్తూ వుండేవాడు. ప్రభుత్వ కార్యదర్శిగా వుండిన జే ఎఫ్. తామస్ అనే దొర తిరునల్వేలి కలెక్టరుకు బంధువు. ఇతడు హిందువులకు వుద్యోగాలు ఇవ్వకుండా క్రైస్తవులైనవారికే వుద్యోగాలిస్తూ క్రైస్తవమతాన్ని ప్రోత్సహించడం ప్రారంభించాడు. చెంగల్పట్టు జిలా జడ్జిగా వుండిన డబ్లియు. ఏ. మోర్ హెడ్ అనే ఆయన తన అధికారబలాన్ని ఉపయోగించి అక్కడ మిషనరీపాఠశాల స్థాపించడమేగాక 1844 లోను 1845 లోను పాఠశాలలో చదివే పిల్లల పరీక్షలు జరపడానికని తన కచ్చేరీ చావడిని మిషనరీలకిచ్చి తాను విచారించవలసిన వ్యాజ్యములను వాయిదా వేసి ఆ కచ్చేరీచావడిలో క్రైస్తవ మతబోధ చేయించాడు.

చెన్నపట్నం రాజధానిలో వుండే జిల్లాకోర్టు లన్నిటిపైననూ అధికారం గల సదరు ఆదాలత్తు కోర్టు అనే న్యాయస్థానంలో ఒక న్యాయాధిపతిగా వుండిన మాల్కం లెవిన్ అనేదొర న్యాయబుద్ధితో ప్రవర్తిస్తూ మిషనరీలమాట వినక నిష్పక్షపాతంగా వున్నందువల్ల మిషనరీలు అతనిపైన చెన్నపట్నం ప్రభుత్వంవారికి చాడీలు చెప్పి 1846 లో అతడు పని మానుకునేటట్లు చేశారు.*

* (Life of Gazula Lakshminarsu Chetty in Representative men of Southern India by G. Parameswaram Pillai (1896) pp 147 - 149).

# ప్రజాసేవకులు - స్వధర్మరక్షణము

ఆ కాలంనాటికింకా మన దేశీయులకు ఇంగ్లీషువిద్యాలాభము కలగలేదు. తమ్ము పరిపాలించే ప్రభుత్వాల యొక్క స్వరూపముగాని, స్వభావముగాని, ఏలాంటిదో వారికి తెలియదు. అప్పుడు మిషనరీల చేతులలోనూ కుంపినీ సర్కారు అధికారుల చేతులలోనూ బాధ లనుభవించే ప్రజలు చెన్నపట్నంలో వుండే గవర్నరు ప్రభుత్వమే సర్వాధికారాలు గల ప్రభుత్వ మనుకొని పడివుండేవారు. దానికిపైన కలకత్తాలో గవర్నరుజనరలు ప్రభుత్వ మొకటి వున్నదనిన్నీ, యీ ప్రభుత్వాలన్నిటిపైనా సీమలో తూర్పుఇండియా వర్తకకంపెనీవారి డైరెక్టరసభకు అధికారం వున్నదనిన్నీ ఈ సభవారిపైన గూడా అధికారంగల పార్లమెంటుబోర్డు ఒకటి ఉన్నదనిన్నీ, తమ కష్టసుఖాలనుగురించి పార్లమెంటువారికి చెప్పుకోవచ్చుననిన్నీ మన ప్రజలకు తెలియదు. తమకుగల కష్టాలను ఎవరితో చెప్పుకోవాలో ఏలాగ చెప్పుకోవాలో వీళ్లు ఎరుగరు. దీనిని గురించి ప్రజలలో ప్రబోధం కలగించేవారున్నూ లేరు. ప్రజాసేవచేసే రాజకీయనాయకు లసలే లేరు. అప్పట్లో చెన్నపట్నంలోవుండే ప్రజలలో నూటికి తొంభై వంతులు కుంపినీ దొరల ఎగుమతి వ్యాపారంపైన ఆధారపడిన నేతగాళ్ళు, రంగుల అద్దకంవాళ్ళు, చాకళ్ళు, ఇతరవృత్తుల

వాళ్లు. వారికోసం వచ్చిన చిల్లర వర్తకులూ, మిగిలిన వారు కుంపినీదొరల తరఫున దేశంలో తిరిగే దళారీ బేరగాళ్లు, పెద్దవర్తకులు, దుబాషీలు, లేదా కుంపినీవారితో మొగమాటంకల చిన్న వ్యాపారస్తులుగా వుండి పొట్టపోసు కునే నోరులేని ప్రజలు. అప్పటి కింకా ఇంగ్లీషువిద్యగాని, రాజకీయపరిజ్ఞానంగాని దేశంలో వ్యాపించలేదు. మనవాళ్లు ఎవరో కొంతమంది స్వయంకృషివల్ల ఇంగ్లీషు నేర్చుకొని కుంపినీవారి కచ్చేరీలలోనూ, కోర్టులలోనూ, కార్యాలయాల లోనూ, దొరలకింద గుమాస్తాలుగానూ, శిరస్తాదార్లుగానూ, తర్జుమాలుచేసే ఇంటర్‌ప్రిటర్లుగానూ ఉద్యోగాలుచేస్తూ దొర లంటే చాలా భయభక్తులతో మెలగుతూవుండేవారు. ఉద్యోగాలు లేకుండాను, దొరలతో ఏ మొహమాటమూ లేకుండానూ స్వతంత్రులుగావుండే పురప్రముఖు లెవ్వరూ లేరనే చెప్పవచ్చును.

ఇలాంటి సందర్భాలలో చెన్నపట్నం పాఠశాలల దుఃస్థితిని వర్ణిస్తూ చేయవలసిన సంస్కరణలను గురించి 1820 సంవత్సరములో మద్రాసు స్కూలుబుక్కు సొసైటీ వారికి ఉత్తరం వ్రాసిన సదరుకోర్టు యింటరుప్రిటరైన వెన్నెలకంటి సుబ్బారావుపంతులుగారు చాలా ధైర్యశాలి అనే చెప్పాలిసివస్తుంది. ఆ కాలంలో ఇలాగనే కుంపినీ వుద్యోగంలోవుండి ప్రజలకు కొంత మేలు చేయడానికి ధైర్యంగా ప్రయత్నిస్తూన్నవారిలో పోలీసుమేజస్ట్రేటు అయిన వెంబాకం రాఘవాచార్యులుగారున్నూ, సుప్రీంకోర్టులో ఇంటరుప్రిటరైన ఏనుగుల వీరాస్వామయ్య పంతులుగా

రున్నూ ముఖ్యులూ. వీరు చాలా తెలివితేటలున్నూ, దూరదృష్టిన్ని కలిగి ప్రజాసేవచేసిన ప్రతిభాశాలులు. వీరికి ఇంగ్లీషు బాగా వచ్చినందువల్లను, కుంపినీవారి కొలువులో తమ వుద్యోగరీత్యా పెద్దదొరలతో స్నేహం కలిగివున్నందు వల్లనూ వీరికి పాశ్చాత్యవిజ్ఞానం కొంత అబ్బింది. అందువల్ల ప్రజలలో పాశ్చాత్యవిజ్ఞానాన్ని ఇంగ్లీషువిద్యను వ్యాపింప చెయ్యాలనే సంకల్పము వీరికి కలిగి, అందుకోసం కృషి చేశారు. 1820-27 మధ్య చెన్నపట్నం గవర్నరైన సర్ తామస్ మన్రోగారుకూడా దీనికి సుముఖుడుగా వున్నందువల్ల కొంత పని జరిగింది. రాఘవాచార్యులుగారున్నూ, వీరా స్వామయ్యగారున్నూ, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళ గారున్నూ స్నేహితులు. వీరందరూ కలిసి ప్రజల యోగక్షేమంకోసం పాటుపడుతూ వుండేవారు. చెన్న పట్నంలో కరవులు వచ్చినప్పుడు బీదజనులకు అన్నవస్త్రా లిచ్చి కాపాడడానికి వీరుచేసిన కృషి అపారము. వీరి అదృష్టమువల్ల 1828 లో చెన్నపట్నం సుప్రీంకోర్టులో అడ్వ కేటు జనరలైన (George Norton) జార్జి నార్టనుగారనే ప్రతిభాశాలి వీరికి స్నేహితుడై మార్గదర్శి యైనందువల్ల వీరు గొప్ప ప్రజాసేవచేసి కృతకృత్యులు కాగలిగారు.

నార్టన్‌గారు అదివరకు బొంబాయి సుప్రీముకోర్టులో అడ్వకేటుజనరలుగా ఉండేవారు. ఆయన చాలా ధైర్యశాలి. ఆయనకున్నూ అక్కడి ప్రధానన్యాయమూర్తికిన్నీ పడలేదు. అంతట ఆయన 1827 లో ఆ వుద్యోగం మాని 1828 లో చెన్నపట్నం సుప్రీముకోర్టులో బారిష్టరుగా చేరినాడు. ఇక్కడ

అడ్వకేటు జనరలుపని ఖాళీ రాగా, దానిని నార్టనుగారి కిచ్చారు. ఈయన దేశప్రజలపట్ల చాలా దయకలవాడు. ప్రజలలో విద్యాభివృద్ధి చేసి రాజకీయపరిజ్ఞానం కలిగించి వారిస్థితిని బాగుపర్చవలెననే పరోపకార చింత కలవాడు. అందువల ఆయన యిక్కడికి వచ్చినప్పటినుంచీ ఏనుగుల వీరాస్వామయ్యగారు వెంబాకం రాఘవాచార్యులుగారు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారు చేస్తూవున్న ప్రజాసేవకు సహాయభూతుడైనాడు. పచ్చయప్ప మొదలియారు తన మరణశాసనంలో దానధర్మాలకోసం చెందచేసిన లక్షలాది సొమ్మును వారసులు తినివేసి కూర్చోగా, సుప్రీముకోర్టు ఇంటుప్రిటరైన వీరాస్వామయ్య గారున్నూ, పాత అడ్వకేటు జనరలైన హెర్బర్టు కాంప్టనుగారున్నూ కలిసి ఆ దాన ధర్మాలను బయటికి తీసి, దానిని గురించి సుప్రీము కోర్టులో ఒకదావా దాఖలుచేశారు. ఇంతలో నార్టనుగారు కొత్త అడ్వకేటు జనరలుగా వచ్చారు. ఆయనకూడా ఈ విషయంలో చాలా శ్రద్ధవహించి కృషిచేశారు. అంతట ఈ ధర్మాల తాలూకు సొమ్మును వసూలుపరచి దానిని సక్రమంగా వినియోగించే విషయంలో ఒక స్కీమును (ప్రణాళికను) నిర్ధారణచేస్తూ సుప్రీంకోర్టువారు 1832 లో డిక్రీ యిచ్చారు. దానిని బట్టి యేర్పరచబడిన ధర్మకర్తలబోర్డుకు వెంబాకం రాఘవాచార్యులుగారిని అధ్యక్షులుగా నియమించారు. కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారుకూడా అందులో ఒక సభ్యులు. రాఘవాచార్యులుగారు 1842 లో చనిపోగా, శ్రీనివాసపిళ్లగారు అధ్యక్షులై 1852 లో చనిపోయేవరకూ

నిర్వహించారు. శ్రీనివాసపిళ్ళగారికి ఆడపిల్లలకు విద్యనేర్పాలనే కుతూహలం వుండేది. అందుకోసం ఆయన ఒక పాఠశాలను స్వయంగా నడిపేవారు. వీరు చనిపోయేటప్పుడు విద్యాభివృద్ధికోసం 75 వేల రూపాయిలు ధర్మంచేశారు. ఆ సొమ్ములోనుంచి తరవాత ఆడపిల్లల పాఠశాల యొకటి పచ్చయప్పపాఠశాలకు ఒకశాఖగా యేర్పర్చబడినది.

1841 నాటికి పచ్చయప్పగారి ధర్మాలతాలూకు సొమ్ము రమారమి 8 లక్షల రూపాయిలు లెక్క తేలింది. దాని వినియోగాన్ని గురించి సుప్రీంకోర్టువారు మళ్ళీ ఒక డిక్రీయిచ్చారు. ఆ ప్రకారం 1842లో పచ్చయప్ప పాఠశాలను స్థాపించారు. దానికి నార్టనుగారు 1853 వరకూ పేట్రనుగావుండి, దాని అభివృద్ధికి తోడ్పడ్డారు.

వీరాస్వామయ్యగారు, రాఘవాచార్యులుగారు, శ్రీనివాసపిళ్ళగారు కలిసి చెన్నపట్నంలో హిందూ లిటరరీ సొసైటీ అనే ప్రజాసభను స్థాపించి సభలుచేస్తూ, అనేక విషయాలనుగురించి చర్చిస్తూ, గొప్పవారి చేత ఉపన్యాసా లిప్పిస్తూ ప్రజలలో విజ్ఞానవికాసం కలిగించడం ప్రారంభించారు. పరిపాలనకు సంబంధించిన రాజనీతి శాస్త్రములు, న్యాయ పరిపాలనా సూత్రములు ప్రభుత్వతత్వము, ప్రజలు బద్ధులయియుండు శాసనములు వాటి అమలు, ముఖ్యముగా తెలుసుకోదగిన విజ్ఞానవిషయములని హిందూ లిటరరీసంఘ సభ్యులు గ్రహించారు. ఆ విషయాలనుగూర్చి తాము చదవవలసిన గ్రంథాలనుగురించీ, ఆ విషయాలను యితరులకు సుబోధకం చేసే మార్గాలనుగురించీ ఆ సంఘం పెద్దలైన రాఘవా

చార్యులుగారూ, వీరాస్వామయ్యగారూ నార్టనుగారితో అప్పుడప్పుడు ఆలోచిస్తూవుండేవారు. ఈ విషయాలలో కొంత విజ్ఞానం సంపాదించినవారూ, యింగ్లీషువిద్య నేర్చుకున్నవారూ చాలా తక్కువగనకను పాశ్చాత్య గ్రంథకర్తలు వ్రాసిన రాజనీతి శాస్త్రములందు కుంపినీ పరిపాలనకింద వుండే హిందూదేశప్రజల స్థితిగతులకు అనుగుణముతైన సంగతులు కనిపించనందువల్లను అప్పటి ప్రజలకుగల గ్రహణశక్తినిబట్టి అ శాస్త్రగ్రంథములు సుబోధకములు కావు గనుకను నార్టను గారు దీనికోసం కొంత శ్రమపడి తాను గ్రహించినదంతా ప్రజలకు తెలిసేటట్లు సులభశైలిలో చెప్పడానికి పూను కున్నారు. అది లిటరరీ సొసైటీసభ్యులకేగాక ఇంకా యితరులకు కూడా వుపయోగించగలందులకు కళాశాల విద్యార్థులకు బోధించేటట్లుగా ఉపన్యాసాలద్వారా చెప్పదలచారు. నార్టను గారు గొప్ప అధికారి అయినందువల్ల చెన్నపట్నం కోటలో దొరల తర్ఫీదుకోసం స్థాపించిన కాలేజీ హాలులోనే వారి ఉపన్యాసా లివ్వడానికి అధికారులు అంగీకరించారు. అంతట ఆయన 1833-34 మధ్య ఆ విషయాలనుగురించి కొన్ని మహోపన్యాసా లిచ్చారు. ఆ సభలకు చెన్నపట్నం పురజనులలో కొంచెము ఇంగ్లీషు వచ్చిన పిన్న పెద్దలందరూ హాజరై, ఆ ఉపన్యాసాలు సావధానంగా విన్నారు.

పాశ్చాత్యరాజనీతినిబట్టి ఏర్పడిన ప్రభుత్వ ధర్మాలు, ప్రజాప్రభుత్వ స్వరూప స్వభావాలు, ప్రజలహక్కులు బాధ్యతలు బోధించి, ఇంగ్లాండులో ప్రజలు విద్యావంతులై ప్రజాప్రభుత్వంయొక్క లాభాలను పొందడమేగాక, విశాలమైన

సామ్రాజ్యాన్ని కూడా స్థాపించగలిగినారనిన్ని, ఈ దేశప్రజలు అజ్ఞానంలోపడి స్వాతంత్ర్యాన్ని శాంతిభద్రతలను కోల్పోయి తుదకు యింగ్లీషు పరిపాలనలో మళ్ళీ ఒక కేంద్రప్రభుత్వం కింద శాంతిభద్రతలు ఏర్పడడమూ ప్రజలక్షేమాన్ని ఆలోచించి పరిపాలిస్తామని ఇంగ్లీషువారు వాగ్దానాలు చేయడము మొదలయిన సంగతులనుగురించి జార్జి నార్టనుగారు ఉపన్యాసించారు. రాజ్యాంగధర్మాలను గురించి దేశచరిత్రను గురించి కూడా విపులంగా చర్చించారు. ఈ దేశప్రజలుకూడా ఇంగ్లీషు భాష నేర్చుకుని పాశ్చాత్యవిజ్ఞానాన్ని అభ్యసించి విద్యావంతులై రాజకీయంగా అభివృద్ధిపొందడానికి అవకాశాలున్నాయని నార్టనుగారు సహేతుకంగా నిరూపించారు. ఇంగ్లాండు ప్రభుత్వ పద్ధతినిగురించీ తూర్పుఇండియా కంపెనీనిగురించీ ఈ దేశంలో అమలుజరుగుతూవున్న కుంపినీ ప్రభుత్వవిధానాన్ని గురించీ న్యాయపరిపాలనా పద్ధతులనుగురించీ విపులంగా ఉపన్యసించారు

ఇంగ్లాండు ప్రభుత్వమూ భారతదేశ కుంపినీ ప్రభుత్వమూకూడా కొన్ని సంవత్సరములనుండీ చేసే శాసనాలలో హిందూదేశీయులపట్ల కొంత ఔదార్యాన్ని చూపిస్తూవున్నాయనిన్ని, ఈ దేశీయులకు సివిలు పరిపాలనలో కొన్ని పెద్ద ఉద్యోగాలు పొందడానికీ, శాసనాలు అమలుపర్చడానికీ, దేశీయులకు అవకాశం కలిగించినారనిన్ని అయితే దాని లాభం పొందడం ప్రజల అర్హతలపైన ఆధారపడి వుంటుందనిన్ని, ప్రజలు విద్యావంతులై తాము దేశపరిపాలనలో కష్టసుఖాలను గురించి పైవారికి ఏమైనా చెప్పుకున్నట్లయితే

# ఏనుగుల వీరాస్వామయ్యగారు



వీరాస్వామయ్యగారున్నూ మరికొందరు ప్రముఖులును కలసి హిందూ లిటరరీ సొసైటీ అనే ప్రజాసంఘాన్ని స్థాపించి ప్రజలకు రాజకీయ పరిజ్ఞానం కల్గించడానికి చాలా పాటుపడ్డారు.

దానివల్ల కొంతలాభం కలుగుతుందనిన్ని నార్టనుగారు చెప్పి ఆకాలంలో విద్యావంతుడున్నూ, సంఘసంస్కర్తయున్నూ అయిన రామమోహనరాయలుగారు 1831 లో ఇంగ్లాండుకు పోయి ఈదేశం యొక్క రివిన్యూ పరిపాలనలోనూ, న్యాయ పరిపాలలోనూ గల లోపాలనుగురించి పార్లమెంటువారికి నివేదించినందువల్ల, అక్కడి మంత్రులు ఈయన యిచ్చిన సలహాలలో కొన్నింటిని పురస్కరించుకొని కొన్ని సంస్కరణలుకూడా చేశారనికూడా నార్టనుగారు చెప్పారు. *

ఈదేశంలో ఇంగ్లీషువిద్యాభివృద్ధి చేయడానికి 1835లో కేంద్రప్రభుత్వంవారు తీర్మానించినా, దానినిగురించి చెన్నపట్నంలో ఏమీ పని జరగలేదు. 1836 లో వీరాస్వామయ్య గారు చనిపోయినతరవాత రాఘవాచార్యులుగారూ, శ్రీనివాసపిళ్ళగారూ నార్టనుగారి నాయకత్వంక్రింద దీని విషయమై

---

* (వీని వివరాలకు 1-3-41 మొదలు 10-5-41 వరకూ కృష్ణా పత్రికలో 'ఇంగ్లీషు చదువులు' అనే శీర్షికతో నేను వ్రాసిన వ్యాసాలు చదవండి. నార్టనుగారి ఉపన్యాసాలు తరవాత కొన్నాళ్ళకు 'రూడిమెంటల్సు' అనే పేరుతో ఒక పుస్తకంగా ప్రకటించబడినవి. (Rudimentels-By George Norton, 1841) నార్టనుగారిఉపన్యాసాలు భావగర్భితములై దేశభక్తిపూరితములై వినేవారిలో రాజకీయ పరిజ్ఞానమూ, గాఢమైన దేశాభిమానమును, ప్రజాసేవా పరాయణత్వమును, కార్యదీక్షను పురికొల్పినాయి. ఇగ రాజకీయ పరిజ్ఞానంలోనూ, దేశాభిమానంలోనూ, ప్రజాసేవలోనూ చెన్నపట్నం ప్రజలు నేర్చుకొన్న ప్రథమ పాఠాలని చెప్పవచ్చు. ఈ యుపన్యాసాలు విన్నవారిలో ఈ భావాలు బాగా నాటుకొని తరువాత చెన్నపట్నంలో కలిగిన విజ్ఞాన వికాసానికీ, ప్రజాసేవకూ పునాదులైనాయి.

కృషిచేస్తూనేవున్నారు. చెన్నపట్నంలో ఇంగ్లీషు కాలేజీని స్థాపించవలసినదని కోరుచూ 1838 లో 70 వేల మందిచేత సంతకాలు చేయించి నార్టనుగారిద్వారా చెన్నపట్నం గవర్నరు ఎల్ఫిన్స్టనుగారికి ఒక మహజరు అందజేశారు. విద్యాభివృద్ధివిషయమై ప్రజలకోరిక అతి తీవ్రంగా వున్నదని నార్టనుగారు మనవిచేశారు. దీనిఫలితంగా 1839 లో నార్టనుగారి అధ్యక్షతకింద మద్రాసు యూనివర్సిటీబోర్డు అనే ఉపసంఘం స్థాపింపబడింది. దానిలో రాఘవాచార్యులుగారు, శ్రీనివాస పిళ్ళగారు సభ్యులు. 1841 ఏప్రిలులో మద్రాసు యూనివర్సిటీ అనే సర్కారుపాఠశాల ప్రారంభించే సందర్భంలో ప్రజల ఉత్సాహంచూసి ఒక నూతనయుగం ఆరంభమైనదని గవర్నరుగారే అన్నారు. *

నార్టనుగారు ఉపన్యాసాలిచ్చి ప్రజలలో ప్రబోధం చేసిన కొద్దికాలంలోనే మిషనరీలూ, కుంపినీ అధికారులూ కలిసి చేస్తూవున్న అక్రమాలు మితిమీరగా వాటిని నివారించి స్వధర్మరక్షణ చేసుకోవడానికి చెన్నపట్నంలో ఒక ఉద్యమం బయలుదేరింది. ఆ వుద్యమానికి గాజుల లక్ష్మీనరుసుగారనే యువకుడు నాయకుడై, అతిసమర్థతతో నడిపించారు. ఆ సందర్భమునుబట్టి చూచినచో నార్టనుగారి ఉపన్యాసాలు సార్థకమైనాయని చెప్పవచ్చును.

---

*చూడు: ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర-పీఠిక

## గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారు



గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారు చెన్నపట్నంలో నీలిమందు వర్తకంచేసి ధనవంతుడైన సిద్ధులసెట్టిగారి కుమారుడు. సిద్ధులసెట్టిగారు తెలుగువాడు. వీరిది గాజులబలిజ కులం.

లక్ష్మీనరసు గారు 1806 లో చెన్నపట్నంలోనే జన్మించారు. అప్పట్లో ఇంగ్లీషుపాఠశాలలు లేవు. తెలుగు, అరవం, లెక్కలు చెప్పే వీధిబళ్ళు వుండేవి. ఒకటి రెండింటిలో కాస్త ఇంగ్లీషు అక్షరాలు చెప్పేవారు. లక్ష్మీనరసుగారు నేటివ్ అసోసియేషను స్కూలు అనే వీధిబడిలో తెలుగు వ్రాయడమూ, చదవడమూ నేర్చుకొన్నాడు. ఇతడు మంచి బుద్ధికుశలతకల వాడైనందువల్ల బడిలో చాలా తెలివితేటలతో చదువుకోవడమేగాక, ఆ కాలంలో చెన్నపట్నంలో బయలుదేరిన డిబేటింగు సొసైటీలనే భాషాభివృద్ధి సంఘాలలో తన వాగ్వాదనైపుణ్యం చూపుతూ వుండేవాడు. బడిచదువు పూర్తికాగానే తండ్రిచేసే వ్యాపారంలో తర్ఫీదుపొంది, తండ్రితో కలిసి సిద్దులు సెట్టి అండ్ కంపెనీ అనే పేరుతో విరివిగా బట్టలు ఎగుమతిచేసి విశేషధనం ఆర్జించినాడు. తండ్రి చనిపోయినతరువాత లక్ష్మీనరసుగారు ఇంకా విరివిగా ఎగుమతివ్యాపారం చేసి లాభం సంపాదించాడు. గొప్పవారలతో పరిచయం సంపాదించాడు. పురప్రముఖులలో ఒకడైనాడు. కొంత ఇంగ్లీషుభాషాజ్ఞానము సంపాదించాడు ఆ సమయంలో నార్టనుగారిచ్చిన ఉపన్యాసాలలోని ఉన్నతాశయాలు, లిటరరీ సొసైటీ సభ్యుల ప్రజాసేవ, కలకత్తా రాజకీయాలు ఈయన తలకెక్కాయి. మిషనరీలూ, అధికారులూ కలిసి చేస్తూవున్న అన్యాయాలను అరికట్టి నోరులేని ప్రజలను రక్షించాలనే దీక్ష ఈయనకు కలిగింది. అందుకోసం తన వ్యాపారంమీదిదృష్టి మళ్ళించి, తన సర్వస్వాన్ని ఈకార్యసాధనకోసం ధారపోయడం ప్రారంభించాడు.

ప్రజలపక్షమున ప్రతినిధిగా పనిచేయడానికీ, వారి కష్టాలనుగురించి పై అధికారులకు తెలియజేయడానికీ ఒక ప్రజాసంఘము వుండడము అవసరమని లక్ష్మీనరసుగారు గ్రహించి 1844 నాటికే "మద్రాసు నేటివ్ అసోసియేషన్" అనే చెన్నపట్టణ స్వదేశ ప్రజాసంఘాన్ని స్థాపించి, దానికి లక్ష్మీనరసుగారు అధ్యక్షులైనారు. ధనవంతులైన వర్తకులూ, సర్కారు ఉద్యోగంలో లేని పెద్దమనుష్యులూ ఈ సంఘంలో సభ్యులైనారు. ఈ సంఘం త్వరలోనే అభివృద్ధిజెంది చాలాపని చేయసాగింది. ప్రజల కష్టాలనుగురించి చర్చించుకోవడానికి అప్పుడప్పుడు సభలుచేసి తీర్మానాలు చేస్తూయుండేవారు. ప్రజల కష్టాలనుగురించి పై అధికారులకూ, సీమకూ మహాజరులు పంపేవారు.

లక్ష్మీనరసుగారు మంచి తెలివితేటలు గలవాడున్నూ, రాజకీయ పరిజ్ఞానం కలవాడున్నూ అయినందువల్ల తాను చేయదలచిన పనికి ఒక వార్తా పత్రిక చేతులోవుండడం అవసరమని గ్రహించాడు. అప్పట్లో నారాయణస్వామి అనే ఆయన చెన్నపట్నంలో నడుపుతూవున్న "నేటీవ్ సర్క్యులేటరు" అనే పత్రికనూ, దాని ముద్రాక్షరశాలనూ ఈయన కొని, ఆ పత్రిక పేరును "క్రెసెంటు" అని మార్చి దానిని నడపడానికి "హార్లీ" అనే దొరను పెద్దజీతంయిచ్చి సంపాదకునిగా నియమించారు. ఈ దొర కొన్నాళ్ళు సైనికశాఖలో పనిచేసిన ఇంగ్లీషు క్రైస్తవుడు. తనకు న్యాయమని తోచిన సంగతిని నిర్మొగమాటంగానూ, నిర్భయంగానూ ఖండించి వ్రాయగలవాడు.

1844 – వ సంవత్సరం అక్టోబరులో 2 – వ తేదీన క్రెసెంటు పత్రికయొక్క మొదటి సంచిక వెలువడినది. హిందువులయొక్క స్థితిగతులను చక్కపరచడమే ఈ పత్రికయొక్క వుద్దేశ్యమని అందులో ప్రకటించారు. ఆ రోజులలో క్రైస్తవ మత ప్రచారకులు "నేటీవ్ హెరాల్డు", "రికార్డు" అనే పత్రికలను నడుపుతూ వాటిద్వారా క్రైస్తవమత ప్రచారం చేస్తూ, అందులో హిందువుల మతాచారాలను దూషించేవారు. మిషనరీలు చేస్తూవున్న ఈ అక్రమ ప్రచారానికి తగిన విధంగా జవాబు చెప్పడమే "క్రెసెంటు"పత్రికయొక్క అసలు వుద్దేశ్యం. ఈ మిషనరీలుచేసే అప్రమాణాలను గురించీ, అన్యాయాలను గురించీ క్రెసెంటు పత్రిక అతి తీవ్రంగా విమర్శించడం ప్రారంభించింది. అందుచేత కొన్నాళ్ళవరకూ క్రెసెంటు అంటే దొరలకు కంటకంగావుండేది. అప్పటి న్యాయాధిపతులూ, ప్రభుత్వోద్యోగులూ క్రైస్తవమత పక్షపాతం వహించి, అన్యాయాలు చేస్తూవుండడమును గురించి క్రెసెంటు పత్రిక బయటపెట్టి, వాటిని సహేతుకంగా విమర్శించడమువల్ల వారు తమ చర్యలను సమర్థించుకోలేక ఈ పత్రిక చేస్తూవున్న విమర్శలకు లోలోపల కుళ్ళుతూ పైకి నిష్పక్షపాతంగా వున్నట్టు నటిస్తూ లోపాయికారీగా మిషనరీలకు సహాయం చేస్తూవుండేవారు.

---

* గాజుల లక్ష్మీనరసుగారి బొమ్మ పచ్చయ్యప్పకళాశాలభవనంలో వున్నది. ఒకబొమ్మ చిలకమర్తి లక్ష్మీనరసింహం కవిగారి మహాపురుషుల జీవితంలోవున్నది. Photo in Representative Indians by G. Parameswaran pillai (1897).

ఆ కాలంలో సర్కారువారు తక్కిన వార్తాపత్రికలకు చేస్తూవుండే స్వల్పపు సహాయము, ఇచ్చే సౌకర్యాలూ ఈ క్రెసెంటుపత్రికకు ఇవ్వక నిరాకరించారు. ఉదాహరణానికి క్రెసెంటుపత్రికనుగురించిన ఒక ప్రకటనను సర్కారువారి ఫోర్టు సెంటుజార్జి గెజెటులో ప్రకటించవలసినదని క్రెసెంటుపత్రిక మేనేజరు పంపగా, ఈ ప్రకటన ఆ గెజెటులో సాధారణంగా వేసే ప్రకటనల వంటిది కానందువల్ల ప్రకటింపజాలమని ప్రభుత్వ కార్యదర్శి దానిని త్రిప్పివేశాడు!

హిందూ ధర్మశాస్త్రం ప్రకారం క్రైస్తవ మతంలో కలిసిన హిందువులకు వర్ణభ్రష్టులైనందువల్ల ఆ స్థిలోహక్కులు పోవునని మతంలో కలియడానికి చాలామంది జంకుతున్నారనిన్నీ, అలాటి యిబ్బంది లేకుండా చేయటం అవసరమనిన్నీ మిషనరీలు కోరుతూవున్నందువల్ల మద్రాసుప్రభుత్వ అధికారులు అలాంటి శాసనాన్ని చెన్నపట్నంలో చేయించాలని ప్రయత్నించారు. అంతట హిందువులు దీనినిగురించి తమ అసమ్మతి తెలుపుతూ ఆందోళన చేశారు. దీనినిగురించి కలకత్తాలోవున్న గవర్నరుజనరలు ప్రభుత్వానికి మహజరు పంపడానికి లక్ష్మీనరసుగారు 1845 వ సంవత్సరం ఏప్రిల్ 9 వ తేదీన చెన్నపట్నం పురజనుల మహాసభను సమావేశపరిచారు. ఈ మహాసభకు చాలామంది పురజనులు హాజరైనారు. ఈ సభవారు ఏకగ్రీవంగా చేసిన తీర్మానము ప్రకారం ప్రభుత్వమువారు చేయదలచిన శాసనము ప్రజల ధర్మశాస్త్రమునకును, సాంఘికాచారములకునూ విరుద్ధమనిన్నీ, వాటనిబట్టి ప్రజలకుగల హక్కుల కది భంగము కలిగిస్తూ

వున్నదనిన్నీ దీనినిగురించి తమ అసమ్మతిని తెలుపుతూ ఒక మహాజరును తయారుచేసి సీమకు పంపారు. అంతేకాకుండా ఈ మహాజరును కలకత్తాలోవున్న కేంద్రప్రభుత్వానికికూడా అందజేశారు. చెన్నపట్నం ప్రభుత్వానికిన్నీ, కేంద్రప్రభుత్వానికిన్నీ దీనినిగురించి ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినమీాదట ఈ మహాజరులో ప్రజలు తమకు కష్టమని సూచించిన నిబంధనలను ఆ శాసనంలోనుంచి తీసివేయబడతాయని మహాజరు పంపినవారికి తెలియజేశారు. ఇలాగ చెన్నపట్నం స్వదేశ సంఘమువారి ఆందోళనకు మొదటివిజయం కలిగింది. *

చెన్నపట్నంలో కుంపినీ ప్రభుత్వగవర్నరు ఎల్ఫిన్స్టన్ ప్రభువు 1841లో స్థాపించిన మద్రాసుయూనివర్సిటీ అనే ఉన్నత పాఠశాలలో మతంతో సంబంధములేని లౌకికవిద్యను బోధించేటట్లు నిశ్చయించారు. అయితే ఏదో ఒకవిధంగా ఇందులో బైబిలును ప్రవేశపెట్టాలని క్రైస్తవ మతబోధకులు ఆలోచనచేశారు. ఆ పాఠశాలలో పిల్లల తెలివితేటలు పరీక్షించటానికి ప్రభుత్వంవారు, మిషనరీలను వారి స్నేహితులను ఇనస్పెక్టర్లుగా నియమించారు. అంతట వీరా అవకాశం చూసుకొని పిల్లల ప్రపంచజ్ఞానాన్ని పరీక్షిస్తున్నామని వంకపెట్టి బైబిలుకథలను గురించీ, క్రైస్తవ మత సిద్ధాంతాలను గురించీ పిల్లవాళ్ళను ప్రశ్నించేవారు. జవాబు చెప్పలేనిపిల్లలను పరీక్షలలో తప్పించేవారు. పరీక్షలలో తప్పిపోయిన వాళ్ళకు సర్కారు వుద్యోగాలు రావు. అందువల్ల పిల్లలు

* Life of Gazula Lakshminarsu Chetty; Representative men of Southern India; by G. Parameswaran Pillai, Madras, (1896) P. P. 146-156

ఎలాగో కష్టపడి బైబిలువిజ్ఞానం నేర్చుకోవలసి వచ్చేది. ఇది చాలా కష్టంగా వున్నదనిఅంటే బైబిలును పాఠశాలలో ఒక పాఠ్యపుస్తకంగా చేస్తే యీ కష్టం ఉండదని విద్యాభివృద్ధి సంఘంవారు సూచించినారు. ఈ సంఘములో సభ్యులు కైస్తవదొరలే. వీరి సూచన చాలా బాగున్నదనిన్నీ, బైబిలు సంగతులు నేర్చుకోవడంవల్ల పిల్లలలో నీతి వృద్ధిచెందుతుందనిన్నీ అప్పట్లో గవర్నరైన ట్వీడుడేలుప్రభువు 24-8-1846 వ తేదీన తన అభిప్రాయాన్ని సూచిస్తూ మినిట్సు వ్రాశాడు. దేశప్రజల విద్యాభివృద్ధికోసం వినియోగించాలని దేశాదాయంలోనించి పార్లమెంటువారు కేటాయింపు చేసిన సొమ్మును ఇలాగ అపరోక్షంగా కైస్తవ మతప్రచారంకోసం వినియోగించడం అక్రమమని హిందువులు ఆందోళన చేశారు.

లక్ష్మీనరసుగారు 1846 వ సంవత్సరం అక్టోబరు 7 వ తేదీని పచ్చయప్పగారి పాఠశాల భవనంలో పురజనుల బహిరంగసభ సమావేశ పరిచారు. ఆ సభకు లక్ష్మీనరసుగారే అధ్యక్షత వహించారు. కేవలం కైస్తవమత ప్రచారంవల్ల కలుగుతున్న కష్టాలనేగాక దేశపరిపాలనలో ప్రజలకుగల కష్టాలన్నింటిని గురించి ఇంగ్లాండులో కుంపినీ డైరెక్టర్ల సభవారి కొక మహజరు పంపడానికి ఆ సభవారు తీర్మానించారు. ఇది మన రాజధానిలో జరిగిన మొదటి రాజకీయసభ యని చెప్పవచ్చును.

హిందూదేశ ప్రజల మతాచారాలతో జోక్యమును కలిగించుకోమని కుంపినీ ప్రభుత్వంవారు చేసిన వాగ్దానాలనన్నింటినీ క్లుప్తంగా చెప్పి చెన్నపట్నంలో 1842లో గవర్నరైన

ట్వీడ్ డేలు ప్రభువు హయాములో ఈ వాగ్దానాలన్నీ ఏలాగ ఉల్లంఘింపబడినదీ వివరించారు. క్రైస్తవ మిషనరీలు ప్రజలను క్రైస్తవమతంలో కలపడానికి ప్రయత్నిస్తూ యుండడమూ, కుంపినీ సర్కారు ఉద్యోగులు ఈ క్రైస్తవమత బోధకులకు సహాయం చేస్తూవుండడమూ, ప్రభుత్వమువారు రాజధానిలో వివిధప్రాంతాలలో పాఠశాలలు స్థాపించి పాశ్చాత్యవిద్యను వ్యాపింప చేయకుండా వుపేక్షించడమూ, ఉద్యోగాలలో ప్రవేశించడము కోసము దేశీయులు ఉత్తీర్ణులు కావలసిన పరీక్షలలో హిందువులు నెగ్గకుండా వుండేటట్లు మిషనరీలు కృత్రిమాలు చేస్తూ ఉండడమూ, సర్కారు కచ్చేరీలలో దేశీయులను విరివిగా నియమించకపోవడమూ, కోర్టులలో న్యాయాధిపతులు కూడా మిషనరీల సిఫారసులువిని పక్షపాతం వహించి అన్యాయాలు చేస్తూవుండడమూ, దేశీయులకుగల ఇతర కష్టాలనుకూడా యీ మహజరులో వివరించారు.

ఈ మహాసభ కార్యక్రమం చాలా శాంతంగానూ, సక్రమంగానూ జరిగింది. ఇందులో రాజద్రోహకరమైన విషయమేమీ లేదు. పై అధికారులపట్ల అవిధేయత ఏమీ లేదు. కాని ఈ అగ్రాసనాధిపతిగారి ఉపన్యాసమున్నూ, సభలో జరిగిన కార్యక్రమమున్నూ సభవారిలో విద్రోహ భావాలను పురికొల్పేటట్లున్నూ, బ్రిటిషు ప్రభువులపట్ల తిరస్కార భావాన్ని పురికొల్పేటట్లున్నూ వున్నవని కొందరు దొరలు దీనినిగురించి ప్రచారంచేశారు! లక్ష్మీనరసుగారు అన్న మాటలివి: "నెమ్మదిగానూ, దృఢంగానూ మన కష్టాలను పై అధికారులకు తెల్పినట్లయితే అవి నివారింపబడి మనకు

న్యాయం జరుగుతుందని మా నమ్మకము". అయితే ఈ మాటలకే ఆ దొరలు అటువంటి అపార్థం కల్పించారు !!

అప్పుడు చెన్నపట్టణం షరీఫుగా వుండిన ఎల్. కూపర్ అనే దొర అక్కడ సమావేశమైనవారిసి ఆ మహాజరులో సంతకాలు చెయ్యవద్దని చెప్పడం ప్రారంభించాడు. ఆతడు అలాగ ప్రచారంచేసినా పన్నెండువేలమంది ఆ మహాజరులో సంతకాలు చేశారు. ఈ మహాజరు చెన్నపట్నం ప్రభుత్వం ద్వారా సీమలోని కుంపిణీ డైరక్టర్ల సభవారికి పంపారు. ఈ మహాజరుపైన చెన్నపట్నం ప్రభుత్వంవారు తమ అభిప్రాయాన్ని వ్రాస్తూ ప్రభుత్వం చేస్తూవున్న చర్యలనుగురించి సరిగా తెలుసుకోనకనున్ను, ప్రభుత్వంవారి రికార్డులలో పూర్వపరాలు తెలియకుండా కొన్ని భాగాలు మాత్రం రహస్యంగా బైటపెట్టిన వాటిపైన ఆధారపడిన్నీ ఈ మహాజరు లోని సంగతులు వ్రాశారనిన్నీ గవర్నరుగారు దానిపైన రిమార్కులు వ్రాసి పంపగా, ఆయన మొహమాటంవల్ల కుంపినీవారు ఆ మహాజరును బుట్టదాఖలుచేశారు.*

అయినా దీనివల్ల ఒక్క లాభంమాత్రం కలిగింది. బైబిలును సర్కారు పాఠశాలలలో పాఠ్యపుస్తకంగా ప్రవేశపెట్టేదాన్నిగురించి ట్వీడుడేలు ప్రభువు 24-8-46 వ తేదీన వ్రాసిన అభిప్రాయాన్ని మాత్రం కుంపినీ డైరెక్టర్ల సభ వారు ఆమోదించలేదు. "ప్రభుత్వ సంస్థలలో క్రైస్తవ మత బోధను చేయడమును గురించి మా వుద్దేశ్యం ఏమిటి? అనే విషయంలో కొందరికి కొంత పొరపాటు అభిప్రాయ మున్నట్టు

* Ibid pp: 151 - 153.

మాకు తోస్తూవున్నది. ఆ సంస్థలు హిందూదేశ ప్రజలందరి లాభంనిమిత్తమూ స్థాపింపబడినవిగనుక ఆ వుద్దేశ్యం నెరవేర వలెనంటే అందులో బోధించే విద్య మతంతో సంబంధంలేని లౌకిక విద్యగానే వుండాలనేమాట నిశ్చయం. మన కాలేజీలలోనూ, పాఠశాలలలోనూ గల పుస్తక భాండాగారాలలో బైబిలును వుంచడములోనూ, దానిని విద్యార్థులు చదవడములోనూ తప్పులేదు. పాఠశాలలలో పాఠములు చెప్పేకాలంలో గాక తక్కిన వేళలలో బైబిలు సంగతులను గురించి పిల్లలు తమ ఉపాధ్యాయులను అడిగితే వారికి చెప్పడంలోనూ తప్పులేదు" అని కుంపినీ డైరెక్టర్లు చెన్నపట్నం ప్రభుత్వంవారికి వ్రాశారు.*

ఈ సమయంలో హిందువుల మనోభావాలు ఎలా వుండేవో అనే విషయాన్ని గురించీ, పైన చెప్పిన హిందువుల మహాసభలను గురించీ జాన్ ఆండర్సన్ జీవిత చరిత్రలో వర్ణింపబడింది. చెన్నపట్నంలోని హిందువులు తూర్పు ఇండియా వర్తకకుంపినీ డైరెక్టర్లకు మహజరు పంపడానికి 1846 వ సంవత్సరం అక్టోబరు 7 వ తేదీన ఒక "మహానాడు" అనే మహాసభను చేశారు. మహానాడు అనగా అన్ని వర్గాలవారి మహాసభ. దీనిని గురించి ఆండర్సను గారే అక్టోబరు 13 వ తేదీన ఇలాగ వ్రాశారు— "ఈశ్వర ద్రోహులైన ఐరోపాజాతివారు కొందరు ఈ మతాంతరులతో ఏకమై భగవంతునికీ, ఆయన దూతయైన ఏసుక్రీస్తుకూ వ్యతి

* England and India— An Essay on the duty of English men towards Hindoos by Baptist wriothesly Noel. (1859) pp. 392-393.

శేకంగా పనిచేశారు. వారు తయారుచేసిన మహజరు చాలా తీవ్రంగావుంది. ఈమిషనరీలనే పాముకోరలనుండి తమ్మురక్షింపవలసినదని వారుకోరుతూ, తమకుగల సివిలు హక్కులకూ, మతాచారాలకూ ఏలాంటి ఆటంకము లేకుండా స్వేచ్ఛగా అనుభవించనివ్వవలసిందని కోరారు. ఇలాంటిస్వేచ్ఛను వారు ఇదివరకు అనుభవిస్తూనేవున్నారుకదా! కొందరు క్రైస్తవ మతంలో కలియడమున్నూ, మతంలో కలసినవాడు యుక్త వయస్సు వచ్చినవాడాకాదా అనే ప్రశ్నగాక వానికి యుక్తాయుక్త వివేచన జ్ఞానమున్నదా లేదా అనేదే ముఖ్యమనిన్నీ, ఒక బ్రాహ్మణబాలుని విషయంలో సుప్రీముకోర్టు న్యాయాధిపతియైన బర్టన్‌గారు తీర్మానించి వానిని తండ్రికి వశపరచకుండా మిషనరీలకే వశపరచటమున్నూ ఈ హిందూక్రైస్తవ పోరాటంలో ముమ్మరిష్కి ముందుకు తెచ్చినవి. మేము స్థాపించిన బాలబాలికల పాఠశాలలను నాశనం చేయడానికి మతాంతములైన హిందువులు విశ్వప్రయత్నంచేస్తున్నారు. మా పాఠశాలలలోనుండి మూడువందలమంది ఆత్మలకు పైగా లాక్కుపోగలిగారు. అందులో చాలామంది చెన్నపట్నంలో నల్లవారి బస్తీ పాఠశాలలలోనూ, తిరువలిక్కేణి పాఠశాలలలోనూ చదువుతూ క్రైస్తవ మతబోధ తలకెక్కి అభివృద్ధిజెందిన పిల్లలే, పైకి వస్తున్నారనుకుంటూవున్న ఆడపిల్లలనుకూడా తీసికొనిపోయారు. ఈ సందర్భంలో కొద్దిమందైనా మిగిలియున్నందుకే ఆశ్చర్యపడాలి. నల్లవారిబస్తీలోనూ, తిరువలిక్కేణిలోనూ ఆడపిల్లలు మధ్యాహ్నము రెండుగంటలు తరగతులకు హాజరవుతున్నారు. శుక్రవారాలు హిందువులకు

చాలా ముఖ్యమైన రోజు. ఆ రోజునకూడా వీళ్లు బడికి వస్తూం వుండడం శుభసూచకం" అని ఆండర్సనుగారు వ్రాశారు. *

* True yoke fellows in the mission field. Life and Labours of Rev. John Anderson and Robert Johnston of the Madras Free Church Mission. By the Rev. John Braidwood : M. A. James Nisbet & Co. London (1862) page 317.

# న్యాయపరిపాలనలో మతపక్షపాతం

ఈ క్రైస్తవమత బోధకులు లేతవయస్సుగల పిల్లల మనస్సులు విరిచి, వారిని ఎలాగ తమ మతంలో కలుపుకునే వారో ఈ క్రింది సంగతులవల్ల తెలుస్తుంది.

1847 సంవత్సరము మార్చి 13 వ తేదీన ఆండర్సను గారు యిలాగ వ్రాశారు :— "గత మూడువారాలలోనూ ఆడపిల్లల తరగతిలో క్రైస్తవమత ప్రచారం పనిచేసిన సూచనలు కనుపించాయి. మానవుల పాపాలను తాను భరించడానికి ఏసుక్రీస్తుపడిన బాధనుగురించి కరుణకలిగేటట్లు చెప్పినప్పుడు పై తరగతిలోవుండే పదముగ్గురు ఆడపిల్లల మనస్సులుకూడా కరిగినట్లు కనబడేది.

"తగిన దోహదం చేస్తూవున్నందువల్ల యీ పిల్లలలో కనబడిన క్రైస్తవమతాభిమానము వృద్ధిజెంది చివరకు ఫలించింది". ఆండర్సనుగారు ఒక నెలతరువాత బుకాననుగారికి ఇలా వ్రాశారు :—

"అన్నమ్మ, మనియత్త, వెంకటలక్ష్మమ్మ, యాయమ్మ, మంగ అనే పిల్లలు పదకొండు సంవత్సరాలు మొదలు పదమూడేండ్ల వరకూ వయస్సుగలవారు. వీరందరూ మన పాఠశాలలో రెండేండ్లకాలంనుంచీ చదువుతూ వున్నవాళ్లు.

వీళ్ళు అదివరకు అరవంలోనూ, తెనుగులోనూ బైబిలు చదివారు. ఒక సంవత్సరంనుంచి బైబిలును ఇంగ్లీషులో చదువుకుంటున్నారు.

ఫిబ్రవరిలో బడి తెరిచిన తరువాత మొదట యీ పిల్లల మనస్సులు కరిగేటట్లుగా ఏసుక్రీస్తు పడిన బాధలు చెప్పి వారికి క్రైస్తవమతబోధ చేయగా, వారి మనస్సులలో కొంత మార్పు కనిపించింది. అంతలో ఈశ్వరుడు వారిలో నాటిన క్రైస్తవ మతబీజాన్ని వర్ధిల్లజేయడానికి వీలుగా వుండేటట్లుగా ప్రతిరోజూ వీళ్ళను మేడమీదవున్న మా గదిలోకి తీసుకొని వెళ్ళి మూడుగంటలసేపు మతబోధ చేసేవాళ్ళము.

ఏప్రియల్ 7 వ తేదీన దైవ ఘటన అన్నమ్మను, మునియత్తను మాపాల బడవేసినది. వీరి బంధువులు వీళ్ళను క్రైస్తవేతరులైన హిందువులకిచ్చి పెళ్ళి చేస్తారని మాకు తెలిసింది. అది తప్పించుకోవటానికి ఈ పిల్లలు మాదగ్గర కొచ్చి మమ్మల్ని ఆశ్రయించారు. ఏమి జరిగితే జరుగుతుంది; వీరిని మతములో కలుపుకొని తీరాలని మాకు తోచింది. గురువారం ప్రొద్దున్న మునియత్త తల్లీ, వాళ్ల బంధువులూ కొందరు దుర్మార్గులతో సహా వచ్చిపడ్డారు కాని, ప్రధాన మేజస్ట్రేటుగారు వచ్చి మమ్ములను కాపాడారు. మునియత్తను మేము అక్రమ నిర్బంధములో వుంచినామనిన్నీ, ఆమెను రక్షించవలసినదనిన్నీ మునియత్తతల్లి సుప్రీంకోర్టులో పిటీషను దాఖలు చేసింది. కాని, సంగతులన్నీ సుప్రీము కోర్టు న్యాయాధిపతులకు ఇదివరకే తెలుసును. గనక ఆమె కోరిక నెరవేరదనే ధైర్యంతో ఉన్నాము."

ఈ అయిదుగురు ఆడపిల్లలూ క్రైస్తవ మతంలో కలియడానికి రావడం హిందూ జనసంఘంలో అత్యంతమైన భయాశ్చర్యాలు కలిగించింది. తరువాత తీవ్రమైన క్రోధమూ, ఏకీభావమూ కలిగించింది. ప్రధాన మేజస్ట్రేటుగారు గట్టిచర్య తీసుకున్నందువల్ల ఆగిందిగాని, లేకపోతే చాలా దౌర్జన్యం కలిగివుండేదే. ఈ దెబ్బతో చెన్నపట్నంలో ఆడపిల్లల పాఠశాల అడుగంటింది. అన్ని మిషను పాఠశాలలలోనూ పిల్లలు మళ్ళీ బడి మానేశారు. తీవ్రమైన భీతి వ్యాపించింది.

ఆండర్సనుగారున్నూ, మునియత్తయున్నూ 1847 వ సం రం. ఏప్రియల్ 20 వ తేదీన సుప్రీంకోర్టులో న్యాయాధిపతి సర్ విలియము బర్టనుగారి యెదుట హాజరైనారు. ఒక క్రైస్తవ మత బోధకునియెదుట కుంపినీడాక్టరుగారు ఆ పిల్లను పరీక్షించినట్టున్నూ, ఆమెకు షుమారు పన్నెండు యేళ్లు వుంటాయనిన్నీ యిద్దరు మిషనరీలు ప్రమాణ వాఙ్మూలపత్రాలు దాఖలు చేశారు. ఆ పిల్లకు విచక్షణ జ్ఞానం వున్నదో లేదో కనుక్కోవడానికని న్యాయాధిపతి ఆ పిల్లను కొన్ని ప్రశ్నలు వేశారు. ఆ పిల్ల చక్కగా జవాబులు చెప్పింది. ఇంతలో ఆ పిల్ల సోదరుడు ఆ పిల్ల చెయ్యి పట్టుకుని లాగినందువల్ల గోల అయింది. అప్పటికి కేసు విచారణ ఆపివేశారు. మళ్లీ సోమవారంనాడు కేసు విచారణకు వచ్చింది అప్పుడు ప్రధానన్యాయమూర్తియైన గేంబియరు గారుకూడా వున్నారు. ఇద్దరు న్యాయాధిపతులూ ఆ పిల్లను కొన్ని ప్రశ్నలు అడిగి ఆ పిల్లకు యుక్తాయుక్త వివేచనజ్ఞానం వున్నదనిన్నీ, తన యిష్టం వచ్చిన చోటికి వెళ్లవచ్చుననిన్నీ

తీర్మానించారు. ఆ పిల్ల క్రైస్తవమతబోధకులతో మిషనరీ భవనానికి వెళ్ళిపోయింది. "ఒక పిల్లకాయ విగ్రహారాధనను నిరాకరించడంలోనూ, బలవంతపు వివాహం తనకు వద్దనడం లోనూ క్రైస్తవత్వమునకు ఇష్టపడకపోవడంలోనూ ఏమి తేడా వున్నది ?" అని బర్టనుగారు తమ తీర్పులో వ్రాసి తమ క్రైస్తవ మత పక్షపాతమును వెలిబుచ్చారు. ప్రధానన్యాయమూర్తి గేంబియరుగారుకూడా తమ తీర్పులో క్రైస్తవ మతాభిమానం చూపిస్తూ ఇందుకు విరుద్ధంగా బొంబాయి సుప్రీము కోర్టు వారు చేసిన తీర్మానాన్ని తాము అంగీకరించమని వ్రాసి బర్టనుగారికి మద్దతు చేశారు.*

ఒకమిషనరీ ఎదట ఒక మొగవాడైన విదేశీయ వైద్యుడు వయసువచ్చిన ఒక ఆడపిల్లను నఖశిఖపర్యంతమూ సిగ్గు లేకుండా పరీక్షించడమూ, దానినిగురించి కోర్టులో ప్రకటించడమూ న్యాయాధిపతులు క్రైస్తవమతపక్షపాతంతో తీర్పు చెప్పడమూ చూడగా ప్రజలలో చాలా విషాదం కలిగింది. ప్రజల ధర్మాన్ని కాపాడవలసిన ప్రభుత్వమే వ్యతిరేకమైతే ఇంకేముందనే భావం వృద్ధిఅయింది.

ఈ కేసు విచారణ జరిగినతరువాత ఒకరితరవాత ఒకరివి చాలామంది మిషనరీలు బాహాటంగా మతంలో కలుపుకోవడం ప్రారంభించారు. ప్రజలు అసహాయులై ఏమిచేయుటకూ అశక్తులైనారు.

1847వ సం॥ము ఆగస్టు 11 వ తేదీన ముగ్గురు యువకులను ఆండర్సనుగారు క్రైస్తవమతంలో కలిపారు. అందులో

*True Yoke Fellows:–Life and labours of Rev. John Anderson and Johnston. By Braidwood. pp. 330-342.

ఒకడు బ్రాహ్మణుడు. అక్టోబరు 20 వ తేదీన పైనచెప్పిన ఐదుగురు ఆడపిల్లలనూ మతంలో కలిపారు. 1849 వ సం॥ జనవరి 7 వ తేదీన మళ్ళీ ముగ్గురు ఆడవాళ్ళను క్రైస్తవులుగా చేశారు. ఇలాగ క్రైస్తవమతప్రచారం అతితీవ్రంగా విజృంభించింది అన్నివిధాలా మిషనరీలకు దిగ్విజయంకలిగింది.

మిషనరీలు ముసల్మానులను క్రైస్తవమతములో కలపడానికి విశ్వప్రయత్నాలు చేస్తూ దీనికోసం ఎంతో ప్రచారం చేశారు. చెన్నపట్నంలో దేశీయులలో ఐకమత్యం లేనందువల్ల కొంత అలజడి తగ్గింది అందువల్ల మిషనరీల పాఠశాల మళ్ళీ అభివృద్ధి జెందింది. క్రైస్తవమత బోధకుల పలుకుబడి క్రమక్రమంగా హెచ్చింది. ప్రజల బాధలు ఎక్కువ అయినాయి.

చెన్నపట్నం ప్రభుత్వంవారు, న్యాయపరిపాలనలో కూడా క్రైస్తవ మత పక్షపాతం చూపించడానికి ప్రయత్నించారు. సదరు అదాలతు కోర్టు న్యాయాధిపతులు విచారించే కేసులలో ఇలా తీర్పు ఇవ్వవలసిందనీ, అలా చెయ్యవలసిందనీ శిఫారసులు చేయడం ప్రారంభించారు. అప్పట్లో సదరు అదాలతు కోర్టులో సహాయ న్యాయాధిపతిగా వున్న మాల్కలం లెవిన్‌గారు ఇలాగ ప్రభుత్వంవారి మాటలు విని అన్యాయం చెయ్యడానికి ఇష్టపడక, వారి తాకీదులను తిరస్కరించి తనకు న్యాయమని తోచినట్లే తీర్మానించేవాడు. అందువల్ల ప్రభుత్వాధికారులకు ఆయనపైన కోపంవచ్చి సీమలో కుంఫిణీ డైరెక్టర్లకు ఆయనమీద పితూరీలు పంపించారు. 1845 లో చెన్నపట్నం గవర్నరు కౌన్సిలులో ఒక

స్థానం కాళీ వచ్చింది. అంతట వుద్యోగ అర్హతను బట్టి ఆ పదవికి లెవిన్‌గారిని 10-9-1845 వ తేదీన తాత్కాలికంగా నియమించారు. అయితే కంపినీ డైరెక్టర్లు ఆ నియామకాన్ని రద్దుచేశారు. పైగా లెవిన్‌గారినీ, జార్జి జెంకిన్సు వాటర్సు, తామస్ ఎబెజ్‌నర్ బాయిలూ అనే ఇంకా ఇద్దరు సదరు కోర్టు న్యాయాధిపతులనూ 1846 లో వుద్యోగాలనుండి సస్పెండుచేశారు. 1847 లో వీరిని పనిలోనుంచి తొలగించి, వుపకార వేతనాలిచ్చి సీమకు పంపివేశారు.

పై సందర్భంలో లెవిన్‌గారు పనిమానుకునేటప్పుడు చెన్నపట్నంపౌరులు ఆయనయందు తమకు గల గౌరవాన్ని ప్రకటిస్తూ ఆయనకు ఒక వినతిపత్రం సమర్పించారు. దానికి జవాబుచెప్తూ లెవిన్‌గారు ఇలాగ అన్నారు :-

"న్యాయము పరిపాలించవలసిన న్యాయాధిపతులు కూడా తమ యిష్టప్రకారం జరిగించాలనే వుద్దేశ్యంతో చెన్నపట్నం ప్రభుత్వంవారు సదరు కోర్టు న్యాయాధిపతులను ఒత్తిడిచేయడం ప్రారంభించారు. న్యాయాధిపతులు ఈ అన్యాయానికి ఒడిగట్టడానికి యిష్టపడక తిరుగుబాటు చేశారు. అందువల్ల ఆ ప్రయత్నం అంతటితో ఆగిందిగాని, లేకపోతే ఈ ప్రభుత్వంవారు హిందువులను బలవంతంగా క్రైస్తవ మతంలో కలపడానికికూడా ప్రయత్నించేవారే. చెన్నపట్నం గవర్నరైన ట్వీడ్‌డేల్ ప్రభువు తనకు ఇలాంటి వుద్దేశ్యంలేదని అన్నాడుగాని, ప్రభుత్వంతో సంబంధంగల కొందరు పెద్ద ఆసామీలకు నిజంగా అలాంటి వుద్దేశ్యంవున్నదనే సంగతిన్నీ, అలాగ చెయ్యడానికి వారికనేక అవకాశాలుకూడా వున్నా

యనిన్నీ జరిగినసంగతులవల్ల నే స్పష్టపడింది. సదరుకోర్టు న్యాయాధిపతుల కర్తవ్య నిర్వహణాన్ని గురించి ప్రభుత్వం వారు జారీచేసిన ఉత్తర్వులకు న్యాయబుద్ధీ, ఆత్మగౌరవమూ గల ఏ న్యాయాధిపతిన్నీ సహించడు. ఈ సదరుకోర్టు న్యాయాధిపతులు దీనికి లోబడక యెదురు తిరుగుతారనే సంగతి ప్రభుత్వంవారికి బాగా తెలుసును. అందుకు తగిన ప్రతిక్రియ చేయడానికిన్ని గురించి వారు తమ సలహాదారులతో ఆలోచించుకునే కూర్చున్నారు. ఈ సందర్భంలో ప్రభుత్వంవారు జారీచేసిన తాకీదులను శిరసావహించి అన్యాయం జరిగించడానికి సదరుకోర్టులో రెండవ న్యాయాధిపతి లోబడక, ఏమైనాసరేనని అనేసాన్లు న్యాయస్థానం యొక్క గౌరవం నిలబెట్టినందువల్ల అతన్ని ఉద్యోగంలోనుంచి తొలగించడానికి తగినపన్నాగం పన్నారు."*

క్రైస్తవమతమున కలిసిన హిందువులకు కుటుంబా స్తిలో హక్కులుపోకుండా కుంపినీ ప్రభుత్వమువారు 1850 లో చేసిన శాసనము మిషనరీలకును, వారి స్నేహితులైన ఆంగ్లేయోద్యోగులకును చాలా సంతోషము కలిగినది.

"ఈ శాసనం ఒక మతంలోనుంచి ఇంకొక మతంలోకి కలపడాన్ని ప్రోత్సహించడంకోసం చేయబడినది కాదు. కేవలము అందరికీ సమాన హక్కులు వుండాలనే ఉద్దేశంతో మత స్వాతంత్ర్యము కలిగించడానికి చేయబడిన గొప్ప ధర్మశాసనము" అని చెన్నపట్నం సుప్రీముకోర్టులో న్యాయాధి

---

* Representation men of Southern India. By G. Parameswaran Pillai. pp. 148-149.

పతిగా వుండిన సర్ విలియంబర్టనుగారు సెలవిచ్చారు. మొదటినుంచీ క్రైస్తవ పక్షపాతంతో వుంటూవున్న ఈ దొరగారికీ శాసనం చాలా ఆనందం కలిగించింది. ఈ బర్టను గారిచ్చిన అన్యాయపు తీర్పులను గురించిన్నీ, బొంబాయి సుప్రీముకోర్టు న్యాయమూర్తియైన పెర్రీగారు వీనిని తీవ్రంగా విమర్శించిన సంగతిని గురించిన్నీ పైన 52–60 పుటలలో చెప్పబడియేయున్నది.

# రైత్వారీ ఆమరకము

గాజుల లక్ష్మీనరసుగారి నాయకత్వం క్రింద "మద్రాసు నేటివు అసోసియేషను" చెన్నపట్నం దేశీయ ప్రజాసంఘం వారు 10-12-1852 వ తేదీన పార్లమెంటు - కామన్సు సభవారికి పంపిన మహజరులో యీ క్రింది విషయాలను గురించి వ్రాశారు.

చెన్నరాజధానిలో రైతువారీ పద్ధతిని స్థాపించినది మొదలు శిస్తులు చాలా ఎక్కువగా విధించబడినందువల్ల భూములను కొనేవాళ్లు లేక వాటికి ధరలు లేకుండా వున్నా యని చెన్నపట్నం స్వదేశసంఘంవారు తమ మహజరులో వ్రాశారు. *

రైత్వారీ పద్ధతిలో భూములను సాగుచేయడం విష యంలో రైతులకు ఎలాంటి నిర్బంధమూ లేదని తూర్పు ఇండియా వర్తక కంపెనీ ప్రైరెక్టర్లకోర్టువారు సెలవిచ్చినా, రివిన్యూబోర్డువారు కూడా యీ విషయంలో రైతులను నిర్బంధించడానికి వీలు లేదని అంటూవున్నా నిజంగా యీ సిద్ధాంతం ప్రకారం రైతులను పోనిస్తే ప్రస్తుతం వసూలయ్యే

* Condition and requirements of Madras, Letter of John Bruce Norton to the Secretary Board of Control. (1854) 75-76.

రివిన్యూ ఆదాయంలో సగంవంతుకూడా వసూలు కాదని ప్రతి రివిన్యూవుద్యోగికీ తెలుసును.

ఒక రైతు తనకు లాభకరంగా వుండే భూమిని మాత్రమే సాగుచేసి అంతగా లాభంలేని పొలాన్ని సాగు చేయడు. ఆచరణలో ఈ సిద్ధాంతానికి విరుద్ధంగా రైతులను బలవంతపరిచి భూములను సాగుచేయిస్తున్నారు. ప్రస్తుతం సాగు అవుతూ వున్న విస్తీర్ణము సాగుచేయడానికి రైతులను బలవంతపరచలవసివస్తూ ఉంది. దేశమంతటనూకూడా బల వంతపరచి సాగుచేయిస్తూన్నారు. శాసనవిధులూ, నిబంధనలూ (రూల్సు - రిగ్యులేషన్సు) ఎలా వుంటూవున్నా తాశీల్దారులు రైతులను తమ పొలాలను విడుదల పెట్టనివ్వరు. కారణం ఏమిటంటే తన తాలూకాలో రివిన్యూ మొత్తం సాధ్యమైనంత ఎక్కువ స్థాయిలో వుంచితేనే తాశీల్దారుకు మెహర్బానీగా వుంటుంది, అని ఆ మహజరులో వ్రాశారు. *

("India as it may be") హిందూదేశ స్థితి అనే గ్రంథాన్ని వ్రాసిన కాంబెల్ అనే దొర హిందూదేశ స్థితి గతులను గురించి వర్ణిస్తూ రైత్వారీ పద్ధతినిగురించి వ్రాయ బడిన వ్యాసములు, పుస్తకములు మొదలైనవాటిలో నెల్లి కామన్సు సభవారికి చెన్నపట్నం స్వదేశసంఘంవారు వ్రాసి పంపిన అంశాలు యథార్థంగా వున్నట్లు తనకు తోచినదని వ్రాశాడు.§

* Ibid. pp. 88.

§ Ibid. pp. 107.

పొలములకు శిస్తును స్థిరంగా నిర్ధారణ చేయకపోవడం అలాగ వుండగా, పొలాల కొల్తలను హద్దులను స్థిరంగా నిర్ధారణ చేసే సర్వేరాళ్ళు కూడా చాలా గ్రామాలలో సరిగా లేవు. నెల్లూరు జిల్లాలో ఏ తాలూకాలోనూ పొలాల రాళ్లు కనబడడం లేదనిన్నీ, దత్తమండలాలలో కూడా రాళ్లు లేవనిన్నీ, తంజావూరు రాజులకాలంలో ఇలాంటి యిబ్బంది లేకుండా రైతుల పొలాలకు సరియైన పట్టాలు యిచ్చేవారనిన్నీ ఆ జిల్లా కలెక్టరే వ్రాసిన సంగతినికూడా ఆ మహాజరులో వుదాహరించారు. *

రొక్కరూపముగా శిస్తు వసూలు చేసే పద్ధతివల్ల రైతులకు చాలా నష్టం కలిగింది. గింజల ధరలు క్రమక్రమంగా తగ్గి శిస్తుభారం ఎక్కువ అయింది. గత నాలుగు సంవత్సరాలలోను ధరలు పూర్తిగా పడిపోయినందువల్ల పెద్ద రైతులుతప్ప సామాన్యులందరూ ముష్టి యెత్తుకోవలసినవారైనారు. ధాన్యానికి ధర లేకుండాపోయింది. ఈ రాష్ట్రంలోనేగాక బొంబాయి రాజధానిలోకూడా ఈ పరిస్థితులే సంభవించి రైతులు శిస్తు లిచ్చుకోలేని స్థితిలో వున్నారు. §

రైతులను పీడించడానికీ, బాధపెట్టి లంచాలు పుచ్చుకోవడానికీ సర్కారు ఉద్యోగులకు ఈ రైతువారీ పద్ధతిలో వుండే అవకాశం యింకొక పద్ధతిలో లేదు. నేరాలను ఆచోకీతీయడానికి పోలీసువాళ్ళు చేసేమాదిరి చర్యలన్నింటినీ రెవిన్యూ శిస్తును విధించడంలోనూ, దానిని వసూలు చేయడంలోనూ

* Ibid. pp. 117 - 118.

§ Ibid pp. 120 - 121.

ఈ ఉద్యోగులు చేస్తారు. దగాచేయడము పీడించడము సర్వసామాన్యంగా జరుగుతుంది. మొదటినుంచి చివరవరకూ రైతులను బాధించడానికి తాశీల్దారుడికి సర్వాధికారాలు వున్నాయి. ప్రారంభంలో ఏ సాలుకు ఆ సాలున పొలాలను రైతులకు అమర్చడం మొదలు రైతు వ్యవసాయం చేసుకొనే సందర్భంలో ప్రతిఘట్టములోనూ తాశిల్దారుజోక్యముకలిగించుకొనవచ్చును. రైతులకుకలిగే బాధలు ఇన్ని అన్ని అని చెప్పడానికిగాని,ఇలాగ వుంటాయని యిక్కడవర్ణించడానికి గాని వీలైనవి కావు. అందువల్ల రైతులు ఇవితప్పించుకోవడానికి సాధారణంగా లంచాలుయిస్తూ వుంటారు. గ్రామ ఉద్యోగి విషయంలోనూ, తాలూకా కచ్చేరిలోవున్న యితర ఉద్యోగుల విషయంలోనూ కూడా రైతు ఇలాగే తంటాలుపడతాడు.

ఏదోవిధంగా తాశీల్దారును మంచిచేసుకుంటేతప్ప (సెటిల్మెంటు) అమరకంసమయంలో అతడు తమకు వ్యతిరేకంగా వుండి అపకారం చేస్తాడు. పొలంమీదపండేపంట అంచనా విషయంలోనూ, సాగుచేసిన విస్తీర్ణాన్ని కప్పిపుచ్చి రివిన్యూ వారి కన్నుగప్పడంలోనూ, పాడైన పంటలకు రిమిషను - ముజరాల నిచ్చే విషయంలోనూ, తమ బ్రతుకంతా తాశీల్దారుగారి రిపోర్టుమీద ఆధారపడవలసి వుంటుందని రైతులకు తెలుసును. అందువల్ల గ్రామంయొక్క విస్తీర్ణాన్ని బట్టి తాశీల్దారులకు సాలియానా ముడుపు చెల్లించుకొని ఆతన్ని మంచిచేసుకుంటూ వుంటారు. అంతేకాదు; ఆ గ్రామానికి తాశీల్దారు వచ్చినప్పుడల్లా అతనికయ్యే ఖర్చులూ, అతని తాబేదార్ల కయ్యే భత్యఖర్చులూ కూడా గ్రామంవారే

భరిస్తూ వుంటారు. గ్రామానికి వచ్చినప్పుడు తనకయ్యే ఖర్చును తాను భరించాలనేమాట ఏ తాశీల్దారుడూ అనుకోడు.

తాశీల్దారుడి చేతులలో రైతులను బాధించే ముఖ్యమైన అధికారం 1816 లో సర్ తామస్ మన్రోగారి సలహాప్రకారం తాశీల్దారుల కివ్వబడిన పోలీసు అధికారాలే. ఒక తాశీల్దారు తన రివిన్యూ అధికారాలనుబట్టి రైతుకు తగిన ఒత్తిడి కలిగించడానికి అవకాశంలేక వాడిని ఏడిపించదలచుకుంటే తాశీల్దారుగారికి మొహర్రానికోసం గ్రామంలో తిరిగేవారు ఎవరో ఒకడిచేత ఆ రైతుమీద ఏదో నేరంమోపి అతడినిపట్టి తన సముఖానికి తెప్పిస్తాడు. అతనిని విచారించాలని చెప్పి అక్కడ ఏసాక్షి లేదనే నెపంమీదనో, ఇంకో నేరంమీదనో వదిలితే మళ్ళీరాడని నిర్బంధంలో వుంచుతాడు. ఈ అధికారం తాశీల్దారుడి చేతులో వున్నందువల్ల రైతు లందరూ అతని మీద కలెక్టరుకు చాడీలు చెప్పడానికి భయపడతారు. రివిన్యూఅధికారికే పోలీసుఅధికారంయిచ్చే పద్ధతి చాలా లోపభూయిష్టమైనది. ప్రతిజిల్లాలోనూ తాశీల్దారుతో సంబంధం లేకుండా పోలీసు అధికారి ఒకడు వుండేటప్పుడు ఈ రివిన్యూ అధికారులూ,పోలీసుఅధికారులూ ఒకరినిచూచి ఒకరుభయపడి జాగ్రత్తగా వుండేవారు. తాశీల్దారే రివిన్యూ అధికారి పోలీసు వారికపై అధికారి అయినందువల్ల ఈ అదుపులేక విజృంభించాడు.

పైన చెప్పినట్లు తన పోలీసు అధికారాన్ని దుర్వినియోగం చేయడమేగాక తనకు యిష్టమైనప్పుడూ, ఉపయోగించినప్పుడూ గ్రామాలలో జరిగిన నేరాలను గురించినవిగా

విచారణ జరపక, న్యాయం జరిగించక ఉపేక్షించేవాడు. రివిన్యూపరిపాలనలో తన అసమర్థతను కప్పిపుచ్చడానికికూడా నేరాలను ఆచోకీతీయకుండా కప్పిపుచ్చేవాడు. ఈ రైత్వారీ పద్ధతిలోని అన్యాయాలలో ఇది ఒకటిఅని చెన్నపట్నం స్వదేశసంఘంవారు వ్రాశారు. *

మోతర్ఫావసూలూ చిన్నచిన్న పొలాల అమరక నిర్ణయమూ, లైసెన్సులూగాక ఇంకా చిల్లర యిబ్బందులు చాలా వున్నాయి. ఆబ్కారీ పొగాకు పన్ను దిగుమతి రుసుములు సాయరు, వెట్టిచాకిరి, ఉప్పుయిజారాలు ముఖ్యమైనవి. §

* Condition and Requirements of Madras. pp. 144 - 146.

§ Ibid. pp. 172.

# "దిట్టము"

ఈస్టిండియా వర్తక సంఘంవారి పరిపాలనలో హిందూదేశ ప్రజలకుగల కష్టాలనుగురించి చెన్నపట్నం దేశీయ ప్రజాసంఘం (మద్రాసు నేటివ్ అసోసియేషను) వారు ఇంగ్లాండులో కామన్సు సభవారికి 10-12-1852 వ తేదీన పంపిన మహజరు 26 వ పేరాలో ఈ క్రింది సంగతులు పుదహరించారు.

"రైత్వారీ పద్ధతిలో ప్రభుత్వోద్యోగులు ఎలాంటి క్రూరకృత్యాలు జరిగిస్తున్నారో తమకు విశదం కాగలందులకు ఇటీవల 1851 లో జరిగిన సంగతులనుగురించి తమకు నివేదిస్తున్నాము. గుంటూరు జిల్లాలో కలెక్టరుగారి అధికారం క్రింద వున్న రైతులు కొందరు తమ బాధలనుగురించి ఆ కలెక్టరుగారికి చెప్పుకున్నప్పటికీ కలెక్టరుగారు వారి మొర లాలకించనందువల్ల జిల్లా కలెక్టర్లపైన అధికారిగావున్న ఉత్తర సర్కారుల కమిషనరుగారికిన్నీ, రెవిన్యూబోర్డువారికిన్నీ, సభాయుతులైన చెన్నపట్నం గవర్నరుగారికిన్నీ యీ క్రింది విధంగా అర్జీలు ఇచ్చుకున్నారు.

"కిందటి సంవత్సరం జరిగిన దిట్టము అనే సాలువారీ అమరకంలో ఆయా తాలూకాలలో తాశీల్దారులు జారీచేసిన దిట్టం పట్టాలను రైతులు పుచ్చుకోకుండా నిరాకరించాము.

కారణం ఏమిటంటే ఆ శాశ్వత్వాయులు తయారు చేయించిన దిట్టం పట్టాలో అదివరకు పనికిరాలిన వైనందువల్ల రైతులు విడుదలపెట్టిన భూములనుకూడా చేర్చారు. పైగా మామూలుగా కొలిచే పగ్గాలతోగాక వాటి కంటె ఒక మూరెడు తక్కువ పొడుగుగల పిచ్చపగ్గాలు పెట్టి, భూములకు కొల్తలు వేయించారు. ఇలాగ తయారు చేసిన దిట్టంపట్టాలమీంద సంతకాలు చెయ్యవలసిందని రివిన్యూ ఉద్యోగులు రైతులను బాధించారు. బెత్తాలతో కొట్టి, అనేకవిధాలుగా హింసించి ఖైదులో వుంచి నిర్బంధించి బలవంతం చేశారు. ఇదిచూచి తమకుకూడా యీ అవస్థ పడుతుందనే భయంతో ఆ తాలూకాలలో వుండే రైతులు కొందరు గ్రామాలు వదిలి పారిపోయారు. అలాగ పారిపోయిన వారికి కూడా బాధలు తప్పలేదు. వారివారికి నిర్ణయించిన భూములను నమోదుచేసిన పట్టాలమీద పారిపోయినవాళ్ల పేర్లను ఆ గ్రామకరణాలే సృష్టింపులు చేయించారు. పారిపోకుండావున్న రైతులు ఇది చాలా అక్రమమని కలెక్టరు గారికి మొరపెట్టుకున్నారుగాని, దిట్టాలను మార్చడానికి వీలులేదని కలెక్టరుగారు అన్నారు. కొన్నాళ్ళకు జమాబందీ వచ్చింది. ఆ పట్టాలనుబట్టి తమపైన విధించిన హెచ్చు మొత్తాలను చెల్లించడానికి రైతులు నిరాకరించారు. అంతట రివిన్యూ అధికారులు రైతుల యిండ్లకప్పులను పీకి ఆకలపనూ, వాళ్ల నాగళ్ళనూ, దుక్కిటియెడ్లనూ, విత్తనముగింజలనూ, పశువులమేతనూ కూడా జప్తుచేసి వేలం వేయించారు. ఇలాగ చేసినా గ్రామమొత్తంమీంద ఇంకా చాలాసొమ్ము వసూలు

కాకుండా దిగబడింది. ఆ శిస్తుబకాయికి హామీగా కొందరు రైతులను పట్టుకొని ఖైదులో వుంచారు. రివిన్యూబంట్రో తులు కొందరి ఇళ్ళలో జొరబడి చేతికి దొరకిందల్లా లాక్కొని లూటీచేశారు. ఈ జప్తుచేసిన ఆస్తిని వేలం వేయగా వచ్చిన సొమ్ములోనుంచే ఈ బంట్రోతులకు బత్తెము యిచ్చారు. రైతుల మందపశువులను మేయనివ్వ కుండా నిరోధించారు. ఊరి చెర్వులోనుంచీ, బావులలో నుంచీ మంచినీళ్లు తెచ్చుకోకుండా రైతుల భార్యలను నిరోధించారు. ఈ అక్రమాలను గురించి రైతులు సభా యుతుడైన గవర్నరుగారి కిచ్చుకున్న అర్జీ మామూలు ప్రకారంగా సంజాయిషీ నిమిత్తం ఆ కలెక్టరుగారికే పంపించ బడింది. ఈ లోపుగా ఆ కలెక్టరుగారు సెలవుపెట్టినందువల్ల ఆ అర్జీ ఆవాహనా. విసర్జనా లేకుండా అలాగే పడివుంది. ఇటీవల జరిగిన సంగతులనుగూర్చి పైన చెప్పిన ఒక్క వుదా హరణాన్ని మాత్రమే తమ కిప్పుడు మేము మనవిచేసినప్పటికిని ఇలాంటి అక్రమాలు దేశమంతటా జరుగుతూనే వున్నాయని చెప్పడానికి సందేహ మేమీ లేదు"అని వ్రాశారు.

'దిట్టము'అనేది రైతులకూ, సర్కారుకూ ప్రతిసాలునా జరిగే అమనకం ఏర్పాటు. ప్రతిగ్రామంలోనూ వుండే భూమి యావత్తూ పొలాలుగా విభజించబడి ఆ పొలాలన్నీ కరణంగారి పుస్తకములో వరసగా నమోదుఅయివుంటాయి. కరణంగారు ఆ లెక్కలో పొలంవిస్తీర్ణము, దానితరగతీ, శిస్తురేటు, ఆపొలం మీద పసగాలు కావలసిన శిస్తు మొత్తమూకూడా నమోదు చేస్తారు. సాగుచేయడం ప్రారంభంకాగానే ఏమిపైరు వేసి

నది కూడా నమోదుచేస్తాడు. పదిహేనురోజుల కొకమాటు, నెలకొకమాటు, జమాబందీ వచ్చేవరకూ అజమాయిషీ చేస్తా ఆ లెక్కలను తాశీల్దారుకు పంపిస్తాడు. సాగు తరుణం రాగానే జూలై, సెప్టెంబరు నెలలమధ్య దిట్టం అనే ఏర్పాటు జరుగు తుంది. అప్పుడు తాలూకా రివిన్యూ అధికారులు గ్రామానికి వచ్చి ఏరైతు ఏ పొలం సాగుచేయవలసినదీ నిర్ణయిస్తారు. ఇందుకోసం తాలూకాను మూడు నాలుగు ఫిర్కాలుగా విభజిస్తారు. ఒక్కొక్క ఫిర్కాలో ఒక్కొక ఉద్యోగి ఈ ఏర్పాటు జరిగిస్తాడు. ఆ వుద్యోగి గ్రామానికి రాగానే గ్రామ రైతులూ, గ్రామ కరణమూ, మునసబూ ఆయనదగ్గరకు వస్తారు. మామూలుగా ఒకరైతు సాగుచేస్తూవున్న పొలం ఏదని అడిగి సాధారణంగా దానిని అతనికే యిస్తారు. సాగు చేయకుండా దిగబడిన పొలాలు ఏవైనావుంటే అవి ఎవరో ఒకరు సాగుచేసేటట్టు కట్టుదిట్టం చెయ్యాలి. భూముల మార్పిళ్ళుకూడా రిజస్టరు చేస్తాడు. భూమిని దున్నకుండా రైతు పాడుపెట్టినట్లైతే మందలిస్తాడు. గ్రామ మొత్తంమీద పొలాలన్నీ సక్రమంగా అమరకం చేయించడానికి ప్రయత్ని స్తాడు. తరవాత జమాబందీ జరుగుతుంది. అప్పుడు రైతు లిచ్చుకున్న అర్జీలను విచారిస్తారని పేరు. కాని సాధారణంగా ఆలన పాలన జరగడం చాలా అరుదు. తరువాత ఆప్రకారం అమర్చబడిన భూములకు పట్టాలు జారీచేస్తారు. ఆ కాలంలో సాగుచెయ్యడానికి వీలైన భూమినీ సాగుచెయ్యడానికి వీలులేని భూమినీకూడా ఆ పట్టాలలో చేర్చేవారు. సాగుచేయని భూమికి శిస్తు ముజరా (రిమిషను) యిస్తామని అనేవారు గాని,

ఆచరణలో పట్టాశిస్తు మొత్తం యావత్తూ వసూలుచేసే వారు. రిమిషన్లు బహు అరుదుగానూ, తక్కువగానూ యిచ్చేవారు. ఇందులో జరిగే అన్యాయాలు చాలా ఎక్కువగా వుండేవి. గ్రామ మొత్తంమీద తాలూకా మొత్తంమీద జిలా మొత్తంమీద చెల్లింపవలసిన శిస్తు యావత్తూ వసూలు చెయ్యాలని రివిన్యూబోర్డునుంచి తాకీదులు వస్తూవున్నందువల్లను, బకాయిలేకుండా శిస్తులు వసూళ్ళు చేయించిన కలెక్టర్లు చాలా గట్టివాళ్లని మెచ్చుకుంటూ వున్నందువల్లను, కలెక్టర్ల మెహర్బానీకోసం తాశిల్దారులు గ్రామాలమీద పడి రైతులను తిట్టి కొట్టి చిత్రహింసలు పెట్టి శిస్తులువసూళ్లు చేసేవారు. దీనిని గురించి 1855 లో ఒక విచారణకూడా జరిగింది. *

---

* The Condition and Repuirements of Madras. John Bruce Norton. pp 131-132,

# "మోతర్఩ా"

జమీందారీ గ్రామాలలో కల్లుగీయడానికి తాటిచెట్లు కామందులకు ఇచ్చే సొమ్ముకి 'మోతర్ఫా' అని ఇప్పటికీ వాడుతూవుంటారుగాని ఈ మోతర్ఫా అనేది మన దేశ చరిత్రలో చాలా ప్రసిద్ధి జెందిన ఒకవిధమైన తలపన్ను. ఇంగ్లీషు తూర్పు ఇండియావర్తక కంపెనీవారు మనదేశాన్ని పరిపాలిస్తూ వుండగా గ్రామాలలోనూ పట్నాలలోనూ కుల వృత్తులు చేసుకుని జీవించేవాళ్లమీదను చిల్లర వర్తకం చేసుకుని బ్రతికేవాళ్లమీదనుకూడా ఈపన్ను విధించేవారు.

సాలెవాళ్ల మగ్గాలమీదను, పత్తి రాటాలమీదను, గొర్రెల కాపరుల మీదను, కమ్మరి, కంచరి, వడ్రంగి, రాతి చెక్కడము పనివాళ్లు మొదలైన వివిధవృత్తులు చేసుకునేవాళ్ల మీదను, ఆఖరికి రాటంమీద నూలువడికే ముసలమ్మల మీదనుకూడా ఈపన్ను వేసేవారు. ఇది మన ప్రజలకు చాలా బాధకరంగా వుండేది...దీనిని గురించి మనవాళ్లు మొరపెట్టుకోగా మొరపెట్టుకోగా ఆఖరికి 1853 నాటికి ఒక్క చెన్నరాజధానిలో తప్ప తక్కిన రాష్ట్రాలన్నింటిలోనూ దీనిని రద్దు చేశారు.

ఏ వృత్తిగాని ఏ వ్యాపారంగాని చేసుకొని బ్రతకాలన్నా ఏవస్తువునైనా అమ్ముకొని బ్రతకాలన్నా ఈపన్ను చెల్లిం

చాలి. దుకాణదారులపైన ప్రత్యేకంగా పన్ను విధించడమే గాక వీధుల ప్రక్కలను చాపలుగాని, గుడ్డలుగాని పరుచుకుని అమ్ముకునే చిల్లర బేరగాళ్ళమీదను, వీధులలో తిరిగి అమ్ముకునే వాళ్ల మీదను కూడా ఈ పన్ను విధించేవారు. చిన్న చిన్న వృత్తులు చేసుకునేవాళ్ళమీదనే గాక వాళ్ళు తయారుచేసే వస్తువులమీదను వాళ్ళు వుపయోగించే పనిముట్లమీదనూ కూడా ఈపన్ను వేసేవారు. ఆ పనిముట్ల ఖరీదుకు ఎన్నో రెట్లు సొమ్మును మోతర్ఫాగా చెల్లిస్తేగాని ఆ వృత్తి చేసుకోవడానికి వీలులేదు !

ఈ మోతర్ఫా పన్నుయొక్క భారం ధనవంతులమీదకంటె బీదవాళ్ళమీదనే ఎక్కువగా పడేది.

ఈ పన్ను వసూలుచెయ్యడానికి వుద్యోగులకివ్వబడిన నిరంకుశమైన అధికారాలను పురస్కరించుకుని వాళ్ళు తమ చిత్తంవచ్చినట్లల్లా ఆ అధికారాలను చెలాయించేవారు. నేరాలను ఆచోకీ తీయడంకోసం పోలీసువారుచేసే జులుమును వుపయోగించేవారు. అకస్మికంగా వచ్చి దర్యాప్తులు చేసేవారు. ఇళ్ళలో జొరపడి సోదాచేసేవారు. పన్నులివ్వలేనివారిని సంకెళ్ళువేసి బొండలో పెట్టి ఖైదుచేసి హింసించేవారు. ఈ చర్యలకు భయపడి ప్రజలు లంచాలిచ్చేవారు.

చెన్నపట్నంలో గాజుల లక్ష్మీనరుసు సెట్టిగారి నాయకత్వంకింద 1844 మొదలు ప్రజాసేవచేస్తూ వుండిన మద్రాసు నేటివు అసోసియేషన్ అనే దేశీయ ప్రజాసంఘంవారు హిందూదేశ ప్రజల బాధలను గురించి ఇంగ్లాండులోని కామన్సుసభ

వారికి 10-12-1852 వ తేదీన పంపిన మహాజరులో మోతర్ఫాను గురించి గట్టిగా మొరపెట్టారు అందులో ఇలాగ వ్రాశారు :—

"మోతర్ఫా అనేది వర్తకులమీాదను, కులవృత్తులు చేసుకుని బతికేవారిమీాదను విధించబడే పన్ను. ఇది ప్రత్యక్షంగా రైతులను బాధి చేటట్లు కనబడకపోయినా వర్తకులకు యిబ్బందిని కలిగించి వ్యాపారాన్ని తగ్గించేది ఏదైనా రైతులు పండించే పంటలకు సరియైన ధరలు రాకుండా చేస్తుంది. గనుక ఆ విధంగా ఇది రైతులకు నష్టం కలిగిస్తూవుండి. ఈ మోతర్ఫాలో చాలాభాగం చేనేత మగ్గాలమీాద బట్టలు నేసే వాళ్ళే చెల్లించాలి! ఇంగ్లాండు దేశంవారి యంత్రాలతో పోటీ చేయలేక బాధపడుతూ వున్న చేనేత మగ్గాలవాళ్ళమీాదనే యీా భారం పడడంవల్ల వాళ్ల కష్టాలు యింకా దుర్భరంగా వున్నాయి. ఇందువల్ల నేత పరిశ్రమ తగ్గిపోయి రైతులు పండించే ప్రత్తిధర పడిపోయితీరుతుంది.

భూమిమీాదవిధించే పన్నుల వసూలపద్ధతికంటె కూడా యీా మోతర్ఫా పన్నుల వసూలుచేసే పద్ధతి చాలు క్రూరముగా వున్నది. ఈ నేతగాండ్రు తమ మగ్గాలను కనపడకుండా ఎక్కడనో దాస్తున్నారనే నెపంతో పన్ను వసూలుచేసే వుద్యోగులు వాళ్ల యిళ్లల్లో జొరపడతారు. ఈ పన్నుకు ఒక నిలకడగాని, నిరుకుగాని లేదు. తమ యిష్టంవచ్చినప్పుడల్లా, పన్ను మొత్తాన్ని హెచ్చిస్తూవుంటారు. దానిని హెచ్చుచేస్తామని బెదిరించిగాని, తగ్గిస్తామని ఆశపెట్టిగాని వుద్యోగులు లంచాలు పుచ్చుకుంటూ వుంటారు. ఈ

పన్నుయొక్క భారంకూడా, అందరిమీదా సమానంగా పడదు. డబ్బుగలవాళ్ళ పైనకంటే బీదవాళ్ళ పైననే యీ పన్ను యెక్కువగా పడుతూవుంది. యీ పన్ను చెల్లించడానికిన్నీ, పట్టాలు పొందడానికిన్నీ ఈ బీదవాళ్ళు చాలా దూరంలో ఇంకో గ్రామంలోవుండే కచ్చేరికి పోవలసి వస్తూవున్నందువల్ల పనిచెడి తాము చెల్లించేసన్ను మొత్తం కంటె యెక్కువ మొత్తమునే నష్టపడుతూ వుంటారు. ఈ పన్ను అయోధ్య, ఆగ్రా రాష్ట్రాలలో ఎన్నడూ విధించినట్లు లేదు వంగరాష్ట్రంలో విధించబడినా 1793 లోనే రద్దు చేశారు. బొంబాయి రాజధానిలో 1844 లో రద్దుచేశారు. ఇప్పుడీ హిందూదేశంలో ఇంగ్లీషువారి రాజ్యంలో ఒక్క యీ రాజధానిలో మాత్రమే ఈ మోతర్ఫా వసూలు చేస్తున్నారు. పోనీ, దీనివల్ల ప్రభుత్వంవారి కేమైనా గొప్ప ఆదాయం వస్తూవుందా అంటే పది లక్షల మందిని బాధ పెట్టగా వసూలుఅయ్యే పన్ను మొత్తం 11,600 నవరసులు మాత్రమే."*

చెన్నపట్నం ప్రజాసంఘంవారు వ్రాసిన అంశాలలో అతిశయోక్తి యెంతమాత్రమూ లేదు. 1853 లో కామన్సు సభవారి యెదుట సాక్ష్యంచెప్పిన సాక్షులలో చెన్నరాజధానిలో మేజస్ట్రేటుగాను రివిన్యూశిస్తువసూలు వుద్యోగిగాను పనిచేసిన జె. డబియు. బి. డైక్సుగారు ఈ మోతర్ఫా పన్ను తాను వసూలుచేయించినా నన్నీ, ఇది ప్రజలకు

* The Madras Native Petition quoted in the condition and Requirements of Madras. John Bruce Norton - 1854. pp 168–169.

చాలా బాధకరంగా వున్నదనిన్నీ గట్టిగా చెప్పాడు. "కేవలమూ ఎగుమతి దిగుమతి వాణిజ్యవ్యాపారాలు చేసుకునే వారిమీదనేకదా ఈ మోతర్ఫా విధించబడుతూవున్నది?" అని కామన్సుసభలో బ్రైట్సుగారిని ప్రశ్నించగా ఆయన ఇలాగ జవాబు చెప్పాడు: "భూమిని దున్నుకుని బ్రతికే రైతులు గాక యింక యే వృత్తివ్యాపారం చేసుకునేవారైనా సరే వాళ్ళందరిమీదనూ ఈ పన్ను విధిస్తున్నారు. ఒక ముసలమ్మ కూరగాయలు పట్టుకుని వెళ్ళి ఒక వీధిమూలను అమ్ముకోవ డానికి వెడితే ఆ ముసలమ్మవల్లకూడా ఈ మోతర్ఫా పన్ను వసూలుచేస్తారు. ఒక మనిషి బట్టలవర్తకుడుగా వుంటే వాడుకూడా యీ మోతర్ఫా యిచ్చుకోవాలి. అయితే అయిరోపాదేశస్థు లెవ్వరూ ఈ పన్ను చెల్లించనక్కర లేదు. నాలుమొత్తంమీద ఏదో కొద్దిపాటి లాభం సంపాదించుకునే దేశీయవర్తకుడు మోతర్ఫా పన్ను యిచ్చుకుని తీరాలి. వాడి యింటిపక్కనే వ్యాపారంచేస్తూ చాలా లాభం సంపా దించే దొర ఒక దమ్మిడీ అయినా యిచ్చుకోనక్కర లేదు" అని బ్రైట్సుగారు జవాబు చెప్పారు. *

కోయంబత్తూరు జిల్లాలో సింగనల్లూరు అనే గ్రామ కరణంగారు వుంచిన లెక్కలవల్ల ఆ కాలంలో వసూలుచేయ బడే మోతర్ఫా పన్నుల తబ్సీళ్లు తెలుస్తున్నాయి.

---

* 'Commons' First Report 1853 Appendix 7; Fourth Report (1853). India in the Victorian Age. R. C. Dutt pp. 164 - 165.

| | ర. అ. పై. |
|---|---|
| ఉప్పుపన్ను కావడి 1-కి | 1- 7- 6 |
| మోతర్ఫాపన్ను :— | |
| బట్టలదుకాణ పైన - 1 వ రకం (40 ఫణములు) | 11-12- 0 |
| డిటో 2 వ రకం (20 ఫణములు) | 5-14- 0 |
| డిటో 3 వ రకం (10 ఫణములు) | 2-15- 0 |
| మంగళ్లపైన తల 1 కి ( 8 ఫణములు) | 2- 5- 8 |
| కమ్మరివాళ్లపైన ,, ,, | 2- 5- 8 |
| వడ్రంగులపైన ,, ,, | 2- 5- 8 |
| రెండెడ్ల బళ్లపైన ,, ,, | 2- 5- 8 |
| నేతగాళ్లపైన ,, (6 ఫణములు) | 1-12- 3 |
| సరకులు మోసే ఎడ్లపైన తల1కి (4 ఫణములు) | 1- 2-10 |
| శేనదులనే కల్లు గీసె, కలాలీలపై తల 1 కి (2 ఫణములు) | 0- 9- 5 |
| కురుంబల్లు అనేకంబళినేతగాండ్రపైన (2 ఫణములు) | 0- 9- 5 |
| చాకళ్లపైన తల1 కి (8 ఫణములు) | 2- 5- 8 |
| మాలవాళ్లపైన తల 1 కి (3 ఫణములు) | 0-14- 2 |
| నీలిమందు తోట్లపైన 1 కి (8 ఫణములు) | 2- 5- 8 |
| జోళ్లుకుట్టే మాదిగలపైన తల 1 కి (8 ఫణములు) | 2- 5- 8 |
| నూనెగానుగలపైన 1 కి (10 ఫణములు) | 2-15 0 § |

§ Forty years of Progress in the Madras Presidency - Srinivasa Raghava Iyengar p. xxxiii.

# ఉప్పు పన్ను - రోడ్లు

హిందూదేశంలో ఉప్పుపన్ను ఏవిధంగా అమలు జరుగుతున్నదీ హిందూదేశ పరిపాలననుగురించి ఇంగ్లాండులో హౌసు ఆఫ్ కామన్సువారు ఏర్పరచిన సెలక్టుకమిటీ (విచారణ ఉపసంఘం)వారి యెదుట చాలా సాక్ష్యం వచ్చింది.

చెన్నపట్నం దేశీయప్రజాసంఘం (మద్రాసు నేటీవు అసోసియేషను) వారు టి. రామస్వామి మొదలైనవారి దస్కతులతో 1852 లో పంపిన మహజరులో చెన్నపట్నం లోని పరిస్థితులు వివరింపబడినాయి.

తూర్పు ఇండియా వర్తక కంపెనీ సర్కారువారు ఉప్పు ఉత్పత్తిని, అమ్మకమును, బందోబస్తు చేయడానికి 1806 లో ఒక ప్రభుత్వశాఖను యేర్పరిచారు. దీని ఫలితంగా వెంటనే ఉప్పుధర రెట్టింపు అయినది. అప్పుడు ధర గరిసె 1 కి 70 రూపాయలు (7 నవరసులు)గా నిరుకుపరిచారు. ఉప్పు వాడకం ఎలా వుంటుందో గమనింపగా మూడేళ్ళలో 31685 గరిసెలు ఖర్చు అయినట్లు తేలింది. అంతట 1809 లో ఉప్పు ఖరీదు గరిసె 70 రూపాయిలనుంచి 105 రూపాయిలకి హెచ్చు చేశారు. అనగా ఉప్పు వ్యాపారాన్ని సర్కారు వారు వశపరచుకొనేటందుకు పూర్వంవున్న ఖరీదుకు మూడు

రెట్లు పెంచారు. దీనివల్ల ఉప్పువాడకం సహజంగా తగ్గింది. అందువల్ల 1820 లో దీనిఖరీదు మళ్లీ గరిసె 1 కి 70 రూపాయలకు తగ్గించారు. మళ్ళీ ఎనిమిదేళ్లు చూసి రు. 105 లకి హెచ్చించారు. తరవాత 1844 లో గరిసె 1 కి 180 రూపాయిలు చేశారు. మళ్ళీ ఆ సంవత్సరమే రు. 120 రూపాయిలకు తగ్గించారు. ఈ ధరలన్నీ టోకు వర్తకులకిచ్చే ధరలైనందువల్లను వాళ్లు మళ్లీ లాభాలు వేసుకుని అమ్ముతారు గనుక ఉప్పు కలుపుకుని గంజి తాగే బీదవాళ్లమీద ఈ భారము క్రమక్రమంగా హెచ్చింపబడింది. అందువల్ల బీదవాళ్లు ఉప్పుతినడం బొత్తిగా మానివేసి నెయ్యడమో లేకపోతే సర్కారువారి దండనలకుకూడా తెగించి చవుడులోనుంచి అపరిశుద్ధమైన ఉప్పు చేసుకుని తినడమో జరిగేది. సర్కారు తయారుచేయించే ఉప్పు తప్ప ఇంకోవిధంగా ఉప్పు ఎవ్వరూ తయారుచేయకూడదనే నిషేధం ఏర్పరచి అది మీరినవారిని కలెక్టర్లూ, తాశీల్దార్లూ జుల్మానాలువేసి దెబ్బలుకొట్టి బాధించేవారు. *

చెన్నపట్నం స్వదేశసంఘంవారు కామన్సు వారికి 10-12-1852 పంపిన మహజరు (మద్రాసునేటీవు పిటీషను)లో ఇలాగ వ్రాశారు :

"చెన్నరాజధానిలో రోడ్లు చాలాదుఃస్థితిలోవున్నాయి. ఈ విషయాన్ని గురించిన సంగతులు తెలపవలసిన దని యీ సంఘమువారు ప్రభుత్వంవారిని కోరగా వారు తప్సీలు ఇవ్వ

* Common's First Report 1853 Appendix 7 India in the Victorian Age R. C. Dutt pp. 150-151. Condition and Requirements of Maras, J.B Norton. p. 175.

డానికి నిరాకరించారు. సివిలు మిలిటరీశాఖలలోని వుద్యోగులు సర్కారుకు సంబంధించిన సంగతులను ఇతరులకు తెలుపగూడ దనే నిషేధం వున్నందువల్ల 32 వ నెంబరు కలకత్తా రివ్యూలో ఒకరు వ్రాసిన వ్యాసంలోని సంగతులపైన ఆధారం చేసుకొని ఈ దిగువ సంగతులను వ్రాశాము. 1851 లో హౌవుస్ ఆఫ్ కామన్సువారి వుత్తర్వు ప్రకారం అచ్చువేయిం చిన పబ్లికువర్కుసు రికార్డులలో చూపబడిన ప్రధానమైన బాటలు (ట్రంకురోడ్లు) 11 మాత్రమే. అయితే వీటిలో పూర్తిచేయబడినవి చాలా స్వల్పం. వీటిలో ఒక్కటికూడా సరియైన మరమ్మతులో వుంచలేదు. సెంట్ తామస్ మౌంటు నుంచి సెంట్ జార్జికోటకుపోయే 8 మైళ్ళ రాజబాటమాత్రం సరియైన స్థితిలో వుంటుంది. చెన్నపట్నంనుంచి కలకత్తాపోయే 900 మైళ్ళరోడ్డు లెక్కలలో చూపిస్తారుగాని అది పూర్తి కాలేదు. ఈ రోడ్డు బా:: లేనందువల్ల చెన్నపట్నానికి 100 మైళ్లు దూరంలో వున్న నెల్లూరునుంచి బట్టలు మూటలు కూలీల నెత్తిమీద పెట్టి తెస్తారు. దానితరవాత 50 మైళ్లు కేవలమూ ఊబినేల ప్రక్కనుంచి పోతూ బళ్లు దిగబడుతూ వుంటాయి. రాజమహేంద్రవరం దగ్గిర ఒక పెద్దమనిషి ఈ రోడ్డుమీద ప్రయాణం చేయవలసి రాగా ఏడుమైళ్ళు పోవడానికి నాలుగుగంటలు పట్టింది!" *అని ఇలాంటి వుదాహ రణాలతో ఈ రోడ్డు సంగతి వర్ణిస్తూ ఒక పెద్దజాబితాను వ్రాశారు.

* Ibid pp. 49 - 51.

# రాజకీయాందోళనము

1852 వ సం॥రం ఏప్రియల్ 15 వ తేదీన సర్కారు హైస్కూలు వార్షికోత్సవ సందర్భంలో మాట్లాడుతూ చెన్న పట్నం గవర్నరైన సర్ హెన్రీ పొటెంజరుగారు కంచిలో బాలబాలికల మిషనరీ పాఠశాలలో జరిగిన కృషిని ప్రశంసిస్తూ ఒక ముఖ్యమైన సంగతిని సెలవిచ్చారు. "ఈ దేశంలో చాలా ప్రాంతములందు క్రైస్తవ మతబోధకులు నడుపుతూ వృన్న చక్కని పాఠశాల లున్నాయి. అలాంటి పాఠశాల లున్నచోట్ల ప్రభుత్వంవారు మళ్ళీ వేరే పాఠశాలలు స్థాపించ డానికి యిష్టపడరు. అలా స్థాపించడం అసమంజసం కూడాను. ఎందువల్లనంటే, అలాచేస్తే యీ క్రైస్తవ మిషనరీల ఉద్దేశం ఒకటి అనిన్నీ, ప్రభుత్వంవారి ఉద్దేశం యింకొకటి అనిన్నీ ఈ దేశప్రజలు అనుకోని పొరపాటు పడవచ్చును" అని అన్నారు. ఈ గవర్నరుగారు ఇలాగ సెలవివ్వడం మిషనరీలకు చాలా లాభకరమైనది. 1852 వ సం॥ అక్టోబరులో వ్రాస్తూ ఆండ ర్సన్‌గారే ఇలాగ అన్నారు: "ఇది క్రైస్తవ మత ప్రచా రానికి దారితీసింది. దేశప్రజలలో అన్ని తరగతుల వారిలోనూ,

వర్ణాలలోనూ మనకు దీనివల్ల ప్రవేశం కలిగింది. లేకపోతే యిప్పటికీ అవి మనకు చొరరాని దుర్గాలుగా వుండేవి."*

గాజుల లక్ష్మీనరుసుగారి నాయకత్వంక్రింద మద్రాసు నేటివు అసోసియేషన్‌వారు 1852వ సంవత్సరం డిశంబరు 10 వ తేదీన ఒక మహాజరు తయారుచేసి, ఇంగ్లాండులోని పార్లమెంటు సభకు పంపించారు. ఇది నూట ఇరవై పేరాల పైగా నుండిన దీర్ఘమైన నివేదిక. హిందూదేశ ప్రజలకున్నూ, ముఖ్యంగా దక్షిణ హిందూదేశంలో వున్న వారికన్ని గల కష్టాల నన్నింటినీ అందులో వివరించారు "అత్యధికమైన పన్నుల భారంవల్లను, వానిని వసూలు చేయడంలో జరుగుతూవున్న అక్రమాలవల్లనూ, కుంపినీవారి కోర్టులలో వ్యాజ్యములు పరిష్కరించడంలో జరిగే ఆలశ్యంవల్లనున్నూ, అందుల కయ్యే అమితమైన ఖర్చులవల్లనూ, సరియైన న్యాయవిచారణ లేకపోవడంవల్లనూ, తమ అర్జీదారులైన ప్రజలు బాధపడుతున్నారు. దేశంలో రాకపోకలకు సరియైన రోడ్లు లేవు; వంతెనలులేవు. పల్లపు సాగుకు నీటివసరులున్నూ సరిగా లేవు. ప్రజలకు సరియైన విద్యయున్నూ లేదు. ప్రభుత్వపు ఖర్చులు తగ్గిస్తేనేగాని లాభంలేదు. దేశాన్ని బాగుచేసి ప్రజల క్షేమలాభాలు ఆలోచించే రాష్ట్రీయ పరిపాలనావిధానం వుండాలి" అని మహాజరు ప్రారంభించి, ఈవిధంగా ముగించారు:—"ఈ

---

* True Yoke fellows in the Mission filed: Life and Labours of the Rev. John Anderson and the Rev. Robert Johnston. Madras Free Church Mission. By the Rev. John Braidwood M. A. London. James Nisbet & Co. (1862) pp. 430-434.

హిందూదేశ పరిపాలనను ఇప్పటిలాగనే కుంపినీవారి చేతుల లోనే వుంచదలచినా సరే లేదా ఇంకా ఏదైనా ఒక కొత్త విధానం స్థాపించదలచినా సరే; దేశ క్షేమానికి అవసరమైన మార్పులు అప్పుడప్పుడు చేయడానికిమాత్రం అందులో అవ కాశం కలిగించాలి. మూడుసంవత్సరాల కొకమాటుగాని, ఆఖరికి ఐదుసంవత్సరాల కొకమాటు అయినాగాని ఈ దేశంలో పరిపాలన ఎలాగ జరుగుతూవున్నదో అనే సంగతిని గురించి పార్లమెంటువారు విచారించి చర్చించాలి. అలా చేస్తే దూరదేశంలో, వున్న ఈ విశాల సామ్రాజ్యంలోని ప్రజలు తమకుగల కష్టాలను చెప్పుకుని, అవి తీర్చుకోవడానికి అవకాశం వుటుంది. ఇలాగ, పై యధికారుల అదుపు ఆజ్ఞలూ, తనిఖీయున్నూ వున్నవంటే ఇక్కడి ప్రభుత్వాధి కారులుకూడా జాగ్రత్తగా వ్యవహరిస్తారు" *

ప్రజల మతాచారాలతో జోక్యం కలిగించుకో మనిన్నీ, వాటిని సంరక్షిస్తామనిన్నీ బ్రిటిషు ప్రభుత్వం వారు చేసిన వాగ్దానాలను ఇక్కడి మిషనరీలూ, ప్రభు త్వాధికారులూ కలిసి భంగపరుస్తూ వున్నందుకు అనేక వుదాహరణాలను ఈ మహజరులో వివరించారు సర్కారు పాఠశాలలో బైబిలును ప్రవేశపెట్టడానికి మిషనరీల ప్రోత్సాహంతో ప్రభుత్వోద్యోగులు ప్రయత్నిస్తూ వుండ డము, క్రైస్తవులైనవారికి ఆస్తి హక్కులు పోకుండా హిందూ మహమ్మదీయ ధర్మశాస్త్రాలకు విరుద్ధంగా కొత్త శాసనాన్ని చేయడము, న్యాయవిచారణంలో

* Representative men of Southern India — G. Parameswaran Pillai [1896] pp. 155–157.

కూడా మిషనరీలు కలుగజేసుకుంటూ వుండడము, అధికారులు పక్షపాతబుద్ధితో వారికి అనుకూలంగా తీర్పులు యిస్తూ ప్రజల కన్యాయం చేస్తూవుండడము, హిందూ దేవాదాయాలను మహమ్మదీయ ధర్మాదాయాలనూ కాపాడుటకు చేసిన చట్టము ప్రకారము కుంపినీవారు జాగ్రత్తగా పరిపాలించి ధర్మాలు నిర్వహించవలసివుండిన్నీ మిషనరీల ప్రోత్సాహంతో కుంపినీ అధికారులు వాటిని వదిలివేసి వుపేక్షించడము, అందువల్ల అవి పాడైపోతూ వుండడము మొదలైన అన్యాయాలను ఆ మహజరులో వివరించారు.

రైత్వారీపద్ధతిలో రైతులకు కలుగుతూవున్న అన్యాయాలను గురించి, వెట్టిచాకిరీని గురించీ, అధికారుల లంచగొండితనమును గురించీ, పోలీసుల అప్రయోజకత్వాన్ని గురించీ, కలెక్టరుల నిరంకుశత్వాన్ని గురించీ, మోతుర్ఫా అనే పన్ను వసూలులో చిల్లర వృత్తులవాళ్ళకు కలుగుతూవున్న బాధలనుగురించీ, శిస్తులు వసూలు చేయడంలోనూ నేరములను ఆచోకీ తీయడంలోనూ, పోలీసు రివిన్యూ వుద్యోగులు ప్రజలనుపెట్టే చిత్రహింసలను గురించీ అనేక వుదాహరణ లిచ్చారు. ఇది "మద్రాసు నేటివ్‌పిటిషను" అని ప్రసిద్ధిచెందింది.*

ఈ మహజరును 1853 వ సంవత్సరం ఫిబ్రవరినెల 25 వ తేదీన ప్రభువుల సభలో ఎలెన్‌బరో ప్రభువు దాఖలు చేశాడు. దీనిని గురించి గాజుల లక్ష్మీనరసు సెట్టిగారు

* The condition and Requirements of Madras Presidency-John Bruce Norton (1854).

వ్రాసిన 24-1-1853 వ తేదీ గల ఇంగ్లీషు వుత్తరాన్ని ఆల్బీ మెరల్ ప్రభువు ఆ సభలో చదివి వినిపించారు. అందులో ఇలాగ వున్నది. "ఒక విచారణ సంఘం ఈ దేశానికి వచ్చి విచారిస్తే, ప్రజల కష్టాలన్నీ విశదం అవుతాయి. ఇందులో యేమీ అతిశయోక్తులు లేకుండానే మేము వ్రాశాము. అయితే ఇలాంటి అక్రమాలు నిజంగా జరుగుతున్నాయా? అని ఐరోపావారు ఆశ్చర్యపడి నమ్మకపోవచ్చును. అందు వల్ల ఒక విచారణ సంఘంవారు వచ్చి విచారించి దీనిని గురించి ప్రకటించడం చాలా అవసరం" అని వ్రాశారు.

1853 వ సంవత్సరంలోనే కామన్సుసభలో జాన్ బ్రైట్‌గారు మాట్లాడుతూ "ఈమహజరు చాలా పెద్దది. ఇది చాలా బాగా వ్రాయబడినది. ఇందులోవున్న అంశా లన్నింటినీ రుజువు చేయగలమని చెన్నపట్నంలో వున్న దేశీయ - పెద్ద మనుష్యులు వ్రాసిన వుత్తరాలనుకూడా నేను చూశాను" అని చెప్పారు *

లక్ష్మీనరసుగారు మొదలైన దేశీయనాయకులు పార్ల మెంటువారికి పంపిన మహజరులను పార్లమెంటువారు బుట్ట దాఖలుచేసి మళ్లీ 1853 లో కుంపినీవారికి రాజ్యాధికారపు పట్టా యిచ్చారు. ఈమారు 20 సంవత్సరాల కాలపరిమితి కూడా నిర్ణయించలేదు. దేశీయుల కళ్ల నీళ్లు తుడవడానికి కొన్ని చిల్లర సంస్కరణములు చేశారు. సీమలో కుంపినీవారి

* Representative men of Southern India Life of Gazula Lakshminarsu Chetty. G. Parameswaram Pillai pp 157-81.

డైరెక్టర్ల సభలో మున్ఫైఘమంది సభ్యులను 18 కి తగ్గించారు. ఇందులో ఆరుగురిని పార్లమెంటువారే నియమిస్తారన్నారు. కలెక్టరులను పూర్వంలాగ కంపెనీ డైరెక్టర్లు తమ చిత్తాను సారంగా గాక, బహిరంగంగా పోటీపరీక్షలలో వుత్తీర్ణులైన వారినే నియమించాలని శాసించారు. అయితే ఈ పరీక్షలు సీమలోనే జరుపుతారు గనక, అభ్యర్థులు అందరూ దొరలే. ఇదివరకు ఈ దేశంలో కంపెనీవారేర్పరచిన కోర్టులన్నీ పార్లమెంటువారేర్పరచిన కోర్టులన్నీ రెండురకాల కోర్టులు వుండేవి. ఈ రెండురకాలనూ కలిపివేశారు. ఇవీ వారుచేసిన మార్పులు.

1853 వ సంవత్సరం జనవరినెలలో చెన్నపట్నం మిషనరీ పాఠశాల వార్షికోత్సవం జరిగింది. దానికి గవర్నరుగారే అధ్యక్షుడుగా వున్నాడు. ఆండర్సనుగారు చేస్తూవున్న కృషిని గురించి గవర్నరుగారు చాలా ప్రశంసించి, బైబులు గ్రంథాన్ని జాగ్రత్తగా చదవవలసినదని విద్యార్థులను హెచ్చరించారు. గవర్నరుగారే ఇలాగ క్రైస్తవమతబోధనను గురించి ప్రచారం చేస్తూవుంటే ఇంక లేనిదేమిటి? మిషనరీలకూ అధికారులకూ మళ్లీ హుషారు కలిగింది. బైబిలును పాఠ్య పుస్తకంగా ప్రవేశపెట్టాలని మళ్ళీ ప్రయత్నించారు. అయితే అప్పుడు సర్కారు పాఠశాల పరిపాలక వర్గానికి అధ్యక్షుడుగా వున్న జార్జి నార్టనుగారున్నూ, సభ్యులుగావున్న జాన్ బ్రూస్ నార్టనుగారున్నూ, లక్ష్మీనరసుగారున్నూ దీనిని గట్టిగా ప్రతిఘటించారు. మద్రాసు యూనివర్సిటీ పాఠశాల బోర్డులోని హిందూ సభ్యులలో ఒక్క మహానుభావుడుతప్ప తక్కిన

వారందరూ తమ అసమ్మతిని సూచిస్తూ రాజీనామా ఇచ్చారు. నార్టనుగారి ద్దకున్నా కూడా సానుభూతితో రాజీనామా నిచ్చారు. అంతట ప్రభుత్వంవారు చేసేదిలేక తమ ప్రయత్నాన్ని మానుకున్నారు.

క్రైస్తవ మిషనరీలు తురకల నెలాగనైనా తమ మతంలో కలుపుకోవాలని చాలా రోజులనుంచి ప్రయత్నిస్తున్నారు. ఇప్పటికి వారి కృషి ఫలించింది. 1853 వ సంవత్సరం మార్చి 27 వ తేదీన మిషనరీలు మళ్ళీ ఎనిమిదిమంది హిందువులను క్రైస్తవమతంలో కలిపారు. వీరిలో ముగ్గురు ఆడపిల్లలు. సెప్టెంబరులో ముగ్గురు హిందు యువకులనూ, ఒక ఆడపిల్లనూ, అబ్దుల్ ఖాదర్ అనే మహమ్మదీయ యువకుణ్ణీ క్రైస్తవులుగా చేశారు. దీనివల్ల వారి సంకల్పం నెరవేరింది. తురకలలో సంచలనం కలిగింది. అబ్దులు ఖాదరు 12 సంవత్సరాలనుంచి మిషనరీల బడిలో వున్నవాడేగాని, అతనిని మతంలో కలపడానికి ఇన్నాళ్ళు పట్టింది. 1854 వ సంవత్సరం జనవరి 6 వ తేదీన మిషనరీపాఠశాలయొక్క 17 వ వార్షిక పరీక్ష జరిగింది. దానికి చెన్నపట్నం ప్రభుత్వంయొక్క ప్రధాన కార్యదర్శి అయిన జె. ఎఫ్. తామసుగారు అగ్రాసనాధిపత్యం వహించి ఆండర్సనుగారు చేస్తూవున్న పనిని కొనియాడారు.

ఈ సంవత్సరం మే నెల 20 వ తేదీన అబ్దుల్ ఖాదరు భార్య 'అబ్బాసీ బీ' అనే యువతిని అతని యిష్టంమైన క్రైస్తవ మతంలో కలిపారు. దీనితో మహమ్మదీయులలో తీవ్రమైన రోషం కలిగింది. అది త్వరలోనే ప్రజ్వలించడానికి కారణం

కలిగింది. క్రైస్తవమతంలో కలిసిన మహమ్మదీయుడు అక్టోబరు 16 వ తేదీన క్రైస్తవ మతబోధ చేయడం ప్రారంభించాడు. అంతట తురకలు గుమిగూడి వుద్రేక పూరితులయ్యారు. అక్కడివారిలో ఒకరు అతనిమీద ఒకరాయి విసిరారు. ఇంకొకరు ఒక పాతచెప్పను విసిరికొట్టారు. మిషనరీలు కిక్కురు మనలేదు. అప్పుడేమైనా ఎదురుతిరిగితే పెద్ద కొట్లాట అయ్యేదే. అబ్దుల్ ఖాదరున్నూ, అబ్దుల్ అలీయున్నూ మహమ్మదీయ మతంవదలి క్రైస్తవ మతంలో కలిసినందుకే తురకలు కుములుతూ వుండగా వాళ్ళు హిందుస్తానీలో క్రైస్తవమత బోధచేసే టప్పటికి తురకలకు అతి తీవ్రమైన రోషం కలిగింది. మిషనరీల ఫిర్యాదుపైన మేజస్ట్రీటు అక్కడ దౌర్జన్యం చేసిన ముగ్గురుతురకలను శిక్షించారు. *

నాగలింగం అనే కుర్రవాణ్ణి మిషనరీలు అక్రమ నిర్బంధంలో వుంచినట్లు అతని తాత సుబ్రహ్మణ్యంగారు సుప్రీముకోర్టులో పిటిషను దాఖలుచేయగా ఆ పిల్లవాడిని ఆ మర్నాడు కోర్టులో హాజరు పరచవలసినదని 1854 వ సంవత్సరం ఆగస్టు 18 వ తేదీన ఆండర్సనుగారికి వారంటు వచ్చింది. నాగలింగం 14 సంవత్సరాలు పిల్లవాడు. ఒక లక్ష రూపాయిల ఆస్తికి వారసు. ఇతడు మిషనరీల పాఠశాలలో క్రైస్తవమతం అవలంబిస్తున్నాడని భయపడి అతనితాత వాడిని కనిపెట్టి వుండేటందుకు ఇద్దరు మనుష్యుల్ని నియోగించాడు. ఒకమాటు నలభైమందిని పంపి అతనిని బలవంతంగా తీసుకుని

* True Yoke fellows in the Mission field Life and labours of John Anderson and Robert Johnston by John Braidwood p 539.

పోవడానికి ప్రయత్నించాడు. మిషనరీలు పోలీసుకోర్టులో ఫిర్యాదు చేయగా, అందులో ఒకడికి నాలుగు నెలలవరకు శిక్షవిధించారు. మిషనరీల దగ్గరనుంచి పిల్లవాడిని తీసుకువెళ్లే దారిలేక అతనితాత సుబ్రహ్మణ్యంగారు ఇప్పుడు సుప్రీము కోర్టులో ఈ పిటీషను పెట్టాడు.

ఈ కేసులో వున్న విశేషం ఏమిటంటే, ఇదివరకల్లా క్రైస్తవ మతాభిమానంతో మైనరు పిల్లలను మిషనరీలవశం చేస్తూ తీర్మానిస్తూవుండే సుప్రీంకోర్టు న్యాయాధిపతి యైన బర్టనుగారు సెలవుమీద వెడుతున్నారని తెలిసి ఆయన వెళ్లే వరకూ వుండి, ఆయనకు బదిలీగా వచ్చిన సర్ క్రిస్టఫర్ రాలిన్సన్ అనే కొత్త న్యాయాధిపతిదగ్గర ఈ కేసు విచారణకు వచ్చేటట్లు దాఖలుచేశారు. ఈ కొత్తఆయన దగ్గర తమకు న్యాయం జరుగుతుందని హిందువుల ఆశ. కాని ఈఆశ నిరాశ అయ్యేటట్టు ఆయనకూడా హిందూధర్మశాస్త్రానికి వ్యతిరేకంగా బర్టనుగారి తీర్పునే ఖాయపరచి పిల్లవాడిని మిషనరీలకు వశంచేశాడు. దీనితో మిషనరీలకు దిగ్విజయం కలిగింది. *

1854 వ సంవత్సరం అక్టోబరు 27 వ తేదీన చెన్నపట్నం గవర్నరైన హారీసు ప్రభువు మిషనరీల పాఠశాల చూడడానికి వచ్చి, అక్కడ ఏడుగంటలకాలం కాలక్షేపంచేసి అక్కడ జరుగుతూవున్న క్రైస్తవ మత ప్రచారానికి చాలా సంతోషించాడు. ఇది క్రైస్తవ మతబోధకులకు అత్యంతమైన

* Ibid pp. 531 - 37.

ఉత్సాహం కలిగించింది. ప్రజలకు ఆశాభంగాన్ని విషాదాన్ని కలిగించిందని వేరే చెప్పాలనా ?

ఆ సంవత్సరం డిశంబరు 16 వ తేదీన మళ్ళీ ఇద్దరు యువకులను క్రైస్తవమతంలో కలిపారు. ఆ మరుసటి గురువారం మిషనరీ పాఠశాల పరీక్షలు జరిగాయి. అందులో కూడా క్రైస్తవమతాన్ని గురించిన ప్రశ్నలూ చర్చలూ జరిగాయి. అప్పుడు మళ్ళీ ప్రభుత్వ కార్యదర్శి జే. ఎఫ్. తామసుగారు, అగ్రాసనాధిపత్యం వహించి "హిందూదేశానికి మనం ఏమి చేసినా ఏమి చేయకపోయినా క్రైస్తవమత ప్రచారం చేస్తే యీ దేశానికి శాశ్వతమైన మేలుచేసిన వారమవుతాము" అని సెలవిచ్చారు. హారిసుగారు కూడా యీ ఉత్సవంలో ఒకగంటసేపు వుండి, తమ ఆదరణను ప్రకటించారు. *

1854 వ సంవత్సరం డిశంబరు 24 వ తేదీన రాజగోపాల్ అనే దేశీయ క్రైస్తవమతబోధకుడు, యిద్దరు పెద్దవాళ్ళను క్రైస్తవమతంలో కలిపాడు. దేశీయమిషనరీ చేసిన క్రైస్తవప్రచారానికి దొరలంతా సంతోషించారు. 1855 వ సంవత్సరం జనవరి 5 వ తేదీన మిషనరీపాఠశాల వార్షిక పరీక్షలు జరిగాయి. దీనికి మళ్ళీ గవర్నరైన హారీసు ప్రభువు అగ్రాసనాధిపత్యం వహించాడు. ఇక్కడ విద్యను బోధించే పద్ధతి చాలా బాగా వున్నదని ప్రశంసించారు. ఇలాగ సామాన్యఅధికారులు మొదలుకొని గవర్నరువరకూ మిషనరీల

* Ibid p. 542.

ప్రచారాన్ని ప్రోత్సహిస్తూ వుంటే, ప్రజలు తల్లడిల్లిపోయారు గాని ఏమీ చేయలేకపోయారు.

ఇంతలో మిషనరీల దురదృష్టం కొద్దీ ఆండర్సనుగారు 1855 వ సంవత్సరం మార్చి 25 వ తేదీన చనిపోయారు. ఈతని కృషికి గవర్నరు మొదలైన దొరలు ఎంత మెచ్చినదీ ఈయన అంత్యక్రియల సమయంలో ప్రకటితమైనది. గవర్నరుగారు సుస్తీగా వుండి స్వయంగా రావడానికి వీలులేక, తన గుర్రపుబండిలో తన మిలిటరీ కార్యదర్శిని పంపారు. సుప్రీముకోర్టు న్యాయాధిపతికి అస్వస్థగా నుండినది గాని, లేక పోతే స్వయంగా వచ్చేవారే. ఆయిన ఎంతో గౌరవపురస్సరంగా ఒక వుత్తరం వ్రాసి పంపారు. సదరుకోర్టుజడ్జీ అదివరకు చెంగల్పట్టుజిల్లా జడ్జీ పనిచేసిన మోర్ హెడ్ గారు, మద్రాసు షెరీఫ్ ప్రధానపోలీసు మేజస్ట్రేటు మొదలైన దొరలు ఆండర్సనుగారి శవం ఊరేగింపుతో వెళ్ళి తమకు అతనియందు గల గౌరవాన్ని ప్రదర్శించారు. *

క్రైస్తవమత ప్రచారం విషయంలో అధికారులు చూపే పక్షపాతంవల్ల ప్రజలకు కలుగుతూవుండిన బాధలు అలాగవుండగా, కుంపినీపరిపాలనలో వారికిగల ఇతర బాధలనేకాలు తీవ్రరూపం దాల్చినాయి. అందులో నేరాలను ఆచోకీ తీయడానికీ పోలీసువాళ్ళు అనుమానంపైన పట్టుకున్న వారిని నిర్బంధించి చిత్రహింసలు పెట్టడమూ, శిస్తులు వసూలుచేయడంలో బీదరైతులను రివిన్యూఅధికారులు పెట్టే చిత్రహింసలూ మితిమీరినాయి.

---

* (Ibid page 557) True Yoke Fellows.

డేన్బీసేమరు (Danby Seymour) అనే పార్లమెంటు సభ్యుడు 1852 లో హిందూదేశం చూడడానికివచ్చి, గాజుల లక్ష్మీనరుసుగారిపేరు విని వున్నవాడవడంవల్ల చెన్నపట్నంలో ఆయనకు అతిధిగా వున్నాడు. లక్ష్మీనరుసుగారున్నూ యీ దొరగారికి ఈ దేశ స్థితిగతులను కుంపినీ పరిపాలనలో ప్రజలకు కలుగుతూవున్న కష్టాలను ప్రత్యక్షంగా చూపించారు. ప్రజల పౌరసత్వ హక్కులకూ, మతాచారాలకూ అధికారులు ఎలాగ భంగం కలిగిస్తున్నారో చూపించారు. బ్రిటీషు పరిపాలనలో వున్న లోపాలనుకూడా ఆయనకు ప్రత్యక్షంగా తెలియజేశారు.

ఈ సేమరుగారు లక్ష్మీనరుసు సెట్టిగారితో కలిసి కడలూరు, కుంభకోణం, కోయంబత్తూరు మొదలైన ప్రదేశాలకుపోయి అక్కడ రైతులపైన విధింపబడుతూవున్న అత్యధిక పన్నులూ, అవి యివ్వలేనివారిని ప్రభుత్వంవారి శిస్తులు వసూలుచేసే వుద్యోగులు పెట్టే చిత్రహింసలూ స్వయంగా చూశారు. శిస్తులు యివ్వలేని రైతులను మండిపోతూవున్న ఎండలో వీపుపైన పెద్దబండలుపెట్టి వంగోబెట్టి యుంచడమూ, చేతివేళ్లపైన శీలలు తిప్పడమూ, తలను పాదములవేళ్లకు అంటేటట్టుగా వంచి కొయ్యకుగాని, చెట్టుకుగాని విరిచి కట్టడమూ మొదలైన చిత్రహింసలను చేస్తూవుండడమూ ఇదంతా తాశీల్దారున్నూ, మేజస్ట్రేటు దొరగారున్నూ కచ్చేరీ చేస్తూవున్న ప్రదేశానికి ఎట్ట ఎదురుగా జరుగుతూ వుండడమూ, గోలపెడుతూ ఉన్న ఈ నిర్భాగ్యులవైపునకు వారు చూడనైనా చూడకపోవడమూ, ఈ సేమరుగారు స్వయంగా

చూసి ఆశ్చర్యపడ్డారు. దీనినినంతా జాగ్రత్తగా గమనించి, ఈ చిత్రహింసలలో నుపయోగించే బొండలు, "కెట్టికోలు", చిరతలు, శిలలు కొన్ని చేతపుచ్చుకొని వీరు సీమకు వెళ్లారు.

ఈ కుంపినీ పరిపాలనలో నేరములు బయటికి తీయడానికీ, శిస్తులు వసూలుచేయటానికీ అధికారులు చిత్రహింసలు పెడుతూ వున్నారనే సంగతినిగురించి లక్ష్మీనరస్సుగారు మొదలైనవారు చేసిన ఫిర్యాదులపైన 1854 వ సంవత్సరం జూలై నెలలో పార్లమెంటులో కామన్సుసభవారి ఎదుట ఒక చర్చ జరిగింది. హిందూదేశంలో యిలాంటి హింసలుజరుగుతూ వున్నాయంటే, పార్లమెంటువారు నమ్మలేకపోయారు. అంతట తాను స్వయంగా యీ చిత్రహింసలు జరగడం చూశానని సేమరుగారు తాను తెచ్చిన పరికరాలను చూపించేటప్పటికి సభ్యులందరూ ఆశ్చర్యపడ్డారు. అప్పుడు ఇండియాబోర్డుకు అధ్యక్షుడుగా ఉన్న సర్ ఛార్లెస్ వుడ్డుగారు దీనినిగురించి విచారణచేయిస్తానని అన్నారు. ఆ ప్రకారం ఆ సంవత్సరం సెప్టెంబరు నెలలో ఒక విచారణసంఘాన్ని నియమించారు. ఆ ఉపసంఘంవారు చెన్నపట్నంలో సాక్ష్యము విచారించి హింసలు జరుగుతూవున్నమాట నిజమేనని నిర్ణయిస్తూ 1855 వ సంవత్సరం ఏప్రిలు నెలలో కేంద్రప్రభుత్వంవారికి తమ సాక్ష్యాన్ని నివేదికను సమర్పించారు. § ఈ విచారణ

---

§ శిస్తుల వసూళ్లలోను, నేరములను ఆచోకీతీయుటలోను పైన చెప్పిన హింసలనేగాక అన్నము తిననివ్వక, నీరు త్రాగనివ్వక, దేహబాధ తీర్చుకొననివ్వక నిర్బంధించుట, మనుష్యుని వంగియుండునట్లు కట్టివేయుట, మోకాలి మడతలలో రాళ్లుపెట్టి నొక్కుట, కొరడాలతో కొట్టుట, వంగియుండబెట్టి ఒక మాలవానినో, పాకీవానినో వీపుమీద కూర్చుండబెట్టుట,

సంఘానికి మద్రాసు టార్చర్ కమిషను లేక హింసల విచారణ సంఘ మని పేరువచ్చింది ఈలోపుగా లక్ష్మీనరసు సెట్టిగారు కూడా చాలామందిచేత సంతకాలుచేయించి, యీ అన్యాయాలనుగురించి ఒక పెద్దమహాజరును తయారుచేసి పార్లమెంటులో దాఖలు చేయవలసిందని సీమకు పంపారు. దానిని ఆల్బిమెరల్ (Albemarle) ప్రభువు 1856 వ సంవత్సరం ఏప్రెల్ 14 వ తేదీన ప్రభువులసభలో దాఖలుచేశాడు. హిందూదేశములో నేరములను ఆచోకితీయుటలోనూ, శిస్తులు వసూలుచేయుటలోనూ అధికారులు ప్రజలను చిత్రహింసలు చేయడాన్ని గురించి ఆ సభవారు అతితీవ్రంగా ఖండించారు. లక్ష్మీనరసుగారి కృషివల్ల ఈ అన్యాయం తొలగింది. *

1853 లో కంపెనీవారికి మళ్ళీరాజ్యాధికారపు పట్టా యివ్వబడినప్పటినుండీ లక్ష్మీనరసుగారికి కష్టాలు యెక్కువ అయినాయి. అధికారులూ, మిషనరీలూ ఈయనపైన పగపట్టారు. పోలీసులను వెంటాడించారు. ప్రతికార్యంలోనూ ఈయనకు ఆటంకాలు కలిగించడానికి ప్రయత్నించారు. వీరి చర్యలవల్లనూ, ఈయన రాజకీయాందోళనలో మునిగివున్నందువల్లనూ వ్యాపారానికి నష్టం కలిగింది. ప్రజాసంఘాన్ని నడపడమూ, క్రెసెంటు పత్రికను నిర్వహించడమూ,

---

మొదలో ఎముకలను, అసహ్యపదార్థములను దండలుగా వేసి, గాడిదతోకకు వాని జుట్టుకట్టి త్రిప్పుట మొదలైన చిత్రవిచిత్రములైన ఘోరకృత్యములు చేయుచుండినట్లు ఆ విచారణవలన బయల్పడినవి.

* Representative men of Southern India. By G. Parameswaran Pillai. pp. 153-155.

నివేదికలను ప్రకటించడమూ మహాజరులను సీమకు పంపడమూ అమిత ధనవ్యయానికి కారణా లయినాయి. ఎన్ని చిక్కులు వచ్చినా, లక్ష్మీనరసుగారు తమ పట్టుదల వదలలేదు.

జాన్ బ్రూస్ నార్టను అనే దొరగారు 1843 మొదలు 1872 వరకూ చెన్నపట్నంలో కుంపినీవారి సదరుకోర్టులోనూ, పార్లమెంటువారు ఏర్పరచిన సుప్రీముకోర్టులోనూ కొన్నాళ్లు బారిస్టరుగా ప్రాక్టీసుచేసి, తరవాత గవర్నమెంటువకీలు గానూ, అడ్వకేటుజనరలుగానూ పనిచేసి పేరుపొందినవాడు. జార్జి నార్టనుగారివలెనే ఈయనకూడా మన దేశీయుల పట్ల కొంతసానుభూతి కలిగి ప్రజలలో ఇంగ్లీషువిద్యాభి వృద్ధి చేయడానికి చాలా పాటుపడ్డాడు. గవర్నమెంటువారు స్థాపించిన మద్రాసు యూనివర్సిటీ బోర్డులో సభ్యుడుగావుండి, అధికారులూ, మిషనరీలూ ఏకమై బైబిలును ఒక పాఠ్యపుస్త కంగా ప్రవేశపెట్టడానికి ప్రయత్నించినప్పుడు ప్రతిఘటించి 1853 లో తన పదవికి రాజీనామా యిచ్చాడు.

జార్జి నార్టనుగారు 1853 లో సీమకు వెళ్లిపోగా, ఆయన స్థానంలో ఈయన పచ్చయ్యప్పగారి ధర్మాలకు ఒక "పేట్రను"గావుండి ధర్మకర్తలకు సలహాలనిచ్చి సహాయంచేస్తూ 27 సంవత్సరాలు ప్రతివార్షికోత్సవంలోనూ ఉపన్యసిస్తూ దాని అభివృద్ధికి తోడ్పడ్డాడు. తిరువాంకూరు మహారాజు రామవర్మ, సర్ టి. మాధవరావు మొదలైన దేశీయులకు స్నేహితుడుగా వుండినాడు. గాజుల లక్ష్మీనరసు సెట్టిగారి త్యాగబుద్ధికీ, దేశాభిమానానికీ మెచ్చి ఆయనకు స్నేహితు డైనాడు.

కుంపినీవారి కోర్టులో న్యాయాధిపతులు కుంపినీవారి తాబేదారు లైనందువల్ల ప్రభుత్వానికీ, ప్రజలకూవచ్చే తగాదాలలో నిష్పక్షపాతంగావుండ లేకపోవడమూ, వారికి దేశ భాషలు రానందువల్లనూ, క్రిందియుద్యోగులు లంచగొండులై నందువల్లనూ వ్యాజ్యాలు పరిష్కరించడంలో చాలా ఆలస్యం జరిగి మితిలేని ఖర్చులకు కారణమై న్యాయందొరకక బీదవారు బాధపడుతూ వుండడమూ మొదలైన లోపాలనుగురించి నార్టనుగారు 1852 లో ఒక చిన్నపుస్తకమును ప్రకటించి దానిని సీమలో బాగా ప్రచారంచేసినందువల్ల దాని ఫలితంగా న్యాయపరిపాలనాశాఖలో కొన్ని సంస్కరణలు జరిగినాయి.

"చెన్నరాజధాని స్థితిగతులు, దాని ఆవశ్యకతలు" (Condition and Requirements of Madras)అనే పేరుతో కుంపినీ పరిపాలనలోగల లోటుపాటులు, అందువల్ల ప్రజలకు కలుగుతూవున్న కష్టాలను నిష్పక్షపాతంగానూ, నిర్భయం గానూ వర్ణించి దేశస్థితిని, ప్రజల స్థితిగతులను లెక్కలతోనూ, ప్రత్యక్ష ప్రమాణాలతోనూ, వివరాలతోనూ 330 పుటల నివేదికను తయారుచేసి, ఈ కుంపినీ పరిపాలనను వెంటనే రద్దుచేసి పార్లమెంటు అధికారంకింద ఒక మంత్రికి బాధ్యతగల పరిపాలనావిధానం స్థాపించవలసినదనిన్నీ కోరుతూ 1854 వ సంవత్సరం ఫిబ్రవరి 1 వ తేదీన నార్టనుగారు కుంపినీవారి పైన పార్లమెంటువా రేర్పరచిన బోర్డు ఆఫ్ కంట్రోలు అనే ఉపసంఘంవారి కార్యదర్శికి ఆ నివేదికను పంపించారు. అదివరకు చెన్నపట్నంలో నేటివు అసోసియేషన్ వారు పార్లమెంటుకు పంపిన మహాజరులోని విషయాల నన్నింటినీ వీరు

సహేతుకంగా ఆ నివేదికలో సమర్థించారు. దీనిని లక్ష్మీ నర్సుగారు అచ్చువేయించి, పార్లమెంటు మెంబర్లకు అంద జేశారు.§

చెన్నపట్నంలో "ఎతేనియం" అనే పత్రికాధిపతికి నార్టనుగారు ముఖ్య స్నేహితుడుగా వుండి, ఆ పత్రికను నడప డంలో సహాయం చేసేవాడు. చాలా విషయాలలో దేశీయుల పక్షంగా వాదించి వ్రాస్తూ వుండేవాడు.

హిందూదేశములో జరుగుతూవున్న అన్యాయాలను గురించి పార్లమెంటువారికి నివేదించవలసినదనికోరుచు జాన్ బ్రైటుగారికిన్నీ, ఇంకా యితరులకున్నూ లక్ష్మీనర్సుగారు ఈ దేశస్థితిగతులను గురించి ఉత్తరాలు వ్రాయించారు. ఈ దేశ పరిపాలనను మళ్ళీ కుంపినీవారివశం చేసినందువల్ల కలిగిన అనర్థకాల నన్నింటినీ వివరించి హిందూదేశంలోని రాజ్యాన్ని కుంపినీవారి చేతులలోనుండి తప్పించి ఇంగ్లాండు రాజ మకుటంకిందికి వెంటనే తీసుకోవలసినదని కోరుతూ 1855 లో మళ్లీ ఒక గొప్ప మహాజరును లక్ష్మీనర్సుగారు తయారు చేయించి దానిలో 14 వేల మందిచేత సంతకాలు చేయించి సీమకు పంపారు. అల్బిమెరల్ ప్రభువు (Earl of Albamarle) దానిని 1855 వ సంవత్సరం జూలై 16 వ తేదీన ప్రభువుల సభలో దాఖలుచేశారు. ఇలాగ తీర్మానాలుచేసి మహాజరులు, నివేదికలు తయారుచేసి పంపడానికైన ఖర్చుల నన్నింటినీ లక్ష్మీనర్సుగారే పెట్టుకున్నారు. ఆయన తన సర్వస్వము

---

§ The Condition and Requirements of the Madras Presidency. John Bruce Norton. (1854)

ధారవోసి శాంతియుతమైన పద్ధతులతో రాజకీయ ఆందోళన చేస్తూ ఎంత కష్టపడినా కుంపినీవారి దుష్పరిపాలన తొలగ లేదు. 1857 లో విప్లవం కలిగేవరకూ ఏమీలాభం లేక పోయింది. లక్ష్మీనర్సుగారు 1868 లో దివంగతులయ్యేవరకూ ప్రజాసేవ చేస్తూనే వున్నారు. *

* Life of Gazula Lakshminarsu Chetty Representative men of Southern India. G. Parameswaran Pillai. pp. 158—165.

# ఆంగ్లేయుల ప్రవర్తన

"భారతదేశమునకు మొదట వచ్చిన ఆంగ్లేయులు తమ జీవితవిధానమునందు ఎట్టి హద్దుపద్దులుగాని, నీతి నియమములుగాని లేక ప్రవర్తించిరి. వీరు నాస్తికులవలె, చార్వాకులవలె వర్తించిరి. వీరిమతము కేవలము ఇతరులపైన పగసాధించు క్రూరమతముగ, ధనాశాపరుల మతముగ, అక్రమలాభములను పొందువారి మతముగ తోచునట్లు జీవించుచుండిరి. ఈ మనుష్యుల ఇంద్రియసుఖాపేక్షకు హద్దులేదు. వీరిమాటలు అపభ్రంశములైనవిగ నుండెను. వీరి కృత్యములు అపవిత్రములుగ నుండెను. వీరిమతము కేవలము అహంకారమునకు, స్త్రీలోలత్వమునకు, ఐహిక వాంఛలను అనుభవించుటకు ఏర్పడిన మతముగా హిందువులకు తోచుచునుండెను" అని కాంబెల్‌గారు "బ్రిటిష్ ఇండియా" అను పుస్తకమున వ్రాసిరి. (చూడు పుటలు 166.168). తరువాత వచ్చిన ఉద్యోగులను గురించి 1793–1834 మధ్య కలకత్తా దగ్గర శ్రీరామపురమున నుండిన కారీ అను మిషనరీయొక్క జీవిత చరిత్ర యందిట్లు వ్రాసిరి. "వీరిలో ఇంద్రియలోలత్వము అరిషడ్వర్గములు విజృంభించుటకు ఎట్టి ఆటంకమును లేకుండెను. వీరికి నీతినిబోధించు మతాచార్యులు దేశమునందా నాటికి లేరు. వీరు ఆదివారమునాడైన ఈశ్వరుని తలుపరు. సాంఘిక

వ్యవస్థ కాధారభూతమైన శీలమును, స్త్రీల మానమునుగూడ వీరు మన్నింపరు. ముండల నుంచుకొనుటయు, దానివలన కలుగు అధర్మసంతానమును సర్వసామాన్య మయ్యెను. వీరి చర్యలు క్రైస్తవమతమునకు విరుద్ధములుగ నుండెను. వీరి దేహములుగాని, ఆత్మలుగాని పరిశుద్ధముగ లేకుండెను. తాము చేసిన పాపములకుగల శిక్షలు కనబడునేమోయను భయమున వీరు బైబిలును చదువుటగూడ మానుకొనిరి. ఈ స్థితినుండి దగ్గర మెట్టుగానున్న స్థితికి అనగా బైబిలు చెప్పు మాటలు నిజమై యుండవని తలచు నాస్తికవాదములోనికి దిగుచుండిరి" (కారీగారి జీవితము పుట. 352).

హిందూదేశములో నీతినియమములు లేక చరించు వారు తమ చర్యలనుజూచి హిందువు లేమనుకొందురోయని గాని, వారు తమనుజూచి అసహ్యించుకొని నీచముగ జూతురని గాని జంకుగొంకలైన లేకుండ సిగ్గుభిడియములు విడిచి యున్నారు. అని లండన్ క్వార్టర్లీలో 1857 లో నొకరు వ్రాసిరి. లువార్డు (Mr. Luard) అను బొంబాయి సివిలు ఉద్యోగి యిట్లు వ్రాసినాడు :—

"భారతదేశమున మన మర్యాదను, గౌరవమును కూల ద్రోసినది పందికొవ్వు, గొడ్డుకొవ్వు పూసిన తోటాలుకావు, స్వదేశ సంస్థానములను ఆక్రమించుటయుగాదు, ప్రజలను క్రైస్తవమతమున గలుపుకొనుటయుగాదు. ఆ దేశమున చిరకాలమునుండి, మనవారు చేయుచున్న నీతిలేని అక్రమ చర్యలు, బాధ్యతలేని నిరంకుశమైన దుష్పరిపాలనము. నేనా దేశమున చూచినన్ని అన్యాయపుహత్యలు, న్యాయస్థాపనము

పేరున జరుగు దోపిడులు, బుద్ధిపూర్వకముగా జరుగు లంచ గొండితనము నితరులుకూడా జూచియున్నచో, నీ భారతీయు లట్లు తిరుగబడుటలో నాశ్చర్యము లేదని గ్రహింతురు," అనినాడు.

సూరతుజిల్లా జడ్జిపనిచేసిన సదర్లాండుగారు, 1836 సంవత్సరం సెప్టెంబరులో నొకలేఖ వ్రాయుచు "ఆంగ్లేయు లీదేశమున ఘోరమైన దుర్మార్గములు, అవినీతికరమైన కృత్యములు తమ యధికారబలమును బట్టి చేయుచున్నారు. ఈ ప్రదేశములో కొందరు దుర్మార్గులుచేరి నిర్భయముగను, బహిరంగముగను ధర్మపరిపాలనమును నిష్ప్రయోజనముచేసి, ప్రజల నీతికిని, ఆస్తిహక్కులకు భంగము కలిగించుచున్నారు" అనిరి. సదర్లాండుగారు దీనినిగూర్చి చర్యతీసుకొనకపూర్వమే ఆయన నిక్కడనుండి బదిలీచేసి, ఒక లంచగొండియగు న్యాయాధిపతిని అక్కడకు బంపిరని ఆయనయే వ్రాసినారు. "1843 లో నన్ను సూరతు జడ్జిగను, మేజస్ట్రేటుగను నియ మించినప్పుడు అక్కడి పరిస్థితులు మరింత యధోగతి నుండు టను జూచితిని. బలహీనులు నసహాయులునగు వారిని పోలీసు వారు బహిరంగముగనే కొల్లగొనుచుండుటయు, ఐరోపాజాతి ఉద్యోగులు దీనిలో పాలుపంచుకొనుటయును నేను స్వయ ముగా జూచితిని. తమ అధికారములను పురస్కరించుకొని ఇట్లీమోసములను, దోపిడిని చేయుచున్నారని కొందరధికారు లను నేను బహిరంగంగా నిందించితినను కారణమున "నన్ను పనిలోనుండి తీసివేసిరి"అని వ్రాసినాడు. (చూడు. బి.డబ్లియు. నోయిల్ గారి ఇంగ్లాండ్ అండ్ ఇండియా పుటలు 18-22)

"భారతదేశమున అబద్ధములాడు దుర్మార్గుడుకూడ మన ఆంగ్లేయులలో గొప్పవారితో సమానమైనగౌరవమును పొందు చుండును. నీతిలేనివాడు, స్త్రీలను చెరచినవాడు, జూదరి, మోసగాడు, లంచగొండి, దుర్మార్గుడును సంఘమున మంచి గౌరవము, మర్యాదయుగలవారితో సరిసమానముగా తల యెత్తుకొని తిరుగ గలుగుచున్నారు. లంచములిచ్చి పనులు చేయించుటకు, ప్రభుత్వ ధనము నపహరించుటకు, అబద్ధము లాడుటకు మన ఆంగ్లేయ నాయకులు వెనుదీయుట లేదు. తమ చేతులలో అధికారము గలవారెల్లరు దానిని దుర్విని యోగము చేయుచున్నారు. ఇట్లు చేయుటవలన తమ్మెవ్వరు నేమియు జేయలేరను ధైర్యము వీరికిగలదు" అని 1852 వ సంవత్సరము ఫిబ్రవరి 23 వ తేదీన బొంబాయి టైమ్సు పత్రిక కూడా ఇది నిజమేననియు, గొప్ప యుద్యోగులందు, అధికారులందును నీ దుర్బుద్ధులు, దుర్మార్గము, లంచగొండి తనము, అవినీతి వర్తనము గలవని వ్రాసినది (చూడు. ఇంగ్లాండ్ అండ్ ఇండియా పుట 15). ఈవివిధ గ్రంథకర్తలు, పత్రికలు, వ్రాసినసంగతులనుబట్టి ఈ యన్యాయములుచేయు ఆంగ్లేయజనుల క్రైస్తవ మతమునుగూర్చి హిందువులతి నీచ మైన యభిప్రాయములు కలిగియుండుటలో నాశ్చర్యము లేదనియు, క్రైస్తవులని తా మనుకొనువారు జూదములాడుట, చీటికి మాటికి దేవుని పేరుతో ఒట్లుబెట్టుకొనుట, త్రాగుట, తప్పత్రాగి వీధులలో దొరలుచుండుట, అప్పులలో మునిగి యుండుట, నీతినియమములు లేక ప్రవర్తించుట, అసభ్యము లైన బూతులుమాటలాడుట, ఆదివారము నాడైన దేవు

నారాధింపక పోవుట తా మెరిగినంతవరకు నీతిలేని నాస్తికు లుగా నుండుటను జూచుచున్నాను. అందువలన తమ శీలమువలన, సత్ప్రవర్తనవలన హిందువులకు ఆదర్శప్రాయులై క్రైస్తవమతమునకు వన్నె తెచ్చుటకు బదులుగా దానిని అధోగతిలో ముంచుచున్నారు" అని బి. డబ్లియు. నోయిల్ గారు 1859 లో ప్రకటించిన ఇంగ్లాండ్ అండ్ ఇండియా అను గ్రంధమున 211, 215 పుటలలో వ్రాసియున్నారు.

ఉత్తర హిందూస్థానమున జిల్లాజడ్జిచేసిన గౌరవనీయులైన జాన్ ఫ్రెడరిక్ షోర్ అనుదొరగారు ఇండియా గెజెట్ అను పత్రికకు 1832 వ సంవత్సరము మొదలు 1835 వరకు భారతదేశ స్థితిగతులనుగూర్చి వ్రాసిన లేఖలన్నియు "నోట్సు ఆన్ ఇండియన్ ఎఫెయిర్సు" అను పేరుతో 1838 లో రెండు సంపుటములుగా ప్రకటింపబడి యున్నవి. దీనిలో 1832 వ సంవత్సరము మార్చి 16వ తేదీన వ్రాసిన లేఖలో భారతీయుల పట్ల ఆంగ్లేయు లెట్లు ప్రవర్తించుచుండిరో చక్కగా వర్ణించి యున్నారు. "ఆంగ్లేయులలో చాలమంది "నేటీవు" భారత దేశీయులపట్ల చాల పొగరుబోతుతనముతోను, అహంకార భావముతోను, స్వాతిశయముతోను, తృణీకారభావముతోను ప్రవర్తించుచున్నారు...

"ఈ నల్లవానిని తన్నిన బాగుండునని యనేకు లను చుండగా నేను వినియున్నాను."

"భారతీయులు సలాముచేసినప్పు డాంగ్లేయుడు మరల సలాముచేయడు. నేటివులతో మర్యాదగ మాటనైన నాడడు. ఒక నౌకరేపైన చిన్న తప్పిదమొనరించినచో వానిని సాధా

రణముగా కొట్టును; లేదా నోటవచింపరాని బూతులుతిట్టును. బట్లర్లను, నౌకరులను, గుమాస్తాలనుగూడ ఇట్లే బూతులు తిట్టుచుందురు. సాధారణముగా నౌకరులను కొట్టి, జీత మివ్వక గెంటివేయుచుందురు."

"ఈ యాంగ్లేయుల చర్య లోకొక్కకప్పు డతినీచముగా నుండును".

"పూర్వము భారతీయు లొక ఆంగ్లేయుని చూచినప్పుడు సలాము చేయకుండాపోవరు గాని ఈ ఆంగ్లేయులు వీరి సలాము లను స్వీకరించి ప్రతిసలామును చేయకపోవుట చూచి, ఈ మర్యాదలు చేయుట క్రమక్రమముగా మానివేయుచున్నారు" అని షోరుగారు 1832 ఆగస్టు 25 వ తేదీన వ్రాసిరి. ఆయన యింక నీ క్రిందిసంగతులు వ్రాసిరి.

"ఈ రోజులలో నొక యాంగ్లేయుడు భారతీయుని సామాన్యమర్యాదతో జూచిననుగూడ, నదియొక ఆశ్చర్య కరమైన సంగతిగా పరిగణింపబడుచున్నది. ఇది యింత కఱవై యుండుటవలన నీ యాంగ్లేయునిగూర్చి పెక్కుమైళ్ళ దూరమున గూడ మంచిగా చెప్పుకొందురు."

"ఆంగ్లేయులు చాలా సంవత్సరములనుండి యిట్టి విపరీతప్రవర్తనలో దిగియున్నందున నేటివులుగూడ వీరియందు వినయవిధేయతలుచూపుట మాని, వీరిని జూచి అసహ్యించు కొనుట ప్రారంభించినారు.

"ఒక యాంగ్లేయుడు వేటకుబోవుచు, తాను పోవు దారిలో తాను ముక్కుమొగమెరుగని ఒక భారతీయునిదగ్గర నొక ఏనుగును ఎరువు పుచ్చుకొనును. తరువాత నీ భార

తీయుడీ యాంగ్లేయు డుద్యోగముచేయు పట్టణమునకు వచ్చినప్పు డితడాయనను దర్శింపబోగా నీ యాంగ్లేయు డతని పట్ల చూపు అగౌరవము పైన చెప్పిన విధముగా నుండును.”

“భారతీయులేమనుకొందురోయని యే యాంగ్లేయుడును జంకడు. అతడు బుద్ధిపూర్వకముగనే భారతీయుల నవమానించును. వారిపట్ల అన్యాయము చేయును. ఈ తలవంపులనెల్ల వారెట్లు సహించుచున్నారా యనునది ఆశ్చర్యమైన సంగతి. ఒక మశీదులోనికి గాని, హిందూదేవాలయములోనికి గాని ఆంగ్లేయుడు తన జోడుతీయకుండా పోవుట సర్వసామాన్యముగ జరుగుచుండును. అక్కడనుండు పూజారిగాని, ముతావలీగాని ఏమైన ననినచో, వీడు వారిని తిట్టుట, కొట్టుటయు గూడ సర్వసామాన్యముగనే జరుగుచుండును. పరదేశీయులు పవిత్రముగ నెంచు స్థలములలోనికి బోవునప్పుడు సర్వమానవులును తమకు సములేయని ప్రగల్భములు పలుకు ఆంగ్లేయులు మర్యాదకొరకు తమ జోడుతీసి లోనికిబోయిన నెంత బాగుండును!

చాల ప్రదేశములందు ఒక గుంటలోనో లేదా యొక యేటిలో నొకభాగముననో గల చేపలను పవిత్రముగా నెంచి బ్రాహ్మణులు వానికాహార మిడుచుందురు. ఈ ప్రదేశముల ప్రక్కనుండి పోవు పెద్దమనుష్యులగు ఆంగ్లేయు లిక్కడ చేపలు పుష్కలముగ నుండుట చూచి వానిని గాలములువేసి పట్టుచు వినోదింతురు. అక్కడి బ్రాహ్మణులు వలదని మొరపెట్టినచో వారిని దూషించి, కొట్టి, దౌర్జన్యము చేయుదురు. పెద్దమనుష్యులగు నాంగ్లేయులు డప్పులువేయు తమ పరివారముతో

కలసి నీటిపక్షులను వేటాడుటకువచ్చి, పొలములలో పచ్చగా పండికోతకు సిద్ధమైన వరిపైరును త్రొక్కి పాడుచేసి రైతులకు చాలనష్టము కలిగింతురు. ఇట్లు త్రొక్కగా రాలి మంటగలిసిన గింజల నొక్కొక్కదానినే ఏరలేక బాధపడుచుండిన బీద రైతుల దురవస్థను నేను స్వయముగా చూచియున్నాను."

"తాము దేశములోపల ప్రయాణముచేయు నప్పుడు పల్లకీబోయీలు, సామానుమోయు కూలివారు దొరుకుట లేదనియు, ప్రజలు సాయముచేయరనియు కొంద రాంగ్లేయులు పలుకుచుందురు. పూర్వ మిట్టి యిబ్బంది యెన్నడును లేక ఇప్పు డిది యెందుకు తటస్థించుచున్నది? ఈ బోయీలను, కూలివాండ్రను నియోగించు దొరలు వీరికి సరిగా కూలి యివ్వకుండుటయు, వీరిని నానాబాధలు పెట్టుటయు దీనికి కారణమని నేటివులు చెప్పుచున్నారు. ఇది నిజమే"యని షోరు గారు తమ యభిప్రాయము వెల్లడించిరి.

భారతీయుల భావములందు మార్పుకలిగి, ఆంగ్లేయుల పట్ల వీరుచూపు మర్యాదలందునుమార్పులు గానవచ్చుచున్న వని షోరుగారు 1832 అక్టోబరు 10 వ తేదీన వ్రాసిన లేఖలో నుదాహరించిరి.

"ఆంగ్లేయులుతమజాత్యంహంకారగర్వములనుపురస్క రించుకొని, భారతీయుల నవమానించుటవలన వారి కాంగ్లే యులను జూచిన రోత కలిగి, వారియందు అసహ్యాభావము నానాటికీ వృద్ధియగుచున్నది.

తక్కువజాతి మాలమాదిగలను నౌకరులుగ పెట్టు కొనుట, తాము భోజనముచేయుచు అపరిశుభ్రములైన

బూట్సుకాళ్ళను బల్లపైన పెట్టుకొను దురాచారము, హిందువులు, మహమ్మదీయులు తమతో మాట్లాడుచున్నప్పుడు కూడా తమ భోజనపుబల్లపైన వారికి రోతకలిగించు గొడ్డు మాంసము పందిమాంసము వడ్డనచేయించుట మొదలగు కార్యములు నేటివుల కసహ్యము కలిగించుచుండెను.

భారతీయుల సమక్షమున సామాన్యమైన మర్యాదను గూడ పాటింపకపోవుటయు, నీచమైన హిందూస్థానీ భాషను మాట్లాడుటయు పరిపాటియైపోయినది.

ప్రారంభదశలో మహమ్మదీయులకు పాశ్చాత్యులతో భుజించుట కభ్యంతరము లేకుండెను. గాని, క్రమక్రమముగా ముప్పదేండ్లలోనే వారీ యాంగ్లేయులతో విందు లారగించు టకు నిరాకరించిరి. దీనికి కారణము వా రేమనుకొందురో యను జంకుగొంకులు లేక, దొరలు (పై విధముగా) ప్రవర్తించుటయే.

హిందువులైనను, మహమ్మదీయులైనను నేటివు లందరకు నాంగ్లేయులపట్ల గౌరవము తగ్గిపోవుటకుగల ముఖ్యమైన ఇతర కారణములలో నొకటి యాంగ్లేయులు తమ స్వంత మత ధర్మములనుగూడ పాటింపకపోవుట.

ఈ యాంగ్లేయు లీదేశమున స్థిర పరిపాలన మేర్పరచు కొన్న పిదప తమ కేమతమును లేనట్లుగనే వీరు స్వేచ్ఛావిహారులై ప్రవర్తించిరి. "ఈ యాంగ్లేయ నవాబు" లీదేశమున నిట్లు నాస్తికులై ఇంగ్లాండుకు వచ్చినతరువాతనైన తమ ప్రవర్తన మార్చుకొన లేకుండిరి. వీరు భారతదేశమునకు బోవునప్పుడు తమ మతమును దారిలో దక్షిణాఫ్రికా అగ్ర

మున విడిచి మరల భారతదేశమున తమ యుద్యోగాంతమున నింటికి బోవునప్పుడు దానిని తెచ్చుకొనుట మరచుచుండిరని వీరిని గూర్చిన యొక పరిహాస వాక్య మింగ్లాండులో చెప్పుట పరిపాటియైనది." *

ఆంగ్లేయు లీదేశమున ఉంపుడుకత్తెల నుంచుకొను చుండిరి. వీరీ స్త్రీల వలలలో జిక్కి, తమ స్వంత వ్యవహారము లందును, ఉద్యోగ నిర్వహణమునందును గూడ వీరి మాట చెల్లుచుండినందుకు నిదర్శనములు కలవు. వీ రుంచుకొనిన స్త్రీలలో చాలమంది సామాన్య వారవనితలేయని షోరుగారు రెండవ సంపుటము 503 వ పుటలో ఫుట్ నోటులో వ్రాసి యున్నారు.

'తమను దర్శించిన భారతీయులపట్ల ఆంగ్లేయులెట్లు ప్రవర్తింపవలె ననునది యొకగొప్ప సమస్యగా నుండెను. వారికి కుర్చీ యివ్వవలెనా? ఈ ఘనుడగు వంగరాష్ట్రీయో ద్యోగి సమక్షమున నీ భారతీయులు అసలు కూర్చుండ వచ్చునా? అను సమస్య చాలమందికి పరిష్కరించుటకు కష్టమైన సమస్యగా నుండెను. చూడవచ్చిన భారతీయులతో ఆంగ్లేయులు చాలా శివితో ముభావముగా సంభాషింతురు.

క్రొత్తగా వచ్చిన ఆంగ్లేయోద్యోగి యొకడు తాను పోవుదారిలో కనబడివా రెల్లరు తనకు సలాము చేయవలె నను వింతభావముతో వర్తించుట నే నెరుగుదును. గుఱ్ఱము పైనగాని, బండిపైనగాని పోవు నేటివులు దిగి తనకు సలాము

---

* Notes on Indian Affairs. Vol. II F. J. Shore (1838) P. 456.

చేసి మర్యాద చేయవలెనని, పట్టుదలతోనుండి అట్లు చేయని వారిని దండించిన మేజస్ట్రేటును నే నెరుగుదును." §

"ఆంగ్లేయు లింత గర్వపోతులై యుండినను, ధనముగల నేటివులవలన తమకేమైన లాభముకలుగునని తోచినప్పుడు మాత్రము వారిదగ్గర నక్క వినయములు చూపుచు నీచముగా ప్రవర్తించుచుందురు." †

పూర్వకాలమున ఇంగ్లాండునుండి భారతదేశమునకు వచ్చుట కారునెలలు, ఒక సంవత్సరముకూడ పట్టుచుండినందున, ఇక్కడకు వచ్చిన ఇంగ్లీషు ఉద్యోగులు తమ ఉద్యోగకాలము పూర్తియగువరకు మరల తమ దేశమునకు పోకుండ నిక్కడనే యుండినందున, నిది తమ రెండవ జన్మభూమిగా నెంచి, ఈ దేశ ప్రజలపట్ల కొందరైన కొంత సానుభూతి కలిగియుండిరి. వారికి ప్రొద్దుపోవుట కొరకే యైనను దేశీయులతో కొంత స్నేహము చేయుచుండిరి. తరువాత రాకపోకలు సులభమై తమభార్యలను తెచ్చుకొని ఇక్కడ వేరింటికాపురము లుండుట ప్రారంభముకాగా, వీరు భారతీయులతో సాంగత్యము చేయుటమాని "ఈ నేటివుల"తో మాట్లాడుటయే పరువు తక్కువగా నెంచసాగిరి. నలుగురింగ్లీషు స్త్రీ పురుషులు చేరినచోట నల్లవారని "నీగ్రోల"ని నిందించుచు, నీచముగా చూచుటయు వారిని దూషించుటయు నొక అలవాటైనది. ఎవ్వడో యొక మహానుభావుడైన ఆంగ్లేయ ఉద్యోగి భారతీయులను దయతో జూచుచున్నను,

§ Ibid Vol. II పుట 10.

† Ibid Vol. II పుట 522.

సర్వసామాన్యముగా నింగ్లీషు అధికారు లెల్లరును వీరిని నీచముగనే జూచుచు వీరిపట్ల క్రూరముగా ప్రవర్తించు చుండిరి. భారతీయులలో కొందరు విద్యాభివృద్ధికలిగి, వా రాంగ్లేయులతో సమానమైన హక్కులు, గౌరవములు కోర సాగినకొలదియు, వీరియందు జాతీయ చైతన్యముకలిగి స్వధర్మ రక్షణకొరకు, రాజ్యాంగ సంస్కరణములకొరకు సంఘములు స్థాపించి, సభలుచేసి, మహాజరులంపి తమకు జరుగు అన్యాయ ములనుగూర్చి పైవారికి చెప్పుకొనుట హెచ్చైనకొలదియు ఆంగ్లేయులకు వీరిపట్ల ద్వేషము హెచ్చసాగెను. ఈ సంగతిని భారతదేశమునకు 1867 లో కలెక్టరుగావచ్చి చాలా పెద్ద యుద్యోగములు చేసి 1902 లో ఉపకారవేతనమందిన సర్ హెన్రీకాటనుగారు తమ "న్యూ ఇండియా; ఇండియన్ అండ్ హోం మెమొరీస్" అను గ్రంథమునందు చెప్పినారు.

ఇంగ్లాండునుండి క్రొత్తగా వచ్చిన ఆంగ్లేయ యువకుని కీ దేశప్రజలందు జాలియు, దయయునుండునుగాని, త్వరలోనే ఇక్కడి నిరంకుశ సంప్రదాయములందు పెరిగిన ఆంగ్లేయో ద్యోగుల ప్రభావమువలన నితడు నీ దేశీయులను నీచముగా జూచి, వీరి నవమానించుట ప్రారంభించును. జాత్యహంకా రము సర్వత్రా కనబడుచున్నది. చీటికిమాటికి తన క్రింది యుద్యోగులను తిట్టుట, నౌకరులను కొట్టుట ప్రారంభించును. కొందరు దేశములోని గౌరవముగల పెద్దమనుష్యులు తమ్ము జూచి గుఱ్ఱము దిగలేదనియో, ఇంకొక కారణముననో కొట్టు చుందురు (కాటన్‌గారి 'న్యూ ఇండియా' పుటలు 41-42). "పంజాబు చీఫ్ కమిషనరు పనిచేసి తరువాత గవర్నరుజనరలైన

సర్ జాన్ లారెన్సు లాహోరులో తనగుఱ్ఱపువానిని కమిచీతో కొట్టు వింతను చూచుటకు చాలమంది నిరీక్షించుచుండిరట. ఇంత గొప్పవారే ఇట్టి దౌర్జన్యములు చేయుచుండగా, సామాన్యులమాట చెప్పవలెనా? నే నీదేశమున నుద్యోగము చేసినన్ని నాళ్లు భారతీయులను అన్యాయముగా కొట్టుట జరుగుచునే యుండెను. ఏదో చెప్పుకొనుటకు వచ్చి దారి కడ్డముగా సాష్టాంగపడినవారిని తన కఱ్ఱతో కొట్టిన ఒక గొప్ప యధికారిని నేను జూచినాను" అని ఇండియన్ అండ్ హోం మెమరీస్ 62 పుటలో కాటనుగారు వ్రాసినారు.

రైళ్లలో, రాజవీధులలో, ఇతరచోటుల భారతీయులను కొట్టుట యిప్పటికిని జరుగుచునేయున్నది. ఆంగ్లేయ యజమానుడు తన బూట్సుకాలితో తన్నగా చనిపోయిన నౌకరుల కేసు లనేకములు ప్రకటింపబడినవి. ఇట్టి సమయములందా దురదృష్టవంతున కేదో కార్జములో జబ్బుండినదని మేజస్ట్రేటు చెప్పి, ఆంగ్లేయ నేరగానిని విడిచిపుచ్చును లేదా కొద్ది జుల్మానాను విధించి పంపివైచును.

"ఈ భారతదేశమును పరిపాలించు ఆంగ్లేయోద్యోగులు మీసములైన రాని బాలురని చెప్పవచ్చును. వారికి సాంఘిక జీవనము లేదు, ప్రజలపట్ల సానుభూతి లేదు. ప్రజలతో కలిసిమెలసి తిరుగరు, మాటలాడరు. సాధ్యమైనంత త్వరలో అమితసంపద లార్జించుటకుతప్ప వీరు ప్రజలతో నెట్టి వ్యవహారములు జరుపరు. ధనకాంక్షతో, యవ్వన గర్వముతో సంచరించుచు దేశమునుండి ధనము తరలించుకొని పోవుచున్నారు. అధికారమును చలాయించుటకు శక్తిసామర్థ్య

ములను సంపాదింపకపూర్వమే, అమితమైన అధికారములు వీరి కివ్వబడుచున్నందునను, వీరికి ప్రపంచానుభవము కలుగకుండ గనే అమితధనము చేజిక్కుచున్నందునను, వీరు తమ యధి కారములను ఇష్టము వచ్చినట్లు దుర్వినియోగము చేయు చున్నను అడుగువారు లేనందునను, ఈ అన్యాయపు పద్ధతుల కంతము లేకున్న"దని బర్కు మహాశయుడు 1793 లో పార్ల మెంటులో చెప్పియున్నాడు.

"కుంపిణి యుద్యోగులు దేశ వ్యవహారములను తెలిసి కొనుటకు ముందుగానే ఉద్యోగవిధానములు నేర్చుకొందురు. తన కొలువు కూటమున చూపవలసిన మర్యాదలను గురించి ఇతనికి తెలియునుగాని, ప్రజల కష్టసుఖములు తెలియవు. ప్రజలపైన నెంతో ఎత్తున ఇతని నుంచుటవలన ఉద్యోగరీత్యా కచ్చేరీలయందును, న్యాయస్థానములందును అక్కడకువచ్చు కార్యార్థులను తన్నాశ్రయించి తిరుగుఉద్యోగులను ముక్త్యారు న్యాయవాదులనుమాత్రమే చూచును గాని, జనసామా న్యముయొక్క జీవితవిధానమును చూచుటకే ఇతని కవకా శము లుండవు.

ప్రజల సంసారజీవనముగాని, వారి నీతి నియమములు మర్యాదలుగాని, సద్గుణములుగాని చూచుట కవకాశము లుండక, వారి లోపములు దుర్గుణములుమాత్రము అతితీవ్ర మైన పరిస్థితులతో చూచును. తగవులలో నొకరిపైన నొకరు కత్తిగట్టి పోరాడుచున్న వాది ప్రతివాదులుగను, నేరములు చేసివచ్చిన ముద్దాయిలుగను వా రితనికి కనపడుచుందురు.

ప్రజల వ్యవహారములు విమర్శించుటలో విచక్షణ జ్ఞానము, జాగ్రత్త, క్రమపద్ధతి, లక్ష్యము లితనికి అలవడునుగాని, ఇది కేవలము ఏకవిషయమునకు సంబంధించినదై యుండును. ఇతని కార్యనిర్వహణము కాలహరణముతో కూడియుండును. ఇతడు కాలనియమమును పాటింపడు. ఇతనికి ఒక వ్యవహారము నుండి యింకొక వ్యవహారమునకు శీఘ్రముగా బుద్ధి మరల్చు ప్రాపంచికజ్ఞాన ముండదు, (అనగా ఇతనిమనస్సు యంత్రము వలెనుండి యితనిదృష్టి సంకుచితమై యుండును) " అని సర్ తామస్ మన్రో వ్రాసినాడు.§

§ Life and Letters of Sir Thomas Munro. Vol. pp. 229–280.

# ప్రజల అసంతృప్తి

నలుబదేండ్లు చెన్నరాజధానిలో పెద్ద యుద్యోగములు చేసి, 1820 లో మద్రాసు గవర్నరై 1827 లో దివంగతులైన సర్ తామస్ మన్రోగారు మద్రాసు దేశస్థితిగతులను గురించి 1824 డిశంబరు 31 వ తేదీన నొక గొప్ప 'మినిటు' అను సూచనలో అనేక విషయములు చర్చించి "ప్రభుత్వము లోని అన్ని పెద్ద సివిలు మిలిటరీ యుద్యోగములు ఇంగ్లీషు వారి హస్తగతము చేయబడి, భారతీయులకు లేకుండా చేయ బడినవనిరి."

"మనము ప్రజల ఆశలన్నిటిని అణచివేసినాము. అన్ని తారతమ్యములను తీసివేసినాము. భారతీయులలో రాజవంశములను నాశనము జేసినాము. సంపన్న గృహస్థులు లేకుండ చేసినాము. వీరికి బదులుగా బంట్రోతుల జాతిని బీదరైతుల జాతిని ఒక దానిని నిర్మించినాము" అని 1842 మొదలు 1872 వరకు నీ దేశములో బారిస్టరుగా నుండిన జాన్ బ్రూస్ నార్టనుగారు 1857 లో వ్రాసిన గ్రంథమున వ్రాసిరి.

"ఈ ఇంగ్లీషు ప్రభుత్వము దేశములోని జనసంఘము యొక్క పై తరగతులను పరువు ప్రతిష్ఠలను నాశనమునైన జేయుచున్నది లేదా, దానిని తీసివేసి, తగ్గించి, అందరిని ఒకే నేలమట్టమునకైన దింపి, పూర్వము దేశములో వారి

కుండిన పలుకుబడిని తీసివేసి దేశపరిపాలనమునకు వా రావంత
యైన నుపయోగము లేకుండ చేయుచున్నది, అని సర్
థామస్ మన్రోగారు 31-12-1824 తేదీన మినిట్సులో వ్రాసిరి.

"శాశ్వత పైసలా అనబడు పర్మనెంటు సెటిల్మెంటు వంగరాష్ట్రి రైతులను జమీందారుల కప్పగించినది. కేంద్ర ప్రభుత్వము బలహీనమైనందున ఆ జమీందారులీ రైతులను పీకుకొని తినుచుండగా, కాపాడలేక పోయినది. అయిదు లక్షలమంది ప్రజలను పరిపాలించి రక్షించవలసిన పోలీసు న్యాయవిచారణాధికారము ఒక్కొక్క జిల్లాలో నొక్కొక ఆంగ్లేయాధికారి వశము చేయుటవలన పైనుండి క్రిందివరకు బలవంతులు బలహీనులను పీకికొని తినుచున్నారు" అని "ఇంగ్లండ్ అండ్ ఇండియా" అను గ్రంథమున బి. డబ్లియు. నోయిల్ గారు వ్రాసిరి*

ఆనరబిల్ చార్లెస్, డబ్లియు. విన్ గారికి కలకత్తాలో ప్రధాన క్రైస్తవ మతాచార్యుడైన బిషప్ హెబరుగారు ప్రతాప్ ఘడునుండి 1825 సం॥ మార్చి 1వ తేదీన నిట్లు వ్రాసిరి. "నిజముగా బ్రిటిషువారు తమ ప్రభావమును భారతదేశక్షేమము కొరకే వినియోగించినారనియు, దీనివలన ప్రజలకు చాలా లాభములు కలిగినవనియు నేను నమ్ముచున్న ప్పటికిని, మన పరిపాలన ప్రజల అనురాగమునకు పాత్రముగ నున్నదనిగాని, ఇది ప్రజల యిష్టమునకు పాత్రమగుచున్నదని గాని నా కెవ్వరును చెప్పలేదు. మన కిట్టి కితాబు కలుగుట కష్టమనియు తోచుచున్నది. గాని నిజముగా ప్రజలఅసంతృప్తికి

---

* England and India. B. W. Noel (1859)

గల కారణములలో మన స్వయం కృతాపరాధములు కొన్ని యున్నవి. వానిని నివారించుటగాని, లేదా కొంతవరకైన తగ్గించుటగాని మన ధర్మము ఆ కారణములలో నొకటి మన కుంపిణీవారి సివిలు మిలిటరీ యుద్యోగులలో చాలమంది జాత్యహంకారముతో దేశజనులలోని ఉత్తమ కులజులను, మధ్యతరగతివారిని కూడా దూరముగానుంచి అమర్యాదతో చూచుచుండుట ముఖ్యమైనది. దేశీయులతో కలసి మెలసి యుండుటకు చాలా అడ్డంకులున్న మాట వాస్తవమే. వారు మనతో కలిసి భోజనము చేయకపోవుట యను ప్రతి బంధకము మహమ్మదీయుల విషయమున నెందు కెంకనుండ నీయవలెను ? ఈ విషయమున ఉత్తర హిందూస్థానమున సరసులైనయుద్యోగులు కొంత పనిచేయ వచ్చును. మనవారు జనుపు వినోద క్రీడలలో కొన్నిటియందు ముఖ్యముగా ప్రయివేటు నాటకము లాడు నాటక శాలలకును, మైదానములలో నాడు ఆటలకును దేశీయులువచ్చి పాల్గొనుటకు చాల నుత్సాహపడుదురు. అట్టి స్థలములకు వారి నాహ్వానించినచో వా రుబ్బిపోవుదురు. అయితే, మనవారు వీరిని స్నేహపాత్రులుగ నెంచి యాహ్వానించుట లేదు. ఫ్రాన్సుడీబాయిన్సు మొదలగు ఫ్రెంచివారికి ఇతర విషయములందు మంచి పేరులేక పోయినను, గొప్ప తరగతుల దేశీయులతో స్నేహముగానుండి వారిని చక్కగా చూచు విషయమున మాత్రము గంగా యమునల మధ్యను ఆగ్రాలోను ప్రజలువారినిప్పటికిని తలుచుకొనుచున్నందునమన కన్న వారి విషయమున ప్రజల అనురాగమునకు పాత్రులుగా నున్నారు. ఇంతేకాదు, మనవారి అహంభావము కుంపిణీవారు

నిర్ణయించిన మర్యాదలను కూడ గమనింప నిచ్చుటలేదు. ప్రధానదేశీయ సివిలు రివిన్యూ ఉద్యోగులైన తాశీల్దారులు పై యధికారులగు ఆంగ్లేయులవద్దకు వచ్చినప్పుడు వారికి కుర్చీలివ్వవలెనని యొక నిబంధన కలదు. ఇట్లే సైన్యమున సుబేదారులకును పైవారు కూర్చుండుటకు కుర్చీలివ్వవలెనని యొక నిబంధన కలదు. అయితే, హృదయ పూర్వకముగా నీ నిబంధన ప్రకారము జరుపు కలెక్టరు లీ హిందూదేశమున ఆరుగురైనను లేరు. పదునైదేండ్ల క్రిందట సైన్యములో నీ మర్యాద లెన్నడు మీరువారు కాదు. నేడీ మర్యాద సంపూర్ణముగా విడువబడినది. దీనిగూర్చి నేను చెప్పిన కుంపిణీవారి నిబంధన లున్నసంగతి దేశీయోద్యోగులందరు నెఱుఁగుదురు. ఇట్టి తరి తమకు జరుగవలసిన మర్యాద బుద్ధి పూర్వకముగా జరుపక పోవుటను ప్రతిపర్యాయముచూచి, వారు లోలోపల మనోవ్యథ నొందకుందురా? మర్యాదగల పూర్వకాలమునాటి గొప్ప కుటుంబములవారు ఇటువంటి అమర్యాదలను, ఇంక నిట్టి సంగతులును జూచియె తమ పూర్వపు హోదాలదరికి రాకయున్నారు. ఈ మర్యాదలు జరుగక పోవుచున్నందులకు దేశీయులెల్లరు ఐరోపావారికి చూపవలసిన గౌరవములు చూపక, ఐరోపావారు తమకు జరుగుచున్నట్లు చెప్పుచున్న అమర్యాదలను జరుపుచున్నారు” అని బిషప్ హెబరుగారు వ్రాసిరి. *

ఉత్తర హిందుస్థానమున సర్ప్యాట్రిటు సెషన్సు జడ్జిగా పదునేడేండ్లు పనిచేసి, మన దేశము సంగతిని, ప్రజలసంగతిని

---

* Bishop Heber's Journal. Vol. III pp 336-338

బాగుగా గ్రహించిన ఆనరబిల్ ఫ్రెడరిక్ జాన్ షోరుగారు 1832 మొదలు 1835 సంవత్సరమువరకును భారతదేశ స్థితిగతులను గూర్చి అప్పుడప్పుడు కలకత్తాలోని ఇండియాగెజెట్ అను పత్రికకు వ్యాసములు వ్రాయుచుండిరి. అవి యన్నియు 1838 లో నోట్సు ఆన్ ఇండియన్ ఎఫెయిర్సు అనుపేరున రెండు సంపుటములుగా ప్రకటింపబడినవి. దానిలో వారిట్లు వ్రాసియున్నారు. "భారతదేశమున బ్రిటిష్ పరిపాలనముయొక్క ముఖ్యలక్షణమేమనగా, ఈ రాజ్యము సామదానభేద దండోపాయములచేత సంపాదింపబడి, జనబాహుళ్యముయొక్క అభిమతమునకు వ్యతిరేకముగా సైనికబలమువలన అమలు జరుగుచు, ముఖ్యముగా మన నేటీవు సిపాయిల పటాలములవలననే నిలువబెట్టబడియున్నది, అని 1834 సంవత్సరమున ఫ్రెడరిక్ జాన్‌షోర్ అను ఇంగ్లీషు జిల్లా జడ్జి ఇండియన్ గెజెటు పత్రికలో వ్రాసినాడు. §

ఈయన మఱల 1835 లో నిట్లు వ్రాసిరి :

"భారతదేశ ఇంగ్లీషుపరిపాలనముయొక్క ముఖ్య లక్షణములను సంగ్రహముగా చెప్పెదను : "హిందూదేశములో పూర్వముండిన అన్ని ప్రభుత్వములను ఈ దొరతనము పన్నులభారమునందును, ప్రజాపీడనమునందును మించిపోయినది. ఇందు ప్రభుత్వముహాకును ధనికులగు వ్యక్తులనుగూడ అన్యాయము లనేకములు చేసిరి. ఇంకను చేయుచున్నారు. చేయగలరు. ఈ ప్రభుత్వమున జరిగిన అన్యాయములను ఆలించి తీర్చగలవా రెవ్వరునులేరు. దీనికి నష్టపరిహారము

§ Notes on Indian affairs. F. J. Shore. Vol. I. 394.

సిద్ధించుట అరుదు. అందువలన మనలను త్రోసిరాజనగల బలవంతు లెవరైన గలరని ప్రజలకు నమ్మకము కలిగినచో వా రత్యుత్సాహముగ వారి యండను జేరుదురు. *

1834 సంవత్సరములో ఫ్రెడరిక్ జాన్‌షోరుగారు ఈ బ్రిటిష్‌పరిపాలనములో ప్రజల అసంతృప్తికిగల కారణముల నిట్లు క్లుప్తముగా వ్రాసిరి.

1. నేటివులు లంచగొండులనియు, అసమర్థులనియు మనవారు అధికులనియు మనకుగల అహంభావము.

2. ఆ కారణముచేత ఇంగ్లీషువాడు చేయుట కంగీకరించు ప్రతియుద్యోగమును నేటివులకు లేకుండచేయుట, అన్ని వ్యవహారములును జాతివారి ద్వారాగానే జరిగింప జూచుట.

3. దేశములోని పూర్వసంస్థల నన్నిటిని నాశనము చేయుట, న్యాయవిచారణ కొరకు క్రొత్తగా స్థాపించినసంస్థలు అసంతృప్తికరముగా నుండుట.

4. అత్యధికమగు పన్నులు విధించుటవలన దేశ చరిత్రలో ఇదివరకెన్నడు కని విని యెరుగని విధముగా దేశప్రజల నుండి ధనము పిండుట.

5. రివెన్యూ హెచ్చించుటకొరకు పూర్వపు రాజవంశీయులను దేశములో పరువుప్రతిష్ఠగల పెద్దభూస్వాములను నాశనముచేయుట. §

"1793–1809 మధ్యదేశములో ఇంగ్లీషు సర్క్యూటు జడ్జిల నివేదికలు 1812 లో పార్లమెంటువారి కొరకు తయారు

---

* Ibid Vol. II. p. 521.

§ Ibid Vol. I. pp. 355–356.

చేయఁబడిన ఫిఫ్త్ రిపోర్టులో చేర్చబడినవి. ఆనాటి న్యాయ విచారణ పద్ధతు లెంత దుఃస్థితిలో నుండెనో వానివలన తెలియ గలదు. దీనినిగూర్చి దేశీయులు మొఱలు పెట్టుకొనిరి. ప్రజలు తమకష్టములను గూర్చి చెప్పుకొని, మొఱబెట్టి పెట్టి, ఆలన పాలనలు చేయువారు లేనందున విసిగియూరకొనిరి" అని ఫ్రెడరిక్ జాన్‌షోరుగారు 1834 లో వ్రాసిరి.*

ఈ షోరుగారు 1835 జనవరి 12 వ తేదీన నిట్లువ్రాసిరి. "మనవా రనుకొనునట్లు మన ప్రభుత్వముపట్ల భారతీయులు చాల స్నేహభావముతో నున్నారనియు ఈదేశమున మన ప్రభుత్వముస్థిరముగా పాదుకొని యున్నదనియు నేనుతలంపను. ఆంగ్లేయులపట్ల అయిష్టమును ద్వేషమును ప్రజల హృదయము లందు పాదుకొని యున్నవి. మనవారు వారిపట్ల ప్రవర్తించు దురశ్చర్యలవలన దీనిలో నాశ్చర్యములేదు. కడచిన అయి దేండ్లలో నీ దేశీయుల మనోభావములను గూర్చిన నిజస్థితి మన వార్తాపత్రికలు కొంత వెల్లడించినవి."

"దూరదృష్టిలేని మన పద్ధతులును, మన అత్యాశయు, నందువలన జరుగు ప్రజాపీడనము దుష్పరిపాలనమును ప్రజల అతృప్తికి నిజమైన కారణములు" అని ఆయన 1834 మే 15 వ తేదీన వ్రాసినాడు.†

1834 డిశంబరులో షోరుగారిట్లు వ్రాసిరి. "భారతీయు లతి శ్రద్ధగా మనలను కనిపెట్టి చూచుచున్నారు. ఇప్పుడు తాము మన చేతిలోపడి బలహీనులుగ నున్నామని భారతీయు

* Notes on Indian Affairs. Vol. I. p. 447.

† Notes on Indian Affairs. Vol. II. p. 247 F. J. Shore.

తెరుగుదురు. మనము చేయు ప్రజాపీడనమునుగూర్చియు అన్యాయములను గూర్చియు వారు తమలో తాము విషాదముతో గొణుగుకొనుచున్నారు. ఇది యంతయు వారు స్వయముగా చూచుచు కలవరముతో వితర్కించుకొనుచున్నారు. కొద్ది మంది (తెల్ల వారి) లాభముకొరకు లక్షలకొలది భారతీయులను పరిపాలించుటకు మన కేమి హక్కు కలదు ?"

"...దేశ ప్రజలలో పలుకుబడిగల వారిలో చాలమంది కిప్పుడు మన భాష వచ్చును. దినదినము ఎక్కువమంది దీనిని నేర్చుకొనుచున్నారు. వంగరాష్ట్రమునందును ఉత్తరహిందూస్థానములోని పరగణాలయందును దేశీయుల వార్తా పత్రికలున్నవి. కలకత్తాలో పలుకుబడిగల ఆంగ్లేయ వార్తా పత్రికలలో నొకటి యిటీవల నొక ధనవంతుడైన దేశీయుని సొత్తు అయినది. దేశములోని దూరస్థలములలో నున్న ప్రజలకు రాకపోకలు దినదినము హెచ్చు అగుచున్నవి. ఇంకను హెచ్చగలవు. న్యాయమైన శాసనములను జేసి, ఇట్లు విజృంభించుచున్న శక్తులనన్నిటిని యావద్భారత దేశములోని ప్రజల క్షేమలాభముల నాలోచించి ఇప్పుడు పోవుచున్న మార్గములనుండిమరల్చి, ఇతర మార్గములోనికి ద్రిప్పి యుపయోగింపనిచో భారతదేశమున బ్రిటిష్ పరిపాలనము కూలి పోవునని జోస్యము చెప్పుచు చేయబడిన హెచ్చరిక త్వరలో నేనిజము కాగలదు" *

షోరుగారు 1835 నవంబరులో నిట్లు వ్రాసిరి. "ప్రజలు మనలను అసహ్యించుకొనుచున్నారు. మనలను కూలద్రోయ

* Notes on Indian Affairs. Vol. II. pp. 224—227.

శక్తిగల బలవంతు లెవ్వరైన నున్నారని వారెంచినచో, వారు పరమ సంతోషముతో వారియండ జేరుదురు." §

"చిరకాలమునుండి మన లోపములను బాగుగా నెరిగి యున్న భారతీయ ప్రజలిప్పుడాలోపములను గురించి కొంత స్వేచ్ఛగా చర్చించుట మొదలిడినారు. ఇంకను ముఖ్యమైన సంగతియేమనగా, మనకు గల బలమునుగూర్చియు మనకిప్పుడుగల (రాజ్యాంగ) స్థితిని నిలువబెట్టుకొనుటకు మనకు గల మార్గములను గూర్చియు చర్చించుట ప్రారంభించినారు. మనము న్యాయముగా నిర్వహింపవలసిన కర్తవ్యమును సాధ్యమైనంత త్వరితముగా చేయనిచో, ఫ్రెంచిదేశమున రాజరికమునకును అచ్చట కన్నులు మూసికొని ప్రవర్తించిన ధనవంతులకును తటస్థించిన ఘోరమైన గతియే మనకు నిచ్చట తటస్థింపగలదు. ఆంగ్లేయపరిపాలనమును భారతీయుల పాలిటి పెన్నిధిగా చేసి, యీ ఘోరమైన విపత్తు రాకుండ చేయుట కింకను వీలుకలదు." అని షోర్‌గారు 1835 నవంబరులోనే వ్రాసినారు. *

ఆంగ్లేయ ప్రభుత్వముపట్ల భారతీయుల భావము లెట్లుండెనను విషయమునుగూర్చి షోర్‌గారు 1833 ఏప్రిల్‌లోనే స్పష్టముగా ప్రకటించిరి. "నేననేక స్వతంత్రరాజ్యములను తిరిగి చూచియున్నాను. అన్నిటికన్నను ముఖ్యముగా బ్రిటీషువారి యధికారమును లోబడుటను వారు వాంఛించుట లేదని నేను గట్టిగా చెప్పగలను."... "సర్వకాల సర్వావస్థల

---

§ Notes on Indian Affairs Vol. II. page 521
* Ibid p. 527

యందును మన సైన్యము ల(ప్రమత్తతవహించి యున్నందు వలననే దేశమున తిరుగుబాటు జరుగకుండ నున్నదనుసంగతిని అందఱు నంగీకరించుచున్నారు. అవకాశము కలిగినపుడెల్ల అధికారధిక్కారము జరుగుచునే యున్నదనుట కనేక ఉదాహరణములున్నవి" అని షోరుగారు 1781, 1824, 1832 సంవత్సరములలో జరిగిన తిరుగుబాటులను వివరించినారు....

"ఆంగ్లేయ పరిపాలన మీ దేశమున కదల్చుటకు వీలులేనంత గట్టిగా స్థిరపడియున్నదని చాలామంది ఇంగ్లీషు వారి యభిప్రాయము. మన యధికారముపట్ల తిరుగుబాటు జరిగిన జరుగవచ్చును కాని అది చాలా దూరపుసంగతి యని యెంచుచు దానినిగూర్చియే ఆలోచింపరు. దేశీయులలో నైకమత్యము లేనందువలనను, తగిన బలముగల పరరాజ్య ప్రభుత్వములు లేకపోవుటవలనను, మన కేభయమును లేదని యనుచుందురు. కొందఱుమాత్ర మింకొక విధముగా తలచు చున్నారు. సమర్థులైన గ్రంథకర్తలు చాలామంది యట్టి పరిస్థితులు త్వరలోనే కలుగవచ్చునని యభిప్రాయపడు చున్నారు" అని షోర్ గారు 1833లో చెప్పిన జోస్యము 1857లో నిజమైనది.†

ఆంగ్లేయ రాజ్యాక్రమణమువలన కలిగిన రాజకీయ ఫలితములు 1818 సంవత్సరము వరకును భారతదేశ ప్రజల కంతగా కనబడలేదు. మహమ్మదీయ ప్రభుత్వము స్థాపించు నప్పటికన్న ఆంగ్ల రాజ్యస్థాపన సమయమున ఎక్కుడు పోరాటము జరుగలేదు. భారతదేశ గ్రామములందు జీవనముచేయు

† Notes on Indian Affairs. Vol. I. pp. 145–166.

రైతులకును బ్రాహ్మణులకును తమ కృషియు ఆచారములును చేసికొనుటకు వీలున్నంతవరకు ఈ దేశమును పరిపాలించునది మీర్ఖాసీమునవారైనను, క్లైవుదొరయైనను వారికిపట్టలేదు. వర్తకులకును సాహుకారులకును గావలసినది బలముగల ప్రభుత్వము. అందువలన దేశపరిపాలనమునందు మార్పులు కలిగించుట కొరకు తమకు నష్టకరమైన ప్రయత్నములు చేయరు, శక్తిసామర్థ్యములుగల కుంఫిణీవారి దొరతనమే మంచిదని తలంతురు.

1818 సంవత్సరమునుండి సంగతి సందర్భములందు మార్పు కలుగసాగెను. ఈ బలమైన కుంఫీణీ ప్రభుత్వము క్రైస్తవ మిషనరీలతో సంబంధమును గలిగించుకొనెను. ఈ మిషనరీలు హిందూమహమ్మదీయ మతములయొక్క పునాదులను పెల్లగింప ప్రయత్నించుచుండిరి. ఈప్రభుత్వము పూర్వాచారమైన సహగమనమును నిషేధించెను. వితంతువుల పునర్వివాహములను హర్షించెను. హిందూమతమునుండి క్రైస్తవులైనవారి కుటుంబములందు వారి ఆస్తిహక్కులు వారి కుండునట్లు చేసెను. పూర్వము హిందూమహమ్మదీయుల పండుగలను ఉత్సవములను తనపిల్లల యాటలవలె ఆదరించి, వానియందు తాను పాల్గొని, వారి దేవాదాయములను ధర్మాదాయములను చక్కగా పరిపాలించిన ఈ ప్రభుత్వము ఇప్పు డది మానివేసి వదిలివేసెను. మొదట దేశముయొక్క పూర్వవిజ్ఞానమును అరబ్బీ,సంస్కృతభాషను పోషించిన ప్రభుత్వము ఈ ప్రాచీన విజ్ఞానమును హేళనచేయు క్రొత్త విద్యావిధానము నొకదానిని స్థాపించెను. మాలవాంద్రతో

పాటు బ్రాహ్మణులుగూడ నొకే పెట్టెలో కూర్చుండవలసి వచ్చు రైళ్ళను నిర్మించెను. ఇంద్రజాలమువలె తీగెలద్వారా వార్తలంపు తంతివార్తల తీగెలను నిర్మించెను.

"ఇంతకాలము చలనము లేక స్థిరముగా నున్న తమ దేశములోనికి క్రొత్త ప్రపంచమును దెచ్చిపెట్టినప్పుడు సనాతన ధర్మ పరాయణులగు హిందువు లేమనుకొందురు ? దీనికి జవాబు అనేక విషయములందు కనబడుచున్నది. త్వరలోనే దేశీయు లెల్లరు మ్లేచ్ఛులుగను క్రైస్తవులుగను చేయబడుదురను వార్త వ్యాపించెను. బొంబాయిలో పారశీ వారు హిందువులుకూడ బట్లరువ్రాసిన మతముల సామరస్యము (Analogy of Religion) అను గ్రంధమును చదువవలసి యుండిరి. చెన్నపట్టణమున ఉత్సాహవంతులగు క్రైస్తవ మత ప్రచారకులు పాఠశాలలందలి విద్యార్థులను క్రైస్తవ మతమునకు సంబంధించిన ప్రశ్నలకు భక్తితో జవాబులు చెప్పునట్లు నిర్బంధించు చుండిరి. ఈ జవాబులు క్రైస్తవులు చెప్పినచో సమంజసముగనే యుండునుగాని, సనాతన హిందువులు చెప్ప వలసి వచ్చుట రోతగ నుండెను. బీహారులో విద్యాశాఖ పరీక్షకుని (Educational Inspecter) కచ్చేరికి సైతానీ దప్తార్ అనగా పిశాచ కార్యాలయమని పేరిడిరి.

చెరసాలలందలి ఖైదీలు పూర్వమువలె తాము త్రాగు మంచినీటిని తాము తీసికొని పోవరాదని శాసింపగనే కులము లను కూలద్రోసి హిందువుల నందరిని క్రైస్తవులుగ చేయ దలచినారని తలంచిరి" అని హెచ్. హెచ్. డాడ్వెల్‌గారు ప్రకటించిన ది కేంబ్రిడ్జి షార్టర్ హిస్టరీ ఆఫ్ యిండియా అను గ్రంథమున 728-729 పుటలలో వ్రాయబడినది.

# దుష్పరిపాలనము

భారతదేశ స్థితిగతులనుగూర్చి తెలిసికొని, పార్లమెంటులో నీ దేశీయుల కష్టములనుచెప్పి, మనవారికి జరుగు అన్యాయములను తొలగించుటకు ప్రయత్నించిన మహానుభావులలో ఎడ్మండుబర్కు మహాశయుని తరువాత జాన్ బ్రైటుగారి పేరు శాశ్వతముగా స్మరింపదగినది. ఈయన 1811 లో జన్మించెను. ఈయన 1843 లో పార్లమెంటులో సభ్యుడయ్యెను. ఆ కాలమున నింగ్లాండులో జనసామాన్యమునకు గింజ కరవై కష్టపడుచుండగా, ధనికులు సౌఖ్యమనుభవించుచుండుటనుగూర్చి కొంత ఆందోళన జరుగుచుండెను. అందీయన పాల్గొని, బీదజనుల పక్షమున పనిచేయసాగెను. ఇంగ్లాండులోని బీదజనుల దుఃస్థితియేగాక, భారతదేశమున దారిద్ర్యమనుభవించుచున్న కర్షక కార్మికుల దుఃస్థితియు నీయనమనసు కరగించెను అంతట నీయన భారతదేశ సమస్యలను జాగ్రత్తగా పరిశీలించి, మన బీదజనుల నుద్ధరించుటకు బద్ధకంకణులై తన యావజ్జీవము, 1889 మార్చి 27 వ తేదీన స్వర్గస్థు లగువరకు మనకొరకు పాటుపడసాగిరి. ఈయన భారతదేశమున కుంపిణీవారి పరిపాలనములోగల లోపములను అందీ ప్రజలనుభవించుచున్న కష్టములను గూర్చిన వివరముల నన్నిటిని సంగ్రహించి, యీనాటి భారత దేశీయనాయకులతో

నుత్తర ప్రత్యుత్తరములు జరుపుచు, పార్లమెంటువారికి నివేదించుచు, భారతదేశ ప్రభుత్వ విధానమును సంస్కరించి ప్రజలబాధలు తొలగించుటకు కృషిచేయసాగిరి. వీరీదేశమువందిట్టిశ్రద్ధ వహించుటవలన పార్లమెంటులో నీయనకు 'భారతదేశ ప్రతినిధి' యని పేరు వచ్చెను. బ్రైటుగారుచేసిన మహత్తరమైన కృషివలననే భారతదేశ పరిపాలనా విధానమునందు కొన్ని సంస్కరణములైనను చేయబడెను. భారతదేశమున నాంగ్లేయులు ప్రజలను నీచముగ చూచుటయు నీప్రభుత్వమున ప్రజలు పడుచుండిన బాధలను అందువలన వారిలో వ్యాపించుచున్న అసంతృప్తిని గూర్చియు వీరు వెల్లడించిరి. 1857 లో జరిగిన స్వాతంత్ర్య విప్లవమునకు కుంపినీవారి దుష్పరిపాలనమే కారణమని వెల్లడించి, ఈ విప్లవమునకు ప్రతిక్రియగా నాంగ్లేయులు అత్యాచారములు చేయుచుండుటను నిరసించి, కుంఫిణీపరిపాలన తీసివేసి, ఆంగ్లరాజమకుటముక్రింద సత్పరిపాలనము నెలకొల్పవలె నని ఈయన తీవ్రముగా వాదించిరి.

భారతదేశమున ఆంగ్లేయ పరిపాలనలో నీదేశ ప్రజలనుభవించుచుండిన కష్టములకెల్ల కుంఫిణీవారి దుష్పరిపాలనమే కారణమని జాన్ బ్రైట్ మహాశయుడు శీఘ్రముగనే గ్రహించి, ఈ సమస్యను పార్లమెంటు సభలో తీవ్రముగ జర్చింపసాగెను. 1847 నాటికి భారతదేశములో చేనేత పరిశ్రమ యంతరించి ఈ దేశమునుండి ముడిప్రత్తి ఇంగ్లాండున కెగుమతి చేసి అక్కడ యంత్రములమీద తయారైన నూలుబట్టలు దిగుమతిచేయు విపరీతపు ఆర్థికపద్ధతి యవతరించి దేశము

నానాటికి దారిద్ర్యమున మునుగుచుండెను. ఇట్టిస్థితిలోనైనను మనదేశమునం దీపత్తిపంట యొక గొప్ప పరిశ్రమగానే యుండెను. అయితే ఈ పత్తిపంట పరిశ్రమలో జీవనముచేయు రైతులు కూలివారు పారిశ్రామికులు కడుపునిండ కూడులేక, కట్టగుడ్డలేక నిలువ నీడలేక ఘోరదారిద్ర్య మనుభవించుచు బాధలు పడుచుండుటవలన నీ పరిశ్రమ గూడ నానాటికి క్షీణించి దుఃస్థితిలోనికి వచ్చుచుండుటను గూర్చి ఇచ్చటి స్థితి గతులను చూచిన ఉద్యోగులును ఉద్యోగేత రులను గూడ అనేక వ్యాసములందు గ్రంథములందు వ్రాయుచుండిరి. ఇది చూడగా, పరోపకార పారీణుడగు బ్రైటుగారి హృదయము దహించుకొని పోయెను. ఈ దీన జనుల కష్టములను బాధలనుగూర్చి మననముచేసి వీరి నుద్ధ రింప సమకట్టి ఇంగ్లాండుకును, భారతదేశమునకును గూడ ఆర్థికముగా ముఖ్యమైన ఈ ప్రత్తిపంట పరిశ్రమయొక్క స్థితి గతులను గూర్చి వర్ణించి దీనిని విచారించుట కొక విచారణ సంఘమును నియమింపుడని బ్రైటుగారు 1847 లో పార్ల మెంటువారిని కోరిరి. అంతట 1848 లో నట్టి విచారణ సంఘ మొకటి నియమింపబడెను. దానిలో కుంపిణీ డైరెక్టరులు గూడ చాలమంది సభ్యులుగా నుండిరి. బ్రైటుగారు చాలా శ్రమపడి ఈ పత్తిపంట పరిశ్రమలోని లోటుపాటులను, పారి శ్రామికుల దారిద్ర్య కారణములను, దేశస్థితిగతులను దెలుపు సాక్ష్యముల నెల్ల సమకూర్చి, దీనిలోని యక్రమములను ఇందలి గుట్టుమట్టులను బయటకుదీసి ఒక గొప్ప రిపోర్టును తయారు చేయించిరి.

భారతదేశమున రోడ్లు రాకపోకలు చేయుటకు తగిన స్థితిలో లేకుండుట, పల్లపు సాగుకు నీరు సరఫరాచేయు నీటి వనరులు బాగుగా లేకుండుట, పారిశ్రామికులు, రైతులు గర్భదరిద్రులై అప్పులలో మునిగి విత్తనములు గింజలు కొనుటకు సాహుకారులకు తమ పంటలను తాకట్టుపెట్టి వారి చేతిలో చిక్కి బాధలు పడుచుండుటయు, నీ ప్రత్తి పంట యొక్క దుఃస్థితికి ప్రధాన కారణములనియు, కుంపిణీవారి ద్రవ్యపద్ధతి లోపభూయిష్ఠమై భూమిపన్ను అత్యధికమై ప్రజలకు మిగులునది లేకపోవుట; రోడ్లు, వంతెనలు నీటి వనరులు, చెరువులు, కాలువలు, తటాకములు మొదలగు ప్రజా సౌకర్యముల కొరకు దేశమునుండి కుంపిణీవారు గ్రహించు చున్న ఆదాయములో నూటికి అర్థరూపాయివంతు మాత్రమే ఖర్చు పెట్టబడుచుండుటవలన కుంపిణీవారి దొరతనమున నవి పాడై దుఃస్థితిలో నుండుటయు ఇతర కారణము లనియు నీ విచారణ సంఘమువారి రిపోర్టువలన రూఢియైనది.

పార్లమెంటువారు తత్‌క్షణమే జోక్యము కలిగించు కొననిచో నీ యన్యాయములు తొలగి భారతదేశప్రజల స్థితి బాగుపడదని బ్రైటుగారు స్పష్టీకరించి దీనినిగూర్చి యొక రాయల్ కమిషను నియమించవలసినదని కోరిరి కాని, ఇది జరుగలేదు. 1853 లో కుంపిణీవారికి మరల పట్టానిచ్చు తరుణమున భారతదేశ వ్యవహారములు మరల చర్చకు వచ్చెను. ఆ సందర్భమున బ్రైటుగారు మాట్లాడుచు నిట్లు చెప్పిరి. "భారతదేశ పరిపాలన ఆంగ్లేయ పార్లమెంటువారు నిర్వహింపవలసిన యొక ధర్మకర్తృత్వపు బాధ్యతయని పార్లమెంటులో

నన్ని పక్షములవారు నంగీకరించుచున్నారు గాని, కుంపిణీవారి పరిపాలననుగూర్చి పార్లమెంటు వా రింతవరకును సరియైన తనిఖీచేసి సరియైన అదుపు ఆజ్ఞలలో నుంచలేదు. ఈ భారత దేశమును ఆంగ్లేయులు తమ పశువులను మేపుకొనుట కేర్పడిన యొక గ్రామబంజరువలె నుపయోగించుకొనుచున్నారు. అనగా దానివలన తమకు కావలసిన లాభమును పొందుటకు మాత్రమే దాని నుపయోగించుచున్నారు."

వంగరాష్ట్ర రైతుల దుఃస్థితి వర్ణనాతీతముగా నున్నదనియు, వారు కుక్కలుగూడ పండుకొనుట కసహ్యించు కొనునంతటి అసహ్యమైన గుడిసెలందు వశించుచున్నారనియు, చింకిపేలికలు తప్ప వారికి కట్టుకొనుటకు గుడ్డ లేదనియు, వారికే వారికుటుంబములకు నొక పూటయైన కడుపు నిండ కూడులేదనియు, మానవ జీవనమునకు కావలసిన సామాన్య సౌకర్యములయినను వారికిలేవనియు, కొన్ని కోట్ల రూపాయిల విలువగల పంటను పండించి కుంపిణీవారి ధనాగారమును నింపించు నీ పారిశ్రామికు లనుభవించు ఘోరదరిద్ర స్థితియొక్క నిజము బయల్పడినచో వినువారి మనస్సులు కరగి పోవుననియు, కుంపిణీ ప్రభుత్వ పక్షపాతముగల "ఫ్రండ్ ఆఫ్ ఇండియా" పత్రికలోనే 1852 వ సం॥ ఏప్రియల్ 1 వ తేదీన వ్రాయబడిన దనియు, ఒక్క వంగరాష్ట్రమునందేగాక అన్ని రాజధానులలోని ప్రజల స్థితియు నిట్లేయున్నదనియు బ్రైటు గారు చెప్పిరి.

మంచి సారవంతమైన భూమియుండియు సకల సంపదలు నుత్పత్తి యగుచున్నను, ప్రజలు అసహాయ్యులయి

గర్భదారిద్ర్యము ననుభవించుచు బాధలు పడుచున్నారన్న చో ఈహిందూదేశ ప్రభుత్వమునం దేదోయొక గొప్పలోప ముండి తీరవలయు ననియు, ప త్తిపంట విచారణసంఘమువారి యెదుట సాక్ష్యమిచ్చిన వారందరును కుంపిణీవారిక్రింది యుద్యోగు లేననియు, వీరందరును భారతదేశపు రైతులెట్టి ఘోరమైన బాధలనుభవించుచున్నారో స్పష్టముగ వెల్లడించుచున్నా రనియు, ఈ రైతులు వి త్తనములు కొనుటకు సాలుకు నూటికి నలుబది లేక యేబది రూపాయలవంతున వడ్డీలపైన అప్పు తెచ్చుకొనవలసి వచ్చుచున్నదని వారు చెప్పియున్నారనియు, ఈ బీదరైతులు తమకుగల కొద్దిపాటి వెలగల వెండినగలను కుదువబెట్టవలసి వచ్చుటనుగూర్చి తాను రుజువుచేయగల ననియు, పన్నులవసూలుకొరకు కుంపిణీవారు నియమించిన ఉద్యోగులు మిడతలదండువలెవచ్చి యీ దురదృష్టవంతులగు రైతులపైనబడి వారి సర్వస్వమును మ్రింగివేయుచున్నారని అచ్చటి స్థితిగతులనుగూర్చి అనేకమంది గ్రంథకర్తలు వ్రాసి యున్నారనియు బ్రైటుగారుచెప్పిరి.

కుంపిణీవారికి మరల పట్టా నిచ్చుటకు ఇంగ్లాండు దేశపు పార్లమెంటుసభలో 1853 వ సం॥ ప్రవేశపెట్టబడిన ఇండియా రాజ్యాంగ చట్టము చర్చకు రాగా నీ సుప్ర సిద్ధాంగ్లేయ రాజ్యనీతిజ్ఞుడగు జాన్ బ్రైట్‌గా రుపన్య సించుచు, "రాజ్యాంగమునందు మార్పుల చేయవలెనని భారతదేశీయు లెల్లరు నేకగ్రీవముగా కోరుచున్నా"రని చెప్పి, భారతదేశమున న్యాయస్థానములు అమిత ధనవ్యయ కారణము లయి వ్యాజ్యములకు తెంపులేక కాలము జరుగుచుండుట,

పోలీసువారు అవినీతిపరులయి లంచగొండులయి యుండుట, రోడ్లు, పల్లపుసాగుకు వలసిన నీటి సదుపాయములు బాగు చేయక ఉపేక్షించుచుండుటయు, ప్రభుత్వముయొక్క లోపము నకు ప్రత్యక్షనిదర్శనమునుతార్కాణమునగు భారతీయ ప్రజల ఘోర దారిద్ర్యమును, ఎట్టి విచక్షణము లేకుండ దేశీయుల కుద్యోగము లొసగబడవలెనని 1833 వ సం॥రంలో చేయ బడిన రాజ్యాంగవిధి నిష్ఫలమగుటయు, ప్రాపకమువలననే ఐ. సి. యస్. ఉద్యోగులను నియమించుటయు వారి సీని యారిటీనిబట్టియే వారికి ప్రమోషను (ఉద్యోగమున అభి వృద్ధి) నొసగుటయు దేశీయులలో తెలివైనవారి కుద్యోగము లిచ్చుటకు ప్రతిబంధక మగుటయు వివరించి, "పన్నుల విధించు పద్ధతి పనికిమాలినదిగా నున్నది. ఆర్థికముగా యంత్రసహాయ మావంతయులేని ప్రజలకీపన్నులభారముదుర్భరముగానున్నది. ఉప్పుపన్ను అన్యాయము. నల్లమందు వలన వచ్చు ఆదా యము నిలకడలేనిది. దేశాదాయము అనవసరమైన యుద్ధ ములకు దుర్వినియోగము చేయబడుచున్నది. సివిల్‌సర్వీసు ఉద్యోగుల కత్యధిక జీతము లివ్వబడుచున్నవి.

హిందూదేశములో కొన్నివందల చతురపుమైళ్ళ వైశాల్యముకలిగి కొన్నిలక్షలప్రజ లుండు పెద్దపెద్ద జిల్లాలను పరిపాలించుటకొరకు నియమింపబడిన ఆంగ్లేయ జిల్లాకలెక్టరు లకు, మేజస్ట్రేటులకుగల అధికారములు అనిర్ణీతములును, అపరిమితములునై యున్నవి. ఒక పెద్దజిల్లాను బాగుచేయుట కును, పాడుచేయుటకును వీలైనంత అపారమైన అధికార మీకలెక్టరుల కున్నది. భారతదేశ వ్యవహారములను

పార్లమెంటువారు తృప్తికరముగా పరిష్కరింప లేకున్నారు. ఈ దేశపు పార్లమెంటు వారికిని, ప్రజలకును భారతదేశము యొక్క నిజస్థితి వెల్లడింపబడుట లేదు. మొత్తము మీద యీ బ్రిటిష్ ఇండియా ప్రభుత్వము బాధ్యత లేని రహస్య ప్రభుత్వముగా నున్నది. దీని నింక సహింపరాదు" అని చెప్పి యిట్లనిరి. "భారతదేశ ప్రజలలో విద్యాభివృద్ధి చేయుడు. వారిని వివేకముతో పరిపాలింపుడు. అంతట నా దేశములోని కులభేదములుపోయి వారందరు మనలను దేశమును జయించినవారిగా గాక, తమ కపారమైన మేలొనగూర్చినవారిగ పరిగణింతురు" అని హెచ్చరించిరి.

కుంపిణీ ప్రభుత్వమున డాల్‌హౌసీ ప్రభువు హిందూ దేశమున గవర్నరు జనరలుగ నుండిన కాలమున, అనగా 1848 మొదలు 1856 వరకును వంగరాష్ట్రమునందలి ప్రజల బాధలను గూర్చి భారతదేశమున నుండిన వివిధ క్రైస్తవ మత ప్రచారకులు పార్లమెంటువారికి 1852, 1853, 1856 సంవత్సరములలో మహాజరు లంపిరి. వీరు భారతదేశ ప్రజలపట్ల పక్షపాతము వహించిరనిగాని, ఆంగ్ల పరిపాలనకు విరోధులనిగాని చెప్పవలనుకాదు. అందువలన వీరి మాటలకు హెచ్చు విలువకలదు.

కుంపిణీవారికి క్రొత్తపట్టా నిచ్చుటకు ముందు 1852 లో వీరు పార్లమెంటుకు సమర్పించిన అర్జీలో దేశమంతటను ప్రజాసామాన్యము బాధలనొందుచుండుట, ప్రభుత్వము సవరింపవలసిన లోపములు నానాటికీ హెచ్చుచుండుటయు వివరించిరి. వంగరాష్ట్రమునందు అనేక జిల్లాలలో ప్రజల

ప్రాణములకుగాని, ఆస్తికిగాని రక్షణ లేకుండెను. దొంగల గుంపులు, దోపిడులు వృద్ధియగుచుండెను. దేశములో దౌర్జన్యములు, పోలీసువారి అశక్తతయు వర్ధిల్లెను. న్యాయవిచారణ పద్ధతి బాగుగా లేకుండెను. చిత్రహింసలుపెట్టి నేరముల నొప్పించుట, ప్రజాపీడనమును వర్ణించిరి. ప్రస్తుతము అమలులో నున్న భూస్వామిత్వ పద్ధతులవలన దేశములోని గ్రామ ప్రజల ఘోరదారిద్ర్యము దుఃస్థితిలోనికి దిగుచుండుట, జమిందారులు రైతులను పీడించి బాధించుట, శాంతిభద్రతలు కాపాడవలసిన పోలీసు రక్షకశాఖవారు చౌకీదారుపన్ను పైననో, గవర్నమెంటు జీతములపైననో బ్రతుకుచు ప్రజలపట్ల క్రూరముగా ప్రవర్తించుటను ఈ అన్యాయములందు రైతులు ఘోరదారిద్ర్యమునను, దాస్యమునను బాధపడుచుండుటను గూర్చియు నీమిషనరీలు విన్నవించిరి.

వంగరాష్ట్రమునందు కాపురమున్న 1800 మంది క్రైస్తవులు 1853లో పార్లమెంటువారికి ప్రత్యేకవిన్నప మంపిరి. వంగరాష్ట్రములోని క్రిందిజిల్లాలలో పోలీసువారు నేరములు జరుగకుండా కాపాడ లేకున్నారనియు, నేరగాండ్రను పట్టుకొన లేకున్నారనియు, వీరిలో లంచగొండితనము హెచ్చి, చీటికి మాటికి ప్రజలను పీడించుచున్నారనియు, అనుమానముపైన పట్టుకొన్నవారిని చిత్రహింసలపాలు చేయుచున్నారనియు చెప్పి ప్రజల ఘోరదుఃస్థితిని గూర్చియు, న్యాయపరిపాలనా పద్ధతి అసంతృప్తికరముగా నుండుటనుగూర్చియు విన్నవించిరి. ప్రజల కష్టసుఖములను గూర్చిన విచారణ ప్రారంభింపక

పూర్వమే పార్లమెంటువారి విచారణ ముగించుట యన్యాయమని వగచిరి.

1853 లో క్రొత్తపట్టా ఇవ్వబడిన పిదప కుంపిణీ పరిపాలనలోను భారతదేశ స్థితిగతులందును మార్పులుకలుగలేదు సరికదా, దుష్పరిపాలనమువలని బాధలు మరింత యధికమైనట్లు మిషనరీలు 1856లో పార్లమెంటుకు పంపినమహాజరువలన విదితమయ్యెను. వారిట్లు వ్రాసిరి. "1853 లో పార్లమెంటు విచారణ జరిగిన తరువాత సంభవించిన అనేక సంగతులవలనను, ప్రకటింపబడిన అనేక గ్రంథములవలను వంగరాష్ట్రము నందలి ప్రజలస్థితి అధోగతిలో నున్నదను సంగతి మరింత స్పష్టముగా తెలిసినది. ఇదివరకు పంపిన మహాజరులో అసలు దేశములోనున్న నిజస్థితికన్న చాలాతక్కువ తీవ్రముగానే ఆ స్థితిగతులు వివరింపబడి యుండినట్లును బయల్పడినదనియు చెప్పిరి. వంగరాష్ట్ర లెఫ్టినెంట్ గవర్నరగు హాలీడే గారే పోలీసు వ్యవహారములను గూర్చియు, వంగరాష్ట్రము నందలి నేరవిచారణల పద్ధతినిగూర్చియు వ్రాసిన మినిట్సులో వంగరాష్ట్రమున చాలాకాలమునుండి పోలీసు వ్యవహారములు బాగుగాలేవని ప్రజలు మొరపెట్టుకొనుచునే యున్నారనియు, అయినను దానిని చక్కచేయుటకు జరిగిన ప్రయత్నములు బహు స్వల్పమని యంగీకరించినారు. దేశములో నన్ని ప్రాంతములందును బలవంతులు బలహీనులను సదా పీకికొని తినుచున్నారనియు, దేశములోని ఉద్యోగములు అధికారములు వానివలన సంపాదింప వీలుగల సొమ్మునుబట్టియే విలువ కలిగి యున్నవనియు, గ్రామపోలీసుల చౌకీదారు పద్ధతియొక్క స్వభా

వము, స్థితి, నిలుకడయు గడచిన యిరువదేండ్లలో క్రమ క్రమముగా క్షీణదశలోనికి వచ్చినదనియు, క్రిమినలు నేర విచారణచేయు కచ్చేరీలును ప్రజలవిశ్వాసమునకు పాత్రమగుట లేదనియు, అది సరియైనదైనను, కాకపోయినను, క్రిమినలు నేరవిచారణ యనునది సాధారణముగా నేరగానికే లాభము కలుగు జూద వ్యవహారమనుభావము దేశీయులలో వ్యాపించి యున్నదనియు, దేశములోనున్న ఐరోపావారుకూడా ఇట్లే తలంచుచున్నారనియు, ఘోరమైన నేరములు చేయువారిలో బహు స్వల్పసంఖ్యాకులను మాత్రమే పట్టుకొని విచారింతు రనియు, అట్లు విచారణ చేయబడువారిలో సగముమంది విడు దలయగు చుందురనియు, పరీక్షలయందు తేరినవారిని ఉద్యో గులుగా నియమింపక, ఇంగ్లాండులో కుంపిణీవారి డైరెక్టరుల ప్రాపకమువలననే కొందరి బంధుగులైన యువకులను సివిలు సర్వీసులో నియమించుటవలన నిక్కడ పనిచేయు మేజస్ట్రేటు లకు అనుభవముగాని, శక్తిసామర్థ్యములుగాని లేకపోవుటయు హెచ్చుచున్నదనియు బయల్పడినవి. ఇట్లు ప్రభుత్వ నివేదికల నుండియే కొన్ని సంగతులు చెప్పి, "బీదవారి కెంత యన్యా యము జరిగినను ఆలన పాలన జరిగి పరిహారములు కలుగుటను నాసలేదు. గ్రామము లందలి జనులలో తీవ్రమైన అసంతృప్తి యున్నదిగాని, చెప్పుకొనినను ప్రభుత్వము ఏమియు చేయదను భావముతో నోరుమూసికొనియున్నారు. ఇంతకాలమునుండి యును జరుగుచున్న ఈ యన్యాయము లింక నట్లే యుండు టయు, ప్రజలలో నిందువలన కలిగిన చెడ్డ ఫలితములను వారి బాధలను చూడగా, తమకు చాలా దుఃఖమును, భయమును కలుగుచున్న"దని మిషనరీలు వ్రాసిరి.

"ప్రజల బాధలను మాన్పుటలో నింకొక క్షణమైన జాగు చేసినచో, మాటదక్కదు. మాకు తెలిసిన అంశములనుబట్టి గ్రామ ప్రజలయం దశాంతి యనుదినము వృద్ధియగుచున్నది. వారి మనసులందు తీవ్రమైన ద్వేష భావము రగుల్కొనుచున్నది" అని వ్రాసి, అధికార పక్షపాత ముగాక, స్థానిక స్పర్ధలుగానిలేని స్వతంత్ర వ్యక్తులను ఒక ఉప సంఘముగా నియమించి, ప్రజలకుగల బాధలనెల్ల జాగ్రత్తగా విచారణ చేయించవలెనని కోరిరి.[1] ఇట్టి ఆంగ్లేయ ప్రభుత్వాభి మానులింత స్పష్టముగా చెప్పిన సంగతులును, చేసిన హెచ్చ రికలను కూడా కుంపినీ ప్రభుత్వమువారు పెడచెవిని బెట్టిరి.

భారతదేశ వ్యవహారములను గూర్చి ఇంక ననేకులు గ్రంథములందును, ఉపన్యాసములందును తీవ్రముగా విమర్శించి యుండిరి గాని, లాభము లేక పోయెను.

1833 లో హిందూదేశమునకు వచ్చి, కావేరికిని, గోదావరికిని ఆనకట్టలు కట్టి, "కాటన్ మహాఋషి" యని ప్రజలచే గౌరవింపబడిన సర్ ఆర్థర్ కాటన్‌గారు 1853 లో భారతదేశము విషయమై వ్రాసిన సంగతులను గూర్చి లండన్ టైమ్సు పత్రిక డిసెంబరు 12 వ తేదీన వివరించినది. "భారతదేశప్రజ లేల దరిద్రులుగా నున్నారు? ఏల ననగా వారికి మానవ పరిశ్రమకు బదులుగా పనిచేయుటకు ఎడ్లు తప్ప వేరేయంత్రసాధనములును లేవు. తమ పరిపాలకులగు ఆంగ్లేయులు భోగము లనుభవించుటకొరకు వీరు

[1] The Rebellion in India and How to Prevent Another–John Bruce Norton. [8–7–57] pp. 150–158

అమితశ్రమ పడవలసి యున్నందున, తమ కడుపునిండ కూడు, కట్టుబట్ట, నిలువనీడయు చేకూర్చుకొనుటయే కష్ట తరముగా నున్నది. ఇంగ్లాండు దేశ ప్రజలు తమ సౌకర్యము కొరకు పడు పాటుకన్న అక్కడ ఆవిరి, నీరు, రోడ్లు, కాలు వలు, రైళ్ళు, రేవులు, నౌకాశ్రయములు వారికి కలిగించు సౌకర్యములు హెచ్చుగా నున్నవి. భారతదేశమున నన్నియు ఉన్నవిగాని, అన్నిటికన్న పెద్దలోప మొక్కటే యున్నది. అది మన మా దేశము నాక్రమించి పరిపాలించుట మొదలిడి నప్పటినుండి ఇప్పటివరకును భారతదేశమును అవిద్యాంధ కారమునందుంచిన పెద్దలోపము."

"ఇంగ్లాండులో నున్నచో ఆ దేశమున తనకు గౌరవ ప్రదములని తలచు కార్యముల నన్నిటిని చేయు మానవుడే హిందూదేశమున సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వరకు తన జిల్లాలో శిస్తులనిర్ణయము, దాని వసూలు తప్ప వేరే కార్యమునుగూర్చియు ఆలోచింపకపోవుట ఆశ్చర్యము" అని కాటన్‌గారని నారు. పూర్వరాజు లీదేశములో నిర్మించిన కాలువలు, తటాకములు పల్లపు సాగునీటి వసరులును కుంపిణీ వారు బాగుచేయక పోవుటనుగూర్చి ఆయన తీవ్రముగా విమర్శించినారు. *

చాలకాల మీదేశమున పెద్ద ఉద్యోగములుచేసి పేరు పొంది, 'రాసమాల' యను గుజరాతు దేశపురాజుల కథలను రచియించిన అలెగ్జాండరు కీన్‌లోక్ ఫోరుబ్సు అను నాయన

---

* Life of General Sir Arthur Cotton- by his daugh- er, Lady Hope. pp. 186 - 198.

భారతదేశమున 1857 లో విప్లవము వచ్చుటకు ముందుగానే దేశమున జరుగుచుండిన దుష్పరిపాలనమును గూర్చియు, దేశీయుల నందరినీ ఒకేతరగతి క్రిందికి సామాన్యస్థితిలోనికి తెచ్చుటనుగూర్చియు, దేశీయ రాజులలోను, ప్రజలలోనుగల అశాంతిని గూర్చియు "బొంబాయి క్వార్టర్లీ రివ్యూ" పత్రిక కనేక వ్యాసములను వ్రాసియుండెను. అందు ముఖ్యముగా దేశములోని ఆంగ్లేయ సివిలు మిలిటరీ ఉద్యోగులందు జాత్యాహంకారము ప్రబలి, దేశీయుల ఆచారములపట్ల నిరసనమును చూపుచు వారి మనసులకు నొప్పి కలిగించుటను గూర్చియు వెల్లడించిరి. (బొంబాయి క్వార్టర్లీ vi సం॥ పుట 139).

భారత దేశ పరిపాలనమునుగూర్చి 1858 సంవత్సరము జూన్ 24 వ తేదీన పార్లమెంటుసభలో జాన్ బ్రైటుగారిట్లుపన్యసించిరి. "భారతదేశమునం దిపుడు మనకు కనబడు లోపము లేమి ? భారత దేశ ప్రజలే నా ముఖతా మీకు చెప్పుకొనుచో, వారేమని మొరపెట్టుదురో మీకు తెలియునా ? ఈ సభవారికి వారిట్లు మొఱ పెట్టుకొందురు :— ప్రతి రాజధానిలోను, అందు ముఖ్యముగా ఆంగ్ల పరిపాలనముక్రిందికి చిరకాలము క్రిందటనేవచ్చిన రాష్ట్రములలో దేశప్రజలలో అధికసంఖ్యాకులుగానున్నట్టి భూములు దున్నుకొను రైతులు ఘోరమైన దారిద్ర్యమున మునిగియున్నారు. చాలా దీనావస్థలో నున్నారు. చాలాబాధలు పడుచున్నారు. పదేండ్లక్రిందట నీ సభవారు నియమించిన

---

§ Introduction to 'Rasmala' — By Alexandar Kinloch-Forbes Oxfor University Press. pp. XI-XII.

ప్రత్తి పంటనుగూర్చిన విచారణ సంఘమువారి నివేదికనుండి ఇదివరకనేకమారు లిక్కడ పెక్కుసంగతులు చెప్పియున్నాను. ఆ సంఘములో కుంపిణీ డైరెక్టరులు చాలామంది సభ్యులుగా నుండిరి. ఇక్కడ నేనుచెప్పిన సంగతు లెల్ల వా రంగీకరించినవే. ఆ సంఘమువారు బొంబాయి, చెన్నపట్టణ రాజధానులను గూర్చి మాత్రమే విచారించినను తక్కిన ప్రదేశములందు గూడ అట్టి స్థితిగతులే యున్నవి.

భారతదేశ ప్రజల బాధలను గురించి నే నిప్పుడు మీకు మరల చెప్పదలచినచో, ప్రపంచములో నింక నే దేశములోను లేనంత ఎక్కువపన్నులీ భారత దేశమున విధింపబడుచున్నవని చెప్పవలసియున్నది. నాగరికత గల క్రైస్తవ ప్రభుత్వము క్రింద కొంతకాలమైన నున్న ఏ దేశమునందును కానరాని విధముగా నీదేశమునవారిశ్రామికాభివృద్ధిని ప్రభుత్వమువా రుపేక్షించినారని చూపగలను. హిందూదేశములో పనిచేసిన ఉద్యోగుల వ్రాతలనుండియు, వంగరాష్ట్రమున గవర్నరు పనిచేసిన హాలీడేగారి వాక్యముల నుండియు నే నీ సంగతిని చూపించగలను. ఉదాహరణమునకు నాగరికత కలదని నటించు ఏ దేశములోను వంగరాష్ట్రము నందలి పోలీసు పరిపాలనలో కనబడు స్థితిగతులకు ఏ కాలము ననుకూడ పోలికలు కనబడవు. ఇక న్యాయ విచారణచేయు కోర్టుల విషయమున గూడ నే నీ సంగతినే చెప్పగలను. కుంపిణీవారికి స్నేహితులుగనుండి వారిపట్ల పక్షపాతబుద్ధితో వారి కనుకూలముగా వ్రాసినవారి పుస్తకములయందుగూడ యీ దేశములో ఇంగ్లీషు కోర్టులు వృద్ధియగుచున్న కొలదియు అబద్ధపుసాక్ష్యములును అందువలన న్యాయపరిపాలనమునందు

ప్రవేశించు నష్టములును ఆ రాజధానులలో వృద్ధి యగుచున్న వని వ్రాసియున్నారు. ఇక ప్రజా సౌకర్య నిర్మాణము (పబ్లిక్ వర్క్సు)లనుగూర్చి చెప్పవలసినచో, యావద్భారత దేశమునం దంతటికన్నను ఈ ఇంగ్లాండు దేశములో నొక్క చిన్న జిల్లాలోనే రాకపోకల కనువైనరోడ్లు ఎక్కువగా నున్నవన్నచో, హిందూ దేశమునందవి ఎంత మృగ్యములో తెలిసికొనవచ్చును. ఈ తూర్పుఇండియా కుంపిణీప్రభుత్వము ఆ విశాల భారత దేశమున అన్నిరకములైన ప్రజా సౌకర్యముల కొరకు 1834 మొదలు 1848 సంవత్సరము వరకు గతించిన పదునాలుగేండ్లలో వ్యయముచేసిన సొమ్ముకన్న మన దేశమున ఒక మాంచెస్టర్ నగరమందు కేవలము ఒక్క మంచినీటి సదుపాయము కొరకే ఎక్కువ సొమ్ము వ్యయము చేయబడినదని చెప్పినచో ఆ దేశమునందు ప్రజ సౌకర్యముల కెంతస్వల్పపు మొత్తము వెచ్చింపబడెనో తెలియగలదు. భారతదేశమును పరిపాలించు ప్రభుత్వము నింతవరకు చేయుచుండిన ప్రధానకార్యము రాజ్యాక్రమణము చేయుట, రాజ్యాక్రమణముకొరకు యుద్ధములు చేయుచుండుట మాత్రమే. భయంకరమైన సైనిక విప్లవము వచ్చి, పార్లమెంటువారు కన్నులు తెరచి, భారత దేశ సమస్యా విషయమున నీ సభవారు శ్రద్ధవహించుట తటస్థించినదిగాని లేనిచో, నింక నీ యన్యాయము లిట్లే జరుగుచుండియుండును. ఈ భారత దేశ ప్రభుత్వములోని ఇంకొక లోపమును బేర్కొనవలె నన్నచో నది, యక్కడ అమలులో నున్న అర్థపద్ధతియె. ఈ భారత దేశ ప్రజలనుండి పిండుటకు వీలైన మొత్తముకన్నను వారిని పరిపాలించుటకొరకు చేయబడు ఖర్చు అధికమైనది” అని బ్రైటుగా రుద్ఘోషించిరి.

# విప్లవాగ్ని

**1842** వ సంవత్సరము మొదలు చెన్నపట్టణమున సుప్రీముకోర్టులో బారిష్టరుగా పనిచేసి, తరువాత అడ్వొకేటు జనరలైన జాన్ బ్రూస్ నార్టనుగారు భారతదేశ స్థితిగతులను గూర్చి 1857 లో "భారతదేశమున తిరుగుబాటు ఇకముం దట్టిది రాకుండచేయు టెట్లు ?" అను నొక గ్రంథమున నిట్లు వ్రాసిరి. "హిందూదేశములోని ప్రజాసంఘములో మనలను హృదయపూర్వకముగ ద్వేషించు పలుకుబడిగల జనసంఖ్య చాలాకలదు. తమ సామ్రాజ్యమును నాశనముచేసి, తమ్ములతల క్రిందుచేసితి మనుకోపమును, కాఫరులమను ద్వేషమును మహమ్మదీయులకు కలదు. అంత తీవ్రముగను బహిరంగముగను కాకపోయినను, తమకు పలుకుబడిపోయినదను కోపముతో బ్రాహ్మణులు మనలను ద్వేషించుచు. లోలోపల కుట్రలుచేయు చున్నారు. దేశములో తమ ప్రాముఖ్యతపోయి, ప్రజలను పీడించి తాము పొందుచున్న లాభములు పోయినవని, గొప్ప కులమువారుమన పైనకోపముగనున్నారు. పెద్దజమీందారులు భూస్వాములు తమ యెస్టేటులు పోయినవని దుఃఖించు చున్నారు. వీరి నాశ్రయించి తిరుగువారు తమ జీవనములు పోయినవని విచారించుచున్నారు. దేశములో పూర్వకాలము నుండియు ప్రత్యేకమైన సౌకర్యముల ననుభవించుచున్న

ధనవంతులగు భూస్వాముల జనసంఘమువారును మనయందు విరోధించియున్నారు. అత్యధికమైన శిస్తువసూలును క్రూరముగ చేయుచు తమ వ్యవసాయ వ్యవహారములకు తరచుగా భంగము కలిగించుచున్నామనియు, దేశమును కోర్టువ్యాజ్యములలో ముంచుచున్నామనియు, న్యాయపరిపాలన పద్ధతిలోని లోపములును, పోలీసువారి లంచగొండితనమును, వారు అబద్ధపు నేరములను మోపి ప్రజలను పీడించుచున్నారనియు, ప్రజల ప్రాణములను, ఆస్తులను దౌర్జన్యములనుండి రక్షింపలేక పోవుచున్నారనియు ప్రజలు అసంతృప్తితో గొణుగుకొనుటకు కారణము లగుచున్నవి.

స్వదేశరాజులతో మనము జేసిన సంధిషరతులను బహిరంగముగ భంగపరచుచు మనము ప్రజలకు భయాశ్చర్యములు కలిగించితిమి. మన ధర్మమునందు వారికి అపనమ్మకము కలిగినది. వివిధ తరగతి ప్రజల మనస్సులు విరిగినవి.

ప్రజల క్షేమము నాలోచింపక, కేవలము స్వప్రయోజనముకొరకే పరిపాలించుట ప్రారంభించితిమి. మొన్న మొన్నటివరకు వారినుండి వీలైనంత శిస్తును రాబట్టుటకు మాత్రమే ప్రయత్నించితిమి. ఈ దేశప్రజల కింకనుగల అనేకమైన చిన్నచిన్న బాధలు కలిసి, వారియందు అసంతృప్తిని, విరోధభావమును పెంచుచున్నవి.

చెన్నపట్టణమున ప్రకటింపబడుచున్న "ఎతేనియం" పత్రికలో నీ స్థితిగతులనుగూర్చి ఉత్తర హిందూస్థాన వాస్తవ్యుడగు నొక అనుభవజ్ఞుడు వ్రాసిన లేఖ నీ క్రింద ఉదాహరించుచున్నాను. "దేశమునం దంతటను బ్రిటిషు ప్రభుత్వముపట్ల

విరోధభావము ప్రబలియున్నది. ఇది కులభేదమునకు, మత ధర్మమునకు సంబంధించినది కాదు. క్రొవ్వుపూసిన తోటాలకు గల అభ్యంతరమనునది యీ విప్లవమున కొక నెపముగాని, నిజముగా మహమ్మదీయులు, హిందువులుగూడ సమానముగానే ఈ విప్లవమునకు సంసిద్ధులైరి. ఈ విరోధభావమునకు నిజమైన కారణము దేశములోని దుష్పరిపాలనము, కంపెనీవారి యంగీకారముతో డల్హౌసీప్రభువు ప్రారంభించిన రాజ్యాక్రమణ విధానము. తమ స్వదేశరాజుల పరిపాలనకన్న మన ప్రభుత్వమునే పలుకుబడిగల భారతీయులు వాంఛించుచున్నారను మాట సత్యమునకు విరుద్ధము. ఇది చాలా పొరపాటు మాట.

ఈ అన్యాయమింతటితో ఆగలేదు. సర్వభక్షణవిధానము పైనుంచి క్రిందికి ఒక తరగతినుండి ఒక తరగతికి- సామాన్య ప్రజ లందరివరకును దేశములోని ప్రతి యకరమువరకును ప్రాకినది. మహారాజుల రాజ్యములను తుడిచివేయుటతో మనము తృప్తిచెందలేదు. వీలైనప్పుడెల్ల పాళెగారుల పాళెము లను, జమీందారుల జమీనులను నశముచేసికొంటిమి. ఇంతటితోనైనను మనము తృప్తిచెందక, పూర్వకాలమునుండి పన్నులు లేకుండా అనుభవించుచు ప్రత్యేకహక్కులును బాధ్యతలునుగల యీనాముదార్ల యీనాములనుగూడ తీసివేసితిమి. ఇట్లు దేశములోని భూమినంతటిని ఆక్రమించి, మనమే సర్వాంసహా భూస్వామిగా కాదలచితిమి. దీనిఫలితమే ప్రజలకు మనపట్ల కలిగిన విరోధభావము. హిందూదేశంలో బాధలేనివ్యక్తిగాని, లేదా, తనకు బాధలేదని తలచు వ్యక్తిగాని కనబడుట లేదు. అతని యీనామును కంపెనీవారు లాగివేసి యుండవచ్చును;

లేక, ఒక కోర్టువ్యాజ్యములో నాతడు నష్టపడియుండ వచ్చును. అబద్ధపు నేరములను మోపుటవలన బాధనంది యుండవచ్చును; ఒకొ్కకప్పుడు హత్యానేరముగూడ మోపబడి యుండవచ్చును. కేవలము కక్షసాధించుటకు మేజస్ట్రేటు ఇతనిని బయటకు లాగి, చెరసాలయందు పడవేసి యుంచవచ్చును; ఇతని ఇంటిలోనికి బలవంతముగ చొరబడి యుండవచ్చును; నిష్కారణముగా నీతనిని జామీనుదారులను తెచ్చుకొనుమని నిర్బంధించి యుండవచ్చును, లేదా ఇతడు దోపిడిదొంగల గుంపువలన సర్వస్వమును పోగొట్టుకొనగా, ఈతని బాధను తీర్చువారు లేకపోవచ్చును; ప్రభుత్వ అవసరములకొరకీతని యాస్తిని సర్కారు వశముచేసికొని యుండవచ్చును. ఆదారిని పోవుచున్న పటాలముల యుపయోగముకొరకితని బండి యెడ్లు కూడ యెక్కడికో పంపబడి మరలివచ్చునను నాసలేక పోవచ్చును. సర్కారుకొరకు ఇతడు చేసిన పనికిగాని, ఈతడు సరఫరాచేసిన వస్తువులకుగాని రావలసినసొమ్ము పరిష్కరింపబడక కాలహరణము జరుగుచుండవచ్చును. ప్రజలకొరకు నిర్మింపబడు ఆనకట్టలు మొదలైన పబ్లికువర్క్సుకొరకితడు వెట్టిచాకిరీ చేయుటకు నిర్బంధింపబడియుండవచ్చును. కలెక్టరు ఇతని భూమి నొక్కగీటుతో ఇంకొకని వశము చేసి, సివిలు కోర్టులో దీర్ఘమైన బాధను కలిగించు వ్యాజ్యముపాలు చేసి యుండవచ్చును. దేవాదాయ వ్యవహారములందితనికి వివాదము కలిగి, పైకి అప్పీలుచేసికొనుటకు న్యాయవిచారణ సంస్థ లేకుండపోవచ్చును. రివెన్యూ అధికారులగు శిరస్తాదారుగాని, తహసీల్దారుగాని ఈతని నేదో చిక్కులో పెట్టి యుండ

వచ్చును. ఎట్టి సాక్ష్యము లేకుండగను ఉన్న సాక్ష్య నిదర్శన మునకు వ్యతిరేకముగనుకూడ క్రిమినలుకోర్టువా రీతనిని శిక్షించి యుండవచ్చును. ఇట్లు ప్రజలకుగల నానావిధములైన బాధలు ఈ దేశములోని పరిపాలనాపద్ధతి బలహీనమై చలనములేని స్థితిలో నుండుటకు నిదర్శనముగా నున్నవి.

భారత దేశములోని ప్రజలు అజ్ఞానులుగ లేరు. విద్య నానాటికీ వృద్ధియగుచున్నది ప్రజలలో మంచిచెడ్డలను గూర్చిన విచక్షణజ్ఞానము వర్థిల్లుచున్నది. అభిప్రాయములు, విమర్శనజ్ఞానము, విషయనిర్ణయము పొడసూపుచున్నవి. అయి నను నూరు సంవత్సరములక్రిందట మనము జయించినప్పుడు పిల్లలవంటి పిరికివారై అశక్తులై, అజ్ఞానులైన ప్రజలను చూచినట్లే నేటి ప్రజలను చూచుచున్నాము

వార్తాపత్రికల ప్రకటనము వృద్ధియగుచున్నది. ఏ వ్యవ హారముగాని రహస్యముగా నుంచుట కష్టతరమగుచున్నది. సత్ప్రభుత్వ లాభముల విషయమున మనయందుగల లోపములు విద్యావిధానము, న్యాయపరిపాలన చక్కగ లేకుండుట ప్రజలు గ్రహించుటలేదని మనము అనుకొనుచున్నాము.

మనలను పరీక్షించుటకువలసిన సాధనములను వారి కిచ్చియుంటిమి. అవి వారుపయోగింపరని తలచుట పొర పాటు. ఇది నమ్మనివారెవరైన నున్నచో ప్రపంచములో వార్తాపత్రిక నిర్వహణమునం దేవిషయముననుతీసిపోక సూక్ష్మదృష్టితో, మంచి ఆలోచనతో వ్రాయుచున్న బ్రాహ్మణు డొకడు (కలకత్తాలో హరిశ్చంద్ర ముఖర్జీగారు) హిందూ పేట్రియట్ పత్రికలో వ్రాయుచున్న సంపాదకీయ వ్యాసములను చూడవచ్చును.

ప్రజలలో కలిగిన రాజకీయ పరిజ్ఞానము, ధర్మశాస్త్ర జ్ఞానము, సర్వమానవ సమానత్వభావమును దేశపరిపాలనమునందు పాల్గొనుటకుగల వాంఛయు, రాజకీయ స్వాతంత్ర్య వాంఛయు రాజకీయ హక్కులను ప్రజలు గట్టిగ కోరుచుండుటను చూపుచున్నవి. ఈ విషయములో అనుమానమున్న వారెవ్వరైననున్నచో, భారతదేశ జనసంఘమునందు వృద్ధియగుచున్న వార్తాపత్రికా పాఠకుల సంఖ్యను గమనించవచ్చును దేశీయ వార్తాపత్రికల స్వభావమును గమనించవచ్చును. వీనిని అణచివేయుమని ఒక వంగరాష్ట్ర జర్నల్ కోరునంత తీవ్రముగ నివియుండుట చూడవచ్చును. అల్పజ్ఞానమువలన చాల నష్టములు గలవు. విద్య పరిపూర్ణముగ అభివృద్ధిచేయుట అవసరము. వారికి జ్ఞానమే గాక, వివేకముకూడ కలిగించి, వారియందు సరియయిన దృక్పథము కలిగించవలెను.

అన్నిటికన్న ముఖ్యముగ న్యాయ విచారణయందు ఆంగ్లేయులకుగల ప్రత్యేకాధికారములను తీసివేయుటకు చేయనుద్దేశించిన క్రొత్త చట్టముల విషయమై కలకత్తాలో జరిగిన దేశీయ ప్రజల మహాసభయు, దానిలో నివ్వబడిన మహోపన్యాసములను చూచినచో, ఈ ప్రజల మనస్సునందు మహత్తరమైన మార్పు ఒకటి కలిగినదని తెలియగలదు. §

---

§ కలకత్తా ప్రెసిడెన్సీలో 1851 నుండి ఇట్టి గొప్ప సభలనేకములు జరుగుచుండెను. కంపెనీవారి ప్రభుత్వ విధానము నతి తీవ్రముగా విమర్శించుచుండిరి. 1853 కంపెనీ వారికి మరల క్రొత్త పట్టానిచ్చినప్పుడు అసమ్మతిని తెలుపుటకు 29-7-1853 తేదీన జరిగిన సభకు పదివేలమంది వచ్చిరని అంచనావేసిరి. అక్కడ చాలా తీవ్రమైన ఉపన్యాసములివ్వబడెను.

వారు దీర్ఘాలోచన చేయుచున్నారని, పాశ్చాత్య మనో భావములనుబట్టి పౌరులకుగల హక్కులెట్టివో కూడా వారు ఆలోచించుచున్నారని, వానిని స్పష్టముగా గ్రహించి రని తమ వాదనలను అనర్గళముగను, తిరుగులేనట్లుగను చేయగలుగుచున్నారనియు తెలియగలదు. గతకాలమున మనము వారికన్న శ్రేష్ఠుల మనియు తాము నిగ్రహింపలేని అధికారబలము కలవార మనియు, పొరపాటుగా తలంచుచు నీ ప్రజలు మనకు లోబడియుండిరిగాని, మన సంగతి వారికి తెలిసినకాలమదియు నీ పొరబాటును గ్రహించి తమ హక్కులను స్థిరపరచుకొన జూచుచున్నారు." §

సిపాయిల విప్లవమని చెప్పబడు భారతదేశ స్వాతంత్ర్య యుద్ధము వచ్చుటకుముందు కొన్ని నెలల క్రిందటనే నార్టను గారు పచ్చయప్ప కళాశాల 14 వ వార్షికోత్సవములో నుపన్యసించుచు దేశీయుల యందు గొప్పమార్పు కలుగు చున్నదనియు, దేశములోనున్న ఐరోపావారి కళ్లయెదుటనే ఆ క్షణముననే యీ మహత్తరమైన పరివర్తనము దేశీయుల మనస్సులందును, శీలమునందును కలుగుచున్నదనియు, దాని నిదర్శనములు స్పష్టములై అగ్నిలో చిత్రింపబడిన అక్షరము లలో లిఖియింపబడి యున్నవనియు, ఈ భయంకరమైన హెచ్చరికను గమనింపకుండ కండ్లుమూసికొనినచో, తమ గతి ఏమగునో తెలియదనియు చెప్పియుండిరి. *

---

§ The Rebellion in India; How to prevent another By John Bruce Norton. pp. 192—197 (8-7-1857).

* Ibid p. 192. Educational speehes of the Hon. John Bruce Norton (1870) page 55.

ఇంగ్లీషువిద్య నేర్పడంవల్ల దేశీయులు సులభంగా క్రైస్తవు లయిపోతారని మిషనరీలును, వారి అభిమానులును అనుకున్నారుగాని అలాగ జరగలేదు. చదువుకొన్న వారిలో తమ మతాచారాలమీద అభిమానం తగ్గి శుష్క వేదాంతం హెచ్చిందేగాని, క్రైస్తవమతంలో కలియ డానికి యిష్టం కలగలేదు. అందువల్ల ఆ మతం అను కున్నంత అభివృద్ధి చెందలేదు. ఇది క్రైస్తవ మతాభిమాను లకు ఆశాభంగం కలిగించింది. చిన్నప్పుడు యథేచ్ఛగా సంచ రించి ముసలితనంలో వేదాంత చర్చలతో కాలక్షేపంచేస్తే ముక్తివస్తుం దనుకునేవారిలాగి నే, ఇతరులను తమ మతంలో కలపడానికి ప్రచారంచేస్తే తమకు ముక్తివస్తుందనే అభిప్రాయం ఇంగ్లాండులోని క్రైస్తవులలో ప్రబలివున్నందువల్ల శాంతి సమ యంలో సైన్యంలోవుండే హిందూ మహమ్మదీయులు తీరికగా వుంటారు గనక వారిలో మత ప్రచారంచేసి క్రైస్తవులుగా చెయ్యాలని కొందరు దొరలు మెల్లగా సైన్యంలో వుద్యోగా లలోచేరి ప్రచారం ప్రారంభించారు. హిందూ మహమ్మదీయ సైనికులు, హావల్దారులు మొదలైనవారు మర్యాదకోసం కొంత కాలం వీరి విమర్శలూ, దూషణలూ వింటూ సహించి వూరు కున్నారు. వీరి మతబోధలు వారి మనస్సుకు ఎక్కకపోయినా వారు వూరుకోవడంచూచి ఈ క్రైస్తవ మతాధికారులు విజృంభించారు. హిందూ మహమ్మదీయ మత సిద్ధాంతాలను నోట వచించరానట్లు తిట్టడం ఎక్కువ అయింది. సైనికులలో అశాంతి కలిగింది. క్రైస్తవులైనవారికి పెద్దవుద్యోగా లిస్తా మనీ, ఇతర విధంగా బహూకరిస్తామనీ, ఈ కపట సైనికాధి

కారులు మత ప్రచారంచేయగా, దేశీయసైనికులలో తీవ్రమైన అసంతృప్తీ, అసహ్యమూ కలిగాయి. ఈ ప్రచారకులు రాత్రింబవళ్లుచేసే మతబోధలూ ఎంతోసొమ్ము ఖర్చుపెట్టి హిందూ మహమ్మదీయ మతాలను దూషిస్తూ వ్రాసిన పుస్తకాలను విరివిగా అచ్చువేయించి పంచిపెట్టడమూ చూసి ఈ ప్రచారానికి ఈ విదేశకుంపినీ ప్రభుత్వంకూడా మద్దతు చేస్తూవున్న దనే భావం సైనికులలో వ్యాపించింది. వీరు ప్రజలను మతభ్రష్టులుగా చేయదలచినారనే భావము, భయము ఎక్కువ అయింది. 1857 లో జరిగిన శిపాయీల విప్లవానికి కారణాలలో ఇది ఒకటి అని అప్పట్లో వ్రాయబడిన పుస్తకాలలో వుదాహరింపబడి వుంది.

18-8-1857 వ తేదీతో కలకత్తానుంచి 'ఒక బంగాళీ హిందువు' అనే మారుపేరుతో ఒకాయన వ్రాసిన భారతీయ విప్లవకారణములు (Causes of the Indian Revolt) అనే చిన్న పుస్తకాన్ని ఎడ్వర్డు స్టాన్ ఫర్డు అనే అతను లండనులో ప్రకటించాడు. కొంతకాలం చెన్నపట్నం "సదరు" కోర్టులో రెండవ న్యాయాధిపతిగావుండి నిష్పక్షపాతిన్నీ, ధైర్యశాలిన్నీ అని పేరుపొందిన మాల్కలం లెవిన్‌గారు ఆ పుస్తకానికి పీఠిక వ్రాశారు.

"భారతదేశీయుల మతాచారాలతో ప్రభుత్వంవారు జోక్యం కలిగించుకోలేదనిన్నీ, ఇకముందుకూడా జోక్యం కలిగించుకోరనిన్నీ విప్లవం ఆరంభంకాగానే గవర్నరు జనరల్ గారు ఒక ప్రకటన చేశారు. అదివరకు జోక్యం కలిగించుకోలేదనేమాట సర్వాబద్ధమని యావద్భారతదేశమూ ఏక

గ్రీవంగా ఘూోషించింది. ఇదివరకు చేసిన వాగ్దానా లన్నింటినీ వుల్లంఘించినవారు ఇకముందు తమ వాగ్దానం చెల్లించు కుంటారని నమ్మక మేమిటని ప్రతివారూ ప్రశ్నిస్తున్నారు" అని ఆ చిన్నగ్రంథములో వ్రాయబడినది.

గ్రంథం పీఠికలో మాల్కంలం లెవిన్‌గారు యిలా వ్రాశారు: "భారతదేశాన్ని పరిపాలించే మన బ్రిటిషు వారికిన్నీ, పాలితులైన భారతీయులకున్నూ ఒకరి ఆచారాలు ఒకరికి తెలియనే తెలియవు. మనకూ, వారికీ వుండే సంబంధం బానిసల యజమానికీ, బానిసలకూవుండే సంబంధమే. దేశ ప్రజలకు జీవితేచ్ఛను కలిగించే సౌకర్యాలన్నింటినీ వారికి మనం లేకుండాచేశాము. మానవ ధర్మాన్నిబట్టి వారికుండ వలసిన అవకాశాలు లేకుండా చేశాము. వారి వర్ణాశ్రమ ధర్మాలను దూషించాము. వారి వారసత్వ ధర్మాన్ని రూపు మాపాము. వారి వివాహ సంస్కారాలను మార్పుచేశాము. వారి మతధర్మాలనుబట్టి వారు పవిత్రంగా యెంచుకునే కర్మలను తృణీకరించాము. వారి దేవాదాయాలను లాగి వేశాము. మన ప్రభుత్వ కలివెలలో వారిని క్రైస్తవేతరులైన పరాయివారిగా పరిగణించాము. దేశీయరాజుల రాజ్యాలు లాక్కున్నాము. జమీందారుల జమీలను తీసుకున్నాము. మన పన్నుల పద్ధతివల్ల దేశముయొక్క ఆర్థికవ్యవస్థనే తారుమారుచేశాము. ప్రజలను చిత్రహింసలుపెట్టి బల వంతంగా పన్నులు వసూలు చేయించాము. ప్రపంచంలో కల్లా పురాతనమైన గౌరవ కుటుంబాలను, వంశాలను కూకటివ్రేళ్ళతో పెల్లగించి పంచములస్థితికి దింపినాము.

ఇలాంటి మార్పు మన ఇంగ్లాండు దేశంలోనే కలిగితే, ఇంగ్లాండులో ప్రభువుల కుటుంబాలన్నా, వంశాలన్నా గాఢమైన అభిమానముకలిగి, క్రైస్తవ మత వ్యాప్తిని చేసే పట్టుదల కలిగియున్న షాఫ్ట్సుబరీ ప్రభువుమనసులో ఎలాగవుండేదో ! ఈ గ్రంథకర్త వ్రాసిన సంగతులలో చాలావాటితో నేను ఏకీభవిస్తూవున్నా దేశీయులపైన పగ తీర్చుకోవలసినదని పలుమారు హెచ్చరించడమూ, వర్ణాశ్రమ ధర్మాలపైన కత్తిగట్టడమూ, ప్రజలను క్రైస్తవ మతంలో కలుపడానికి ప్రయత్నించవలసిందని వ్రాయడమూ, నాకు బాగాలేదు. హిందువుల సంగతి బాగా ఎరగనివాళ్ళూ, అనేక శతాబ్దాలకు పూర్వము - అనాగరిక దేశముగా తప్ప ఇతర విధంగా ఇంగ్లాండుపేరు ప్రపంచానికి తెలియనికాలం నాటినుంచీవున్న హిందూ దేవాలయాలను చూడనివాళ్ళూ మాత్రమే ఆ పురాతన దేశపు హిందూమత సిద్ధాంతాలు స్థిరమైనవి కావని భ్రమ పడతారు. ఇంగ్లాండు చేసే ప్రయత్నాలవల్ల ఆ మతాన్ని విచ్ఛిన్నం చేయవచ్చునని అనుకుంటారు, వానిని చూసినవారు మాత్రం అలాగ అనుకోరు."

"ఒక వృక్షముయొక్క ఫలాలనుబట్టిదానిసంగతి తెలుసుకోవచ్చునని ఒప్పుకొంటే ఒకే నీతినియమాలనుబట్టి ఇంగ్లాండునూ, హిందూదేశమునూ పోల్చిచూస్తే వారిమతం మన మతానికి ఏవిధంగానూ తీసికట్టుకాదని తెలుస్తుంది."

1857 వ సంవత్సరపు విప్లవానంతరము పార్లమెంటువారు మేలుకొని పూర్వం ప్రజలిచ్చుకున్న అర్జీలన్నీ చిత్తగించారు. కుంపినీవారి పరిపాలనను రద్దుచేసి ఇంగ్లీషురాణీ

మకుటంకింద, తమ అధికారంకింద దేశపరిపాలన జరిగేటట్లు శాసించారు. ఆంగ్లేయ కుంపినీవారి దుష్పరిపాలన ఫలితముగా ప్రజలకుగల కష్టాలే ఆ విప్లవానికి కారణాలని వారు గ్రహించారు. అందువల్లనే ఆ కష్టాలన్నీ ఇకముందు నివారిస్తామని అనేక వాగ్దానాలుచేస్తూ విక్టోరియారాణిచేత 1858 వ సంవత్సరం నవంబరు 1 వ తేదీన ఒక ప్రకటన చేయించారు.

క్రైస్తవ మతప్రచారాన్ని గురించి ప్రజలలో వ్యాపించియున్న అసంతృప్తిని సముదాయించడానికి అప్పుడు విక్టోరియాచేత పలికించినమాట లివి :— "క్రైస్తవ మతధర్మాలు సత్యమైనవని మేము సంపూర్ణ విశ్వాసం కలవారమైయున్నా మా మతాన్ని స్వీకరించవలసిందని ఇతరులను మేము బలవంతం చేయడానికి మాకు హక్కువున్నదని మా తలంపు కాదు. అలాంటికోరిక మాకు లేదు. ఏ మత విశ్వాసం గలవారికిగాని, ఏ ఆచారాలు గలవారికిగాని మేము అధికాదరణనుగాని, అనాదరణనుగాని చూపించము. అందరినీ సమానంగా చూస్తాము. శాసనధర్మాలయొక్క సంరక్షణను అందరూ సమానంగా పొంది, సుఖంగావుండవచ్చును. మాకింద అధికారం వహించేవా రెవరూమా ప్రజల మతాచారాలలో ఏవిధమైన జోక్యమూ కలిగించుకోగూడదు. అలా చేసినవారు మా అనుగ్రహానికి పాత్రులు కాజాలరని హెచ్చరిస్తున్నాము. ఏ జాతిమతాలకు జెందినవారైనా తగినవిద్య, సమర్థత, నమ్మకము కలిగివున్నవా రందరికీ, నిష్పక్షపాతంగా మా కొలువులో వుద్యోగా లివ్వడమే మా వుద్దేశ్యము."

భారతదేశ చరిత్రలో 1857 పూర్వరంగము లందుద్భవించిన ఈ విప్లవాగ్ని భారతదేశమున ప్రజలలో అన్ని వర్గముల లోను వ్యాపించి, ప్రజ్వలించి తమ మతధర్మములకు, సంస్కృతి సంప్రదాయములకు అర్థసంపదకు భంగము కలిగించుచుండిన ఇంగ్లీషుకుంపినీ రాజ్యమును కూలద్రోయుటకై 1857 లో చేసిన జాతీయ స్వాతంత్ర్య సమరముగా పరిణమించినది.

జై హింద్.



# BIBLIOGRAPHY

England and India – An Essay on the Duty of the English men to the Hindoos – Baptist Wriothesly Noel (1859).

Vernacular Education in Bengal and Bihar – The Madras Journal Education – October 1868.

Memories of Madras – (Sir) Charles Lawson.

English works of Raja Rama Mohan Roy.

Life of Alexander Duff – George Smith. 2 Vols. (1879).

The Autobiography of Maharshi Debendranath Tagore.

Life and Letters of Sir Thomas Munro. (3 Vols.) – Gleig (1830).

Manual of Administration of the Madras Presidency, C. D. Maclean.

A Journal of the Life of the Vennelacanty Soob Row (1872).

The Madras Tercentenary celebrations Commemoration Volume.

Rudimentals–George Norton (1841).

True Yoke fellows in the Mission field - Life and labours of Rev. John Anderson and Robert Johnston of the Free Church Mission Madras (1862). Rev. John Braidwood, M. A.,

Representative men of Southern India – G. Parameswaran Pillai (1896).

Representative Indians – G. Parameswaran Pillai (1897).

India as it ought to be – William Hough (1853).

The Modern History of Indian Chiefs, Rajahs, Zamindars etc. Lokenath Ghose (1881).

Modern India – George Campbell (1852.)

Cases Illustrative of Oriental life, decided by the Supreme Court of Bombay - Sir Erskine Perry (1853). S. Sweet, London.

Rise and Growth of the Congress-By. C. F. Andrews and Girija Mukerjee.

India in the Victorian Age – R. C. Dutt.

Biography of Dadabhai Naoroji, – R. P. Masani.

Condition and Requirements of the Madras Presidency, being a letter to the Joint Secretary, Board of Control - By John Bruce Norton (1854).

The Bengal Orators compiled for the National Guardian, Calcutta.

Rajendralal Mitra's Speeches – Jogeswar Mitra, S. K. Lahiri & Co., Calcutta.

Rise and Fulfilment of British Rule in India– Edward Thompson and G. T. Garratt.

Minutes of Sir Thomas Munro.

Rasmala – Alexander Kinloch–Forbes.

Life of General Sir Arthur Cotton – Lady Hope.

Forty Years of Progress - Srinivasa Raghava Iyengar.

Notes on Indian Affairs - The Hon. Frederick John Shore. (1838) 2 Vols.

The Rebellion in India, How to prevent another - By John Bruce Noron (1857).

The causes of the Indian Revolt – By "A Bengalee Hindoo" (1857).

Bishop Heber's Journal (3 Vols.) (1828).
Educational Speeches of the Hon. John Bruce Norton (1870).
History of India – Sir John Malcolm.
"Christianization of India." Extracts from various sources.

*Edited by:*
**D. V. SIVARAO**

[The Immortal Message, Bezwada. Reprint 1940]
కాశీయాత్ర చరిత్ర – ఏనుగుల వీరాస్వామయ్య.
(3 వ ముద్రణము.)

మన చెన్నపట్టణము, దాని పూర్వచరిత్ర – దిగవల్లి వేంకట శివరావు. ఆంధ్రపత్రిక వృష సంవత్సరాది సంచిక (1941).

ఇంగ్లీషు చదువుల చరిత్ర – కృష్ణాపత్రికలో 1–3–41 – 10–5–1941 మధ్య నేనువ్రాసిన వ్యాసములు.

23–4–1941 నుండి 9–7–41 వఱకును 6–1–1943 నుండి 31–3–1943 వఱకును ఆంధ్రవారపత్రికలో ప్రతివారము నేను వివిధ శీర్షికలక్రింద వ్రాసిన చారిత్రక వ్యాసములు.

"ఇంగ్లీషు నాగరికత – దాని ప్రభావము".
1943 వ సం॥ మార్చినెల భారతిలో నేను వ్రాసినవ్యాసము.

కథలు – గాథలు – దిగవల్లి వేంకట శివరావు.
బ్రిటిష్ ఇండియా చరిత్ర (1938) ,,



# దిగవల్లి వేంకట శివరావుగారి రచనలు

1924 పోతన, వేమనల యుగము (చెన్నపురిరాజధాని) కళాశాలవారి పవెల్ & మోర్ హెడ్ బహుమానము రు 150 లు పొందినది.

1926 హిందూధర్మశాస్త్ర సంగ్రహము.

1928 దక్షిణాఫ్రికా చరిత్ర. (విజ్ఞానచంద్రికామండలి ప్రచురణ).

1929 నీలాపనింద (జమీందారులకథ) నవల.

1930 (1) సత్యాగ్రహ చరిత్ర (2) నిర్భాగ్యభారతము (3) దరిద్రనారాయణీయము (4) బార్డోలీ సత్యాగ్రహ విజయము (5) విదేశవస్త్రబహిష్కారము (6) బ్రిటిషు వస్తుబహిష్కారము (7) సత్యాగ్రహబోధిని. పై ఆరు పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘ ప్రచురణలు - 20 వేల ప్రతులు. 1932 లో నిషేధింపబడినవి.

1933 (1) అధినివేశస్వరాజ్యము (విజ్ఞానచంద్రికా ప్రచురణము) (2) సహకారవస్తు నిలయోద్యమము (కృష్ణాజిల్లా కో-ఆపరేటివ్ ఫెడరేషన్ ప్రచురణము) (3) భారతదేశ స్థితిగతులు.

1934 వ్యవహారకోశము (ఇంగ్లీషు తెలుగు పారిభాషిక నిఘంటువు.)

1935 శాస్త్రపరిభాష డిటో డిటో

1936 (1) అంకుల్ టామ్‌కథ (2) నూతన ఇండియా రాజ్యాంగము (3) నవీన (రష్యా) ఆర్థికనీతి. (ఈ రెండును ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ ప్రచురణలు) (4) రాష్ట్రీయ స్వపరిపాలనము.

1938 (1) భారతదేశమున బ్రిటిష్‌రాజ్యతంత్రము (2) బ్రిటిష్ ఇండియా చరిత్ర (3) వ్యవసాయదారుల ఋణవిమోచనచట్టము.

1939 ఫెడరేషన్ నిజస్వరూపము (డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారితో కలసి చేసిన రచన – ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘప్రచురణము – 5 వేల ప్రతులు).

1941 ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర – సంపాదకుని పీఠిక – వివరణలు – అనుబంధములుగల తృతీయ ముద్రణము

1944 కథలు – గాథలు మొదటిభాగము (వేంకట్రామ అండ్ కో., ప్రచురణము)

1945 కథలు – గాథలు రెండవభాగము డిటో

1946 కథలు – గాథలు మూడవభాగము డిటో

1947 కథలు – గాథలు నాలుగవభాగము డిటో

చివర 5 పుస్తకములు తప్ప తక్కినవి పునర్ముద్రణము కావలెను.

1957– 1857 పూర్వరంగములు (విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రచురణ).

☆

( అ ము ద్రి త ము లు )

1. కథలు - గాథలు 5, 6 భాగములు
2. జీవిత గాథలు
3. ఆంధ్రప్రదేశ చరిత్ర
4. భారతదేశ స్వాతంత్ర్య సమరములు 1757-1857
5. సన్యాసుల దండయాత్రలు 1763-1775
6. బిషప్ మోంబరు భారతదేశయాత్ర
7. మధుర నేలిన తెలుగు నాయకులు
8. ఆంగ్ల ప్రభుత్వ యుగము
9. ప్రజా ప్రభుత్వ సంప్రదాయములు

ఇ త్యా దు లు

## Unpublished English Works of the Author

1. "1757 - 1857"
2. The Christinization of India
3. The Hindu Moslem Civilisation of India
4. British Rule in India
5. The Wars of Sanyasis 1763 - 1775
6. Historical Studies

అమ్మకమునకు సిద్ధముగా నున్నవి

| | | |
|---|---|---|
| కథలు - గాథలు 1-2 భాగములు | రు. | 3-8-0 |
| ,, 3-4 భాగములు ఒక్కొక్కటి | | 2-0-0 |



# అభిప్రాయములు

## బ్రిటిష్ ఇండియా చరిత్ర

### (భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము)

● ఎన్నో గ్రంథాలు చదివి, ఎన్నోఏళ్ళు కృషిచేస్తేనే గాని ఇలాంటి వాస్తవచరిత్ర వ్రాయడం దుర్ఘటము.

ప్రతిభ, అక్టోబరు 1938.



● "బానిసలుగా వుంచాలనే దృష్టితో సత్యాన్ని కప్పిపుచ్చి కల్పనలుచేసి వ్రాయబడ్డ హిందూదేశ చరిత్రలే నేటి విద్యావిధానంలో ఉపయోగింప బడుతున్నాయి. కాని గ్రంథకర్త గారు శ్రమించి అనేక విషయాల్ని సేకరించి యథార్థ హిందూదేశ చరిత్రని యీ పుస్తకంలో పొందు పరచాను. అయోమయంగాను, అసత్య భూయిష్ఠంగాను వున్న గడచిన భారతదేశంయొక్క నిజచరిత్ర తెలిసికొనవలెనంటే యిది చదివితీరాలి.

"ఇట్టి అత్యుత్తమ విషయాల్ని చేకూర్చి వ్రాసిన శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారికి మా ధన్యవాదాలు."

—గృహలక్ష్మి, జూన్ 1939.

● "శివరావుగారు న్యాయవాద వృత్తిలో వుండికూడా అవకాశం చేసుకుంటూ దేశానికి వుపకరించే గ్రంథాలు చాలా వ్రాశారు. వీరు మన దేశంలో Publicists లో ప్రముఖులు. విషయములను బాగా చర్చించి నిష్పాక్షిక సమాధానం చెప్పగలశక్తి వీరికి బాగావుంది. ఒట్టిమాటలు కాక, చెప్పిన ప్రతి సందర్భాన్నీ ప్రమాణాలతో అంకెల పట్టికలతో సమర్థిస్తారు.

"బ్రిటిషువారి రాజ్యతంత్రము ఏవిధంగా మన దేశంలో పరిణమించిందో, అభివృద్ధి నిజంగా అభివృద్ధి అవునో కాదో, నూతన ఇండియా రాజ్యాంగచట్టము ఎటువంటిదో చాలా బాగా వివరించారు...

"అనేక అపూర్వ గ్రంథములు, రిపోర్టులు, రికార్డులు పరిశీలనచేసి ఈ గ్రంథము వ్రాసినారు."

—ప్రతిభ, ఏప్రిల్ 1938.



● "తెలుగుదేశంలో తెలుగువారికి సమస్తవిషయాలు తెలిపే గ్రంథాలు తెనుగుననే ఉండాలని నమ్మి అందుకొరకు శక్తివంచన చేయక పాటుపడుచున్న గ్రంథకర్తలలో శివరావు గారు ఒకరు...... విషయాలన్నీ లెక్కలతోసహా చక్కగా వ్రాసి ఆంధ్రసేవ చేశారు."

—ప్రజామిత్ర, 12-6-38.



# కథలు - గాథలు

## (మొదటి భాగము)

### భారతి పత్రికాభిప్రాయము

“భారతి, ఆంధ్ర వారపత్రికా పాఠకులకు మైన దిగవల్లి వారి రసవచ్చరిత్ర రచనలు అలతి అలతి మార్పులతో ప్రస్తుత గ్రంథరూపము దాల్చినవి. ‘చక్రవర్తికి శిక్ష విధించిన దివానులు’ ‘తురకల దశావతారములు’ ‘సీతారాముల శాపం’, ‘కాశీ మసీదులో శివలింగం’ మొదలైన వింత వింత శీర్షికలతో శివరావుగారు తాము పాతపురాణములను, పాత కవిలె కట్టలను, అనన్యసామాన్యమైన ఓర్పుతో పరిశోధించి బయటికిలాగిన అనేక యదార్థ చరిత్రలను చక్కని కథల రూపమున ఈ గ్రంథమున చిత్రించియున్నారు. నిజమునకిది చరిత్ర గ్రంథమైనను కథల సంపుటివలె జనసామాన్యమునకు సయితము చదువ నింపుగా నున్నది. ఈ గ్రంథమందు ప్రతిపుటలోను శివరావుగారి పరిశోధన ప్రావీణ్యము, సత్యాన్వేషణ తత్పరత ద్యోతకమగుచున్నది.”

— భారతి, తారణ సం। కార్తీకము.



ఆశ్రమము, 22-3-1928

ప్రియ మిత్రమా !

మీరు వ్రాసిన 19 వ తేదీ ఉత్తరమును, దానితో పంపిన దక్షిణాఫ్రికా చరిత్రయు గాంధీజీకి చేరినది. అందులకు వారు మీకు వందనము లర్పించుచున్నారు. మీగ్రంథములను చదివించుకొనుటకు వారికి తగు అవకాశము లేనందులకు వారు చింతించుచున్నారు. అయితే ఆశ్రమమునకు వచ్చు తెలుగు విద్యార్థుల యుపయోగముకొరకు గ్రంథమును ఆశ్రమ పుస్తక భాండాగారము నందుంచునట్లు వారు సిఫారసు చేయుచున్నారు.

భవదీయుడు,

మహాదేవ దేశాయి

★

## ఆంధ్ర విశ్వకళా పరిషత్తు

శ్రీ సి. ఆర్. రెడ్డి (గౌరవ. డి. లిట్.) ఉపాధ్యక్షులు.

వాల్తేరు
20 నవంబరు 1939

ప్రియమైన అయ్యా !

అమూల్యమైన మీ బ్రిటిష్ రాజ్యతంత్రమును నాకు బహూకరించినందులకు నా హృదయపూర్వక వందనములు. దీని రచనా విధానము అత్యంతామూల్యముగనున్నది. దాని రచనకు తోడ్పడిన గ్రంథ సముదాయముయొక్క పట్టిక దీని విలువను మరింత హెచ్చించుచున్నది. ఈ గ్రంథమునకు విశేషమైన వ్యాప్తి కలుగునని నమ్ముచున్నాను.

భవదీయుడు,

సి. ఆర్. రెడ్డి.

# సవరణలు



| | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| పీఠిక | 4 | 5 | నాశ్రయంలో | నాశ్రయించు |
| | 5 | 11 | 1884 | 1824 |
| గ్రంథము | 17 | 17 | నిడులాడడం | సిడులాడడం |
| | 66 | 14 | 1898 | 1839 |
| | 52 | 24 | కలిగిన | కలిసిన |
| | 82 | 16 | మొన్న నేగా | మొన్న నే |
| | 91 | 9 | యింతఎంత | యిదిఎంత |
| | 206 | 8 | కోర్టులన్నీ | కోర్టులనిన్నీ |
| | 220 | 8 | అనకా | అనగా |
| | 261 | 15 | నింతవరకు | ఇంతవరకు |

